# ఆంధ్రప్రదేశ్

మే 1976

వెల 50 పైసలు



# కందుకూరి వీరేశలింగం

1848 ఏప్రిల్ 16 ఉదయం రాజమహేంద్రవరంలో - కందుకూరి సుబ్బారాయుడికీ పున్నమ్మకూ పరమేశ్వరుడు ఒక మగ శిశువును ప్రసాదించాడు. వానికి వీరేశలింగం అని పేరు పెట్టారు.



ఆరు నెల్లు నిండాయి వీరేశలింగం చాలా అర్భకుడిగా ఉండే వాడు. తల్లి దండ్రులు పొత్తిళ్ళల్లో పెట్టి పెంచుకుంటున్నారు.



ఇంతలో -




ఆరు నెలల పసివానికి మశూచి వ్యాధి సోకింది. మూసిన కన్ను తెరవలేదు. ఆశ వదులుకున్నారు.




వీరేశలింగం మృత్యువు నోట నుంచి ఎలాగైతేను బయటపడ్డాడు. అది దైవానుగ్రహం అని చెప్పాలి. నాలుగు ఏళ్ళు నిండాయి. కాని, ఇంకా అర్భకుడిగానే ఉన్నాడు. తల్లి చాలా జాగ్రత్తగా చూసుకుంటోంది—




ఉద్యోగ రీత్యా- సుబ్బారాయుడు వొరేనాటులో ఉంటూండగా కొంచెం సుస్తీచేసి హఠాత్తుగా మరణించాడు. వీరేశలింగానికి అప్పటికి నాలుగేళ్ళ వయసు.

తండ్రి పోయిన మరుక్షణం నుంచి వీరేశలింగాన్ని పెద్ద తండ్రి వెంకటరత్నం చేరదీశారు.




ఉత్తరక్రియలు అవగానే తమ్ముని భార్యను, రాజమహేంద్రవరం వచ్చెయ్యమని వెంకటరత్నం కబురు పెట్టారు. వీరేశలింగం తల్లి పిల్లవాడితో బయలుదేరారు. దారిలో - కాలువ దాటుతూ ఉండగా -

తుఫాను బాగా ఎగసి అలలు వచ్చాయి -



# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 20

మే, 1976
వైశాఖ-జ్యేష్ఠ, 1898 శా.శ

సంచిక : 7

ప్రధాన సంపాదకులు :
శ్రీ రాజ్యం సిన్హా

సంపాదకులు :
కుందుర్తి ఆంజనేయులు

అమృతమున్న దీయనగు
నాంధ్రమె మామక మాతృభాషగా
రమణ దలిర్ప సత్కృతుల
వ్రాయనె కోరెద జన్మ జన్మలన్

—శ్రీ వానమామలై వరదాచార్యులు

ముఖచిత్రం : బడుగు వర్గాలకు గృహవసతి

రెండు, మూడు కవరు పేజీలు: కందుకూరి వీరేశలింగం జీవిత చరిత్ర (బుజ్జాయి బొమ్మల సీరియల్)

మధ్యపేజీలో : కృష్ణా జిల్లాలో బడుగువర్గాలకు ప్రభుత్వం చేయూత (ఛాయాచిత్రాలు)

చివరి కవరు పేజీ ; "విశ్వకవి" రవీంద్రుడు

సాలు చందా ఆరు రూపాయలు

వెల: 50 పైసలు

రిజిస్టరు నెం: హెచ్/హెచ్. డి. 81

## ఈ సంచికలో...

పేజీ



ఈ సంచికలో రచయితలు వెలుబుచ్చిన అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి చెందినవిగా భావించ నక్కరలేదు.

# కరదీపిక

జనపదాలు జన పథాన్ని నిర్దేశిస్తున్నాయి
జాతి నరాల్లో క్రమశిక్షణ పారుతోంది
నీతిహీనత కఠిన శిక్షను పొందుతోంది।

బలహీనవర్గాలు వెలుతురు పాట పాడుకుంటున్నాయి
సన్నకారు ప్రజలు సమానతల బాట చేరుకుంటున్నారు।

ఆందోళనల రాచపుండుకు
అవలీలగా జరిగింది శస్త్రచికిత్స।

అవ్యవస్థాకూపంలో గిరికీలు కొట్టే
మనిషి మేథస్సులో వెలిగింది—
ఆరోగ్యకరమైన విచికిత్స॥

కఠోర పరిశ్రమ అభ్యుదయాన్ని కేలెత్తి పిలుస్తున్నది,
దృఢదీక్షపై ఆర్థికన్యాయం వేళ్లాని నిలుస్తున్నది।

ఇరవై సూత్రాలు
అరవై కోట్ల గుండెల్ని కలిపి కుట్టేయి,
ఇజాలతో సంబంధం లేని నిజాలు-కోట్లాది మనసుల్ని
ఒక్క త్రాటిమీద నిలబెట్టేయి।

అస్తవ్యస్తపు దుస్థితిలో
అత్యవసర పరిస్థితే కరదీపిక।
అదే అదే నూతనాధ్యాయానికి విషయసూచిక॥

—విహారి & శాలివాహన

ఆంధ్ర ప్రదేశ్

# ఆత్మ విశ్వాసంతో విశాల విశ్వంలో అడుగు పెట్టండి



### ఉస్మానియా పట్టభద్రులకు ముఖ్యమంత్రి ఉద్బోధ

— తెలుగులో స్నాతకోపన్యాసం —

పరీక్షలలో ఉత్తీర్ణులై, ఈ రోజు డిగ్రీలు తీసుకొన్న విద్యార్థులను ఈ స్నాతకోత్సవ శుభ సమయంలో ముందుగా అభినందిస్తున్నాను.

విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు తమ ప్రసంగంలో నన్ను గురించి ఎన్నో ప్రశంసా వాక్యాలు పలికారు. నేను ఆ ప్రశంస అన్నిటికీ అర్హుడనని భావించడం లేదు. అయితే వారు చెప్పిన వాటిలో ఒక విషయంతో మాత్రం నేను హృదయ పూర్వకంగా ఏకీభవిస్తున్నాను. నేను మితభాషిననీ, సాధారణంగా ఎక్కువ మాటాడననీ ఆయన పేర్కొన్నారు. అది నిజమే. వారు చెప్పిన దానిని సార్థకం చేసే ఉద్దేశంతో వీలయినంత క్లుప్తంగా నేను ప్రసంగిస్తాను.

ఈ మహా విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసం చేయవలసినదిగా నన్ను కోరినప్పుడు, ఏ విషయం గురించి ప్రసంగిస్తే బాగుంటుందో అని నేను ఆలోచించు కొన్నాను. మన దేశంలో ఉన్నత విద్యకుగల స్థానాన్ని గురించి, దేశంలో నేడు, రేపు విద్యావంతులు వహించవలసిన పాత్రను గురించి మీతోపాటు నా అభిప్రాయాలను పంచుకోవాలని నిశ్చయించు కొన్నాను. అయితే నేను విద్యావేత్తనూ కాను; విద్యకు సంబంధించిన సంస్కరణలలో ప్రవీణుడనూ కాను. అయితే ఎన్నో సంవత్సరాలుగా ప్రజాజీవిత సంరంభంతో నాకు ఏర్పడిన సన్నిహిత సంబంధాల వల్ల, మన విద్యాసంస్థల తీరుతెన్నులను గురించీ, యువతరంపై నేటి విద్యా విధానం యొక్క ప్రభావాన్ని గురించీ పరిశీలనాదృక్పథంతో గమనించే అవకాశం లభించింది. ఈ అనుభవాలను పురస్కరించుకొని నేనిప్పుడు ప్రసంగిస్తాను.

## విద్యా విధానంలో మార్పు

స్వాతంత్ర్యం సిద్ధించిన పాతికేళ్ళ తరువాత కూడా భారతీయ విద్యా విధానం తనదైన ఒక వ్యక్తిత్వాన్ని రూపొందించుకొనేటంతగా పెరగలేదనడం సత్య దూరం కాదు. మనం విదేశీయుల పరిపాలనలో ఉన్నప్పుడు మన దేశానికి ఎటువంటి విద్యా విధానం తగినదీ, అవసరమైనదీ అని ఆంగ్లేయ పాలకులు భావించారో అటువంటి విద్యా విధానాన్నే రూపొందించారు. ఆ విద్యా విధానం మానసిక క్రమశిక్షణకు, విజ్ఞాన సముపార్జనకు కొంతవరకు దోహదం చేసినప్పటికీ అది నిజంగా ప్రగతిశీలమైన విధానం మాత్రం కాదు. గుమాస్తా ఉద్యోగాలకు అవసరమయ్యే విద్యావంతులైన యువకులను అధిక సంఖ్యలో తయారు చేసేగుణం ఆ విద్యా విధానంలోనే ఉంది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కొత్త ఆశయాలు, కొత్త అవసరాలు తలయెత్తినవి. సమాజం విద్యా విధానంలో మార్పులు ఆశించింది. ఆ మార్పులు జరిగాయి కూడా. ఐతే దురదృష్టవశాత్తూ విద్యా విధానంలో ఆ మార్పులపట్ల చూపే ఉత్సాహ అభినివేశాలకు, ఆ మార్పులు ఏ విధంగా రావాలి, ఏ రూపంలో ఉండాలి అనే ఆలోచనలకూ పొందిక కుదరలేదు. తత్ఫలితంగా దేశంలో వేర్వేరు ప్రాంతాలలోని విద్యా విధానాలలో ఒక దానితో ఒకటి పొంతన లేని విధంగా ఎన్నో మార్పులు వచ్చాయి. ఇందువల్ల విద్యా ప్రణాళికల స్వరూపంలోను, నిర్వహణలోను, ఎన్నో చిక్కులు ఏర్పడినాయి. విద్యార్థులు ఒక ప్రాంతంనుండి ఇంకొక ప్రాంతానికి పోయి చదువుకొనడానికి ఎన్నో అడ్డంకులు తలయెత్తాయి. సాంకేతిక విద్యలకు, వృత్తి కల్పన విద్యలకు మనం ఈనాడు ఇచ్చే అత్యధిక ప్రాముఖ్యం విద్యార్థులలో నిరాశా నిస్పృహలకు దారితీయకుండా ఉండాలంటే మన విద్యా విధానాలను, ప్రణాళికలను సాంకేతిక, పారిశ్రామిక రంగాల అవసరాలకు అనుగుణంగా మలచుకోవలసి ఉంటుందని మనం అనుభవం ద్వారా తెలుసుకొన్నాము. విద్యా సంస్కరణల విషయంలోనూ, ప్రణాళికల నిర్వహణలోనూ మనం ఇంకా ఎంతో ప్రగతి సాధించవలసి ఉంది. అయితే ఇటీవలి సంవత్సరాలలో ఇందుకు సంబంధించిన మౌలిక సమస్యలను బాగా అవగాహన చేసుకొని, వాటి పరిష్కారానికి మరింత ప్రయోజనాత్మకమైనచర్యలు తీసుకోవడం జరుగుతున్నదని చెప్పక తప్పదు.

ఉన్నత విద్యావిధానం ఏ విధంగా ఉన్నప్పటికీ ఎప్పటికీ మారని కొన్ని అంశాలు ఉన్నాయని మనం ముందుగా గుర్తించటం ఎంతో అవసరం. వాటిలో మొదట చెప్పకోవలసింది మామూలు విద్యలలో కాని, సాంకేతిక విద్యలలోకాని అత్యున్నత ప్రమాణాలను సాధించి తీరవలెనన్న దృఢనిశ్చయం. కళలేగాని, సామాజిక శాస్త్రాలేగాని, కేవల శాస్త్రాలేగాని, అనువర్తిత శాస్త్రాలేగాని ఇంజనీరింగు విద్యగాని, సాంకేతిక విద్యగాని—అధ్యయన రంగం

ఏదైనా సరే ఉన్నతోన్నతములైన ప్రమాణాలను, నైపుణ్యాలను సాధించడం ఉన్నతవిద్య ప్రధాన లక్ష్యం కావాలి. ఈ లక్ష్యసాధనలో విద్యావిధాన నిర్వహణాధికారి, ఉపాధ్యాయుడు, విద్యార్థి–వీరందరూ భాగస్వాములే. ఉన్నత విద్యా సంస్థలలో విద్యార్థుల ప్రవేశాన్ని క్రమబద్ధం చేయటం ద్వారా ఇది కొంతవరకు పరిష్కారమవుతుందనటం నిజమే అంతే కాకుండా విద్యాప్రమాణాలను మెరుగుపరచటం కోసం విద్యా సంస్థలు తమకు తామే కృషి చేసి, ప్రతి విద్యార్థి తనకున్న శక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించుకొని అందుకోగలిగిన గరిష్ఠ స్థాయిని అందుకోవడానికి దోహదం చేయాలి. ఇది జరగాలంటే అధ్యాపకులు మాత్రమే కాక విద్యార్థులు కూడా ఈ లక్ష్యసాధనకు అంకితం కావలసి ఉంటుంది. నిజానికి విశ్వవిద్యాలయాలలోను, ఇతర ఉన్నత విద్యా కేంద్రాలలోను విద్యాభ్యాసం చేస్తున్నప్పుడే ఈ విధమైన ఔన్నత్యం సాధించవలెనన్న లక్ష్యం విద్యార్థులలో ప్రేరితమవ్వాలి అంతా మహామేధావులు కాలేరు అన్నమాట నిజమే. కాని, తాను మహా మేధావి కావాలని ప్రతివిద్యార్థి కృషి చేయడానికి ప్రతిబంధకాలేవీ లేవు. విశ్వవిద్యాలయాలలో విద్యార్జన చేసే వేలాది విద్యార్థులలో అత్యున్నత శిఖరాలను అందుకోగలిగిన మేధావులు, శక్తిమంతులు చాలా మంది ఉంటారని నావిశ్వాసం విద్యార్జనలో విశిష్టత సాధించటానికి చేసే
షి ఫలితంగా మానవ మేధకు క్రమశిక్షణ, సుశిక్షణ లభిస్తాయి.
త కాలమంతా ఈ గుణాలు తరుగని ఆస్తిగా ఉంటాయి.

## ప్రతిభకే పరిగణన

ప్రతిభ ఒక్కటే గౌరవ హేతువు కాగల వాతావరణాన్ని సృషించవలసిన బాధ్యత విశ్వవిద్యాలయాల మీద ఉంది. ఉన్నత విజ్ఞానస్థాయిలో పరిగణనకు రావలసినవి అధిక సంఖ్యాబలం, సగటు లెక్కలు కావు; సాధించిన ఫలితం విశిష్టత–ఇవే పరిగణింపబడాలి. ఇందులో కొత్త విషయం ఏమీలేదు ప్రాచీన కాలంలో, భారత దేశంలో, విద్య కోసమే విద్యను సముపార్జించే ఆచార్యవర్యులకే సమాజంలో ఉన్నత గౌరవం లభించేది అయితే ఉన్నత ప్రమాణాల సాధనకు, జీవితంలో ప్రయోజనకరమైన ఆచరణకు వైరుధ్యం ఉండవలసిన అవసరం లేదు అనువర్తిత, సాంకేతిక విద్యలలో కూడా ఈ ఆదర్శానికి చాలా ప్రాధాన్యం ఉంది వైద్య విద్యలోను ఇంజనీరింగు విద్యలోను, యంత్ర నిర్మాణ శాస్త్రంలోను, వాస్తు తదితర సాంకేతిక విద్యలలోను, నూతన విషయాలను కనిపెట్టి ఆవిష్కరించడానికి ఎంతో అవకాశం ఉంది. నిజానికి ఈ రంగాలలో నవనవోన్మేషంతో కూడుకొన్న కృషికి పరిధులు పెట్టడం కష్టమే. ఈ విషయంలో అధ్యాపకులు గురుతరమైన బాధ్యత వహించవలసిఉంది. అధ్యాపక కార్య క్రమానికి సంపూర్ణంగా అంకితం కావటం తమ అధీనంలో ఉన్న విద్యార్థుల శ్రేయస్సు కోసం అకుంఠితంగా కృషి చేయటం వారి నిరంతరధ్యేయం కావాలి. విద్యా ప్రమాణాలు దిగజారి పోవటానికి కొంత వరకు అధ్యాపక వర్గాలలో ఈ విధమయిన భావన లేకపోవటమనేది కారణం కావడం చాలా విచారకరమైన విషయం.

ఈ సందర్భములో నేను నొక్కి చెప్పదలచుకున్న రెండవ అంశం దేశంలోని స్థితిగతులకు అనుగుణంగా మన విద్యావిధానాలను, వైఖరులను రూపొందించుకోవలసిన అవసరం. విజ్ఞానం అనేది అఖండమైనది అయితే, దాని అనువర్తనం మనం నివసిస్తున్న పరిసరాల మీద ఆధారపడి ఉంటుంది మన విద్యా విధానాన్ని గురించి తరచుగా వినవచ్చే ఒక విమర్శ –ఆ విధానం మన దేశంలోని పరిస్థితులకు అనుగుణంగా లేదు అన్నది. ఇందులో కొంత నిజం లేకపోలేదు. కాని సువిశాలమైన మన దేశం యొక్క అవసరాలను దృష్టిలో పెట్టుకొని క్రమేణా సముచితమైన విద్యా విధానాన్ని మనం రూపొందించుకోగలమనే విశ్వాసం నాకు వుంది. ఈ లక్ష్యంతో తీసుకొన్న కొన్ని చర్యలను గూర్చి విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఇంతకుముందే ప్రస్తావించారు. ఈ విధానం ఇకముందుకూడా కొనసాగుతుందనటంలో సందేహం లేదు ఏమైనా, ఈ సమస్య కేవలం విధానాలకు, పాఠ్యాంశాలకు, మాత్రమే పరిమితమైనదికాదు నిజానికి, అది దృక్పథాలకు సంబంధించినది. మనం నివసిస్తున్న పరిసరాలను గురించి, మన జాతీయ జీవనంలోని వివిధాంశాలకు వర్తించే ప్రాధాన్యతలను గురించి, ఇతోధికమైన అభిజ్ఞానాన్ని విశ్వవిద్యాలయాలలో కలిగించవలసిన అవశ్యకత ఎంతగానో వుంది అంతేకాదు, గ్రామీణ భారతదేశపు ప్రాముఖ్యాన్ని గూర్చి, ఉన్నత విద్యాఅవకాశాలు పొందిన కొద్దిమంది అదృష్టవంతుల నుండి గ్రామీణ సమాజంలోని అధిక సంఖ్యాకులు న్యాయంగా అపేక్షింపదగిన శ్రద్ధాసక్తులనుగూర్చి విశేషించి నొక్కిచెప్పవలసి ఉన్నది. మేధావి, సాంకేతిక నిపుణుడు ఈ ఇద్దరూ కూడా జాతికి బాగా ఋణపడి ఉన్నారు. అసంఖ్యాకమైన ప్రజల సాంఘిక, ఆర్థిక స్థితిగతులను ఏదో ఒక విధంగా మెరుగుపరచడం ద్వారానే ఈ ఋణాన్ని వారు తీర్చుకోగలుగుతారు. ఈ మార్పు తప్పక వస్తుందనీ, అదీ త్వరలోనే వస్తుందనీ నేను ఆశిస్తున్నాను. వైద్యసౌకర్యాలు బొత్తిగాలేని గ్రామసీమలలో వుండి కష్టపడి పనిచేయడానికి బదులుగా, పట్టణ ప్రాంతాలలోనే జీవితాలు గడుపుతూ ఏదోవిధంగా పొట్టపోసుకోవాలని చూస్తున్నారు మన యువ వైద్య విద్యా పట్టభద్రులు ఇటువంటి విపరీతాలు ఇక ముందు ఉండబోవని నేను ఆశిస్తున్నాను.

మిత్రులారా! మీరంతా ఉన్నత సంప్రదాయాలుగల విశ్వవిద్యాలయానికి చెందినవారు. ఆ మధ్య, ఈ ఉన్నత విద్యాసంస్థలో చీకట్లు ముసురుకున్నాయనీ, ఈ మహాసంస్థ పేరు ప్రతిష్ఠలకు భంగం వాటిల్లిందనీ అందరికీ తెలిసిన విషయమే. అటాగ ఎందుకు జరిగింది, అందుకు ఎవరు బాధ్యులు అనే ప్రశ్నల జోలికి మనం ఇప్పుడు పోనక్కరలేదు వ్యక్తుల జీవితాలలోవలనే, సంస్థల జీవితాలలోనూ దురదృష్టం అప్పుడప్పుడూ తొంగిచూస్తూఉండటం కద్దు. అయితే గత రెండు విద్యా సంవత్సరాల కాలంలోనూ ఈ విశ్వవిద్యాలయం చెప్పుకోదగిన అభివృద్ధిని, ప్రగతిని సాధించి, సాటి ఉన్నత విద్యా కేంద్రాల నడుమ సగర్వంగా తల ఎత్తుకొని నిలబడగలగటం ఎంతో సంతృప్తిని కలిగిస్తున్నది. ఈనాడు డిగ్రీలు తీసుకొని, ఈ విశ్వవిద్యాలయం నుంచి జీవిత విశ్వవిద్యాలయంలో అడుగు పెడుతున్న మీరంతా 'మేము ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చదువుకొన్నాము' అని సగర్వంగా చెప్పుకోవచ్చు.

స్నాతకోత్సవంలో డిగ్రీలు తీసుకొని విశాల విశ్వంలో అడుగు పెడుతూన్న విద్యార్థులకు స్నాతకోపన్యాసం చేసే వ్యక్తి సాధారణంగా ఏదో సలహా ఇవ్వటం పరిపాటి. నేను మీకు చెప్ప వలసినది ఒక్కటే— "మీ మీ అదృష్టాలను అనుసరించి జీవితంలో మీరు ఎటువైపు పయనించినా, కష్టపడి పని చేయండి" ఈ సందర్భంలో మన ప్రియతమ నాయకుడు పండిత జవహర్ లాల్ నెహ్రూ చెప్పిన మాటలను ఉదాహరించటం కంటె నేను అధికంగా చెప్పవలసిన అవసరంలేదు—

"ఏం చెబుతారన్నది కాదు. ఏం చేశారన్నది ముఖ్యం. బుద్ధి తీక్షణత, శీలబలం, చురుకుదనం ఉన్నవాళ్ళకు ఈ ప్రపంచం ఎంతటి మహోపకారాలను కల్పించగలదో ఆలోచించండి. భారతదేశం ఇవ్వగలిగిన అవకాశాలను గూర్చి కూడా ఆలోచించండి. భారత దేశంలోని క్లిష్ట సమస్యలను గూర్చి, అసంఖ్యాక ప్రజలు అనుభవిస్తున్న బాధలు, దైన్యంగూర్చి మీకంటె నాకు ఎక్కువగా తెలుసు. ఈ సమస్యల పరిష్కారం ఇంద్రజాలంతోకాదు; దృఢమైన మనోబలంతో, నిరంతర కృషితో ఈ సమస్యలను పరిష్కరించడానికి పూనుకొన్నాం.............. ...ఘనకార్యాలను సాధించటానికి కొంతకాలం పడుతుంది; ఓర్పు అవసరమవుతుంది. దేనినిగురించి ఆందోళనపడీ ప్రయోజనంలేదు. అప్పుడప్పుడూ అపజయాలు ఎదురవుతూనే ఉంటాయి. అయినా ముందుకు పోతూ ఉండవలసిందే. ఏ ఇబ్బందులూ లేకుండా విజయం ఆకాశం నుండి హఠాత్తుగా ఊడిపడదు. మీకు భారత దేశంలో ఎదురయ్యే గొప్ప అవకాశాలు ఇవే. వీటిని అందుకోవడానికి మీరు సిద్ధం కావాలి. మానసికంగాను, శారీరకంగాను శక్తిని ఆర్జించండి. ఘనకార్యాలు సాధించాలనే తహతహ మీలో పెరిగితే, మీరు తప్పకుండా వాటిని సాధించగలుగుతారనటంలో సందేహం లేదు."

అందువల్ల ఆత్మవిశ్వాసంతో, ఉత్సాహంతో విశాల విశ్వంలో అడుగుపెట్ట వలసిందిగా మిమ్మకోరుతున్నాను. చక్కటి ఆరోగ్యం కష్టసహిష్ణుత, ప్రయత్నసాఫల్యం—వీటిని చిరకాలం మీకు దైవం అనుగ్రహించునుగాక !





న్యూఢిల్లీలో మార్చి 6వ తేదీన ఆంధ్రా ఎడ్యుకేషన్ సొసైటీలో పనిచేస్తున్న మహిళా ఉపాధ్యాయినులు, తదితర కార్యాలయ సిబ్బందితో ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ముచ్చటిస్తోన్న దృశ్యం.

# ప్రగతి విప్లవానికి ప్రారంభ దశ
# రాష్ట్రంలో ఇరవై సూత్రాల ఆర్థిక కార్యక్రమం

—శ్రీ పిడతల రంగారెడ్డి



గడిచిన సంవత్సరం మన రాష్ట్రంలో ప్రజాస్వామ్య పద్ధతికి పెద్ద బెడద ఏర్పడింది. ప్రపంచ ప్రజాస్వామ్య దేశాలన్నింటిలో పెద్దదైన మన దేశం ప్రజాస్వామ్య విధానాలను చాలా కాలంగా శక్తివంతంగాను, సమర్థవంతంగాను అనుసరిస్తూ ఉన్నది మహాత్మాగాంధీ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ వంటి అగ్ర నాయకుల అడుగు జాడలలో నడుస్తూ మనం ప్రజాస్వామ్య పథంలో సోషలిస్టు తరహా నవసమాజనిర్మాణానికి నడుం కట్టుకుని ముందుకు పోతున్నాం. ఆ కార్యక్రమంలో అనేక పథకాలను వేసుకుంటూ వాటిని అమలు జరుపుకుంటూ సామాన్య ప్రజా జీవన ఆర్థిక పరిస్థితులను మెరుగు పరచడానికి కృషి చేస్తున్నాం ఈ విధంగా జరుగుతున్న సమయంలో దేశంలో అరాచకశక్తులు కొన్ని విజృంభించాయి అధిక సంఖ్యాక ప్రజల చేత ఎన్నికైన ప్రభుత్వాలు తమ విధానాలను అమలు పరచడానికి వీలులేకుండా అవరోధాలు కల్పించే పరిస్థితికి కొన్ని ప్రతిపక్షాలు వచ్చాయి. కావాలని ఏదో ఒక పేరుతో ఆందోళన రేపటం, అల్లకల్లోలాన్ని సృష్టించటం.తద్వారా దేశంలో ఏ విధమైన ప్రగతి కార్యక్రమాలూ జరుగకుండా ఆటంకాలు కల్పించటం, అధికారంలో వున్న ప్రభుత్వాలు ప్రజలకు ఏమీ మేలు చేయడం లేదని ప్రచారం చేయడం—ఇదంతా ఒక కుట్రగా, బాగా ఆలోచించి నిర్మించుకున్న వ్యూహంగా ఏర్పాటు చేసుకుని వారు ప్రయత్నాలు ప్రారంభించారు. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ చాలా కాలంగా ఓపిక వహించిన తరువాత ఇటువంటి పరిస్థితిని యిక ఏ మాత్రం కొనసాగించ కూడదని, అరాచక శక్తులు ప్రబలమైనట్లైతే దేశ ఆర్థిక వ్యవస్థ కుంటుపడుతుందని, దేశ ప్రజలలో క్రమశిక్షణ సన్నగిల్లిపోతుందని భావించి, దీనిని అదుపులో పెట్టడానికి తగిన చర్యలు తీసుకోడానికి ఉపక్రమించిన ఫలితంగా 1975 జూన్ నెలలో మనదేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది, ఆనాడు అత్యవసర పరిస్థితి అవసరం ఏమిటని ప్రశ్నించిన కొంత మంది మేధావులు కూడా ఈ నాడు దాని అవశ్యకతను గుర్తించారు. అంటే మన ప్రధానమంత్రి ఎంతముందు చూపుతో సకాలంలో సరియైన చర్య తీసుకున్నారో మనకు స్పష్టంగా తెలుస్తోంది.

## శాంతి నినాదం

గాంధీజీ శాంతి, స్వాతంత్ర్యం, అభ్యుదయం అనే వరుసలో స్వాతంత్ర్యోద్యమకాలంలో తన నినాదాలను విపులీకరించారు, అంటే ఆ రోజులలో స్వాతంత్ర్య పోరాటం జరగడానికి కూడా ప్రశాంత పరిస్థితులు కావాలనే దృష్టితో ఆయన శాంతి నినాదానికి ప్రథమ ప్రాధాన్యం ఇచ్చారు. ఈ నాడు కూడా స్వాతంత్ర్యానంతరం దేశం అభివృద్ధి చెందాలంటే. అభ్యుదయ పథంలో పురోగమించాలంటే శాంతియుతమైనటువంటి పరిస్థితులు నెలకొనడం అవసరం ప్రజాస్వామ్యం అనే పేరుతో ఎవరికి తోచిన రీతిని వారు విశృంఖలంగా ప్రవర్తిస్తే, మనం ఒక్క అడుగు కూడా ముందుకు పోలేము మన దేశంలో ప్రతిపక్షాలు యీ సత్యాన్ని గుర్తించలేదని గత సంవత్సరం జరిగిన సంఘటనల వల్ల స్పష్టమౌతుంది ప్రజాస్వామ్య దేశంలో ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాన్ని పనిచేయనివ్వాలి గడువు తీరేవరకు వారి విధానాలను అమలుపరచే అవకాశం కల్పించాలి అవి ప్రజలకు నచ్చనప్పుడు అవి మంచివి కావని ప్రతిపక్షాల వారు ప్రజల చేత ఒప్పించి తాము అధికారంలోకి రావచ్చు అంతేకాని ప్రజాస్వామ్యంలో స్వేచ్ఛ అంటే విశృంఖలంగా విహారం మాత్రం కాదు. ఏ దేశంలోని ప్రజాస్వామ్య పద్ధతికి సంబంధించిన ప్రమాణాలను బట్టి చూసినా విశృంఖలత్వం స్వేచ్ఛ అని చెప్పడానికి వీలులేదు

దేశంలో వున్నటువంటి ప్రశాంత వాతావరణాన్ని చెదరకొట్టడానికి వీలులేని విధంగా ముందుగా అత్యవసర పరిస్థితిని ప్రకటించి, వెంటనే మన ప్రధానమంత్రి కోట్లాది సామాన్య ప్రజల బాగోగులను దృష్టిలో పెట్టుకుని 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని ప్రకటించారు. నిజానికి 20 సూత్రాలఆర్థిక కార్యక్రమంలో చెప్పబడిన అంశాలు కొత్తవి ఏమీ కావు. మనం ఎన్నేళ్లగానో అనుకుంటున్న వాటిని అమలు జరపడానికి రకరకాల ఇబ్బందులు ఏర్పడినవి. అందువల్ల అత్యవసర పరిస్థితి ప్రకటించిన ఫలితంగా దేశ ప్రజలలో ఏర్పడినటువంటి క్రమశిక్షణ తోడుగా తీసుకుని దాని సహాయంతో యీ కార్యక్రమాలను అతి త్వరలో ప్రజలకు

ఫలితాలు సమకూరే విధంగా అమలు పరచాలని మన ప్రధాన మంత్రి భావించారు. ముఖ్యంగా భూసంస్కరణలు. నిరుపేదలైన వారికి ఉండడానికి ఇండ్లు రైతులకు పరపతి సౌకర్యాలు, పరిశ్రమల రంగంలో యజమానులు, కార్మికుల మధ్య సామరస్య వాతావరణం, అన్ని రంగాలలో అధికోత్పత్తి దాని ద్వారా మన జాతీయ ఆర్థిక వ్యవస్థను మెరుగుపరచే సంకల్పంతో యీ కార్యక్రమం ప్రధానంగా రూపొందించబడింది. దొంగ వ్యాపారులు, ధాన్యం నిల్వచేసేవారు, బ్లాక్ మార్కెట్ దారులు మొదలగు సాంఘిక నేరస్థులకు వ్యతిరేకంగా తీవ్రమైన ఒక ఉద్యమం దేశమంతటా 20 సూత్రాల ప్రణాళిక క్రింద అమలు జరిగింది.

మన రాష్ట్రంలో కూడా 20 సూత్రాల ప్రణాళిక అమలు పరచడంతో రాష్ట్రప్రభుత్వం అత్యంత శ్రద్ధాసక్తులు వహించి పని చేస్తున్నది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో ప్రజలలో ఎంత ఉత్సాహం వెల్లివిరుస్తూ ఉండేదో యీనాడు దేశమంతటా యీ కార్యక్రమం అమలు పరచడంలో ప్రజలలో అంత ఉత్సాహం కనిపిస్తుంది. మన రాష్ట్ర ప్రజలు మొదటి నుంచి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమానికి చేయూతనిస్తూ, ప్రభుత్వ కార్యక్రమాలు తమవే అనేటువంటి భావనతో ముందుకు వచ్చి సహకరిస్తూ ఉండడం సంతోషకరమైన విషయం.

## భూ సంస్కరణలు

రాష్ట్రంలో భూసంస్కరణలు శరవేగంతో అమలు జరుగుతున్నాయి. ఆయా గ్రామాలలోని మిగులు భూములను లెక్క తేల్చడానికి రాష్ట్ర వ్యాప్తంగా ట్రిబ్యునల్స్ నియమించబడినవి. ట్రిబ్యునల్స్ భూకమతాల పరిమితి ప్రకటనలను పరిశీలించడం జరుగుతున్నది. భూసంస్కరణల కార్యక్రమం పూర్తయిన తరువాత దాదాపు మన రాష్ట్రంలో 10 లక్షల ఎకరాల వరకు మిగులు భూమి వుంటుందని అంచనా వేస్తున్నారు. ఈ భూములను భూమిలేని వారికి, వ్యవసాయ కార్మికులకు, హరిజనులు, గిరిజనులు మొదలగు వెనుకబడిన వర్గాల వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం ఇచ్చి కేటాయించడం జరుగుతోంది. మిగులు భూముల పంపిణీ కార్యక్రమం యీ సంవత్సరం జూన్ నెల నుంచి ప్రారంభం కావడానికి అవకాశం వుంటుంది. ఇంతవరకు సుమారు 4½ లక్షల భూకమతాల ప్రకటనలు ట్రిబ్యునల్స్ వారికి చేరినవి. వీటిలో రెండు లక్షలకుపైగా ప్రకటనలను వారు పరిశీలించారు. దాదాపు 66 వేల ఎకరాలు మిగులు భూమిగా లభించింది.

దీనికి పూర్వమే ప్రభుత్వ స్వాధీనంలో వున్న బంజరు భూముల కార్యక్రమం ముమ్మరంగా కొనసాగింది. సుమారు 18 లక్షల ఎకరాల బంజరు భూమిని పేదవారికి పంచారు. చట్టానికి వ్యతిరేకంగా ప్రభుత్వ భూములను ఆక్రమించి వున్న 80 వేల మంది భూస్వాములను ఆ భూముల నుండి తొలగించడం కూడా జరిగింది. 1975 ఏప్రిల్ ఒకటవ తేదీ నుండి 3,47,560 ఎకరాలను పంచారు. దీనివల్ల దాదాపు 1,53,000 మందికి ప్రయోజనం చేకూరింది. షెడ్యూల్డుకులాలు, షెడ్యూల్డు తరగతులకు, ఇతర బలహీన వర్గాల వారికి సంబంధించి ఇండ్ల స్థలాలను మంజూరు చేసే కార్యక్రమం వింశతి సూత్రాల పథకం క్రింద ముమ్మరంగా కొనసాగింది. మాగాణీ క్రింద అయితే 3 సెంట్లు, మెట్ట అయితే 5 సెంట్లు గరిష్ఠ పరిమితిలో ఇండ్ల స్థలాలు సేకరించి దాదాపు 3 లక్షల మందికి ఇవ్వాలని సంకల్పించడం జరిగింది. ఇప్పటికే 2,70,000 పట్టాలు మంజూరు చేయబడినవి. భూమి సేకరణ చట్టానికి కొన్ని అవసరమైన సవరణలు చేయడంద్వారా ఈకార్యక్రమాన్ని వేగవంతం చేయడానికి అవకాశం కలిగింది. దీనికితోడు జిల్లా కలెక్టర్లకు కూడా ఎక్కువగా అధికారాలు ఇవ్వడం జరిగింది. మన రాష్ట్రంలో గ్రామీణ ప్రాంతాలలో ఇతరుల స్థలాలలో ఇండ్లువేసుకొని ఉంటున్నటువంటి వారికి ముఖ్యంగా భూమిలేని వ్యవసాయదారులు, వ్యవసాయ కార్మికులు, గ్రామీణ చేతిపనుల వారికి వర్తించే విధంగా ఆయా ఇండ్లు ఉన్నటువంటి స్థలాలమీద వారికి యజమాన్యపు హక్కు సంక్రమింపచేయవలెనని చాలా కాలం క్రిందనే ఒక ఆర్డినెన్స్ చేయడం జరిగింది. ఈ విధంగా గ్రామప్రాంతాలలో ముఖ్యంగా వ్యవసాయం చేసుకోడానికి భూమి, నివశించడానికి ఇండ్లు యీ రెండు సౌకర్యాలు అశేష ప్రజానీకానికి కల్పించడానికి మన ప్రభుత్వం గట్టిగా కృషి చేస్తున్నది. ఈ కృషి ఒకనాటితో ఆగిపోయేది కాదు. ఇది నిరంతరాయంగా జరుగుతూనే వుంటుంది. రాష్ట్ర ప్రజలందరికీ ఉండడానికి ఇండ్లు, తినడానికి తిండి లభింపచేయాలనేదే మన ప్రథమ లక్ష్యం. ఇదేవిధంగా గ్రామాలలో బీదరైతులు రుణబాధలకు గురి అయి అవస్థలు పడుతూ వుంటారు. వారిని తాత్కాలికంగా అయినా వడ్డీ వ్యాపారస్థుల కబంధ హస్తాలనుంచి బయటకు తేవడానికి వీలుగా మన రాష్ట్రంలో గ్రామీణ రుణ భారాన్ని తగ్గించడానికి అప్పుల మీద మారటోరియం ప్రకటించడం జరిగింది. దీనికితోడు కేంద్రప్రభుత్వం వారు ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులను కూడా నెలకొల్పి ఆయా ప్రాంతాలలోని బీదరైతులకు, వ్యవసాయ పనులు చేసుకోవడానికి వీలుగా పరపతి సౌకర్యం కల్పించడానికి పూనుకున్నారు. అటువంటి బ్యాంకు ఒకటి మన రాష్ట్రంలో ఖమ్మంలో ఏర్పాటుచేయడానికి సంకల్పించారు. దీనివల్ల ఖమ్మం, నల్గొండ జిల్లాలలోని రైతులకు ఎంతో ప్రయోజనం చేకూరుతుంది. రాష్ట్ర స్థాయిలో కూడా పరపతి సంఘాలద్వారా స్వల్పకాలిక రుణాలు, దీర్ఘకాలిక రుణాలు మంజూరు చేయడానికి కావలసిన ఏర్పాట్లు జరుగుతున్నవి. ఖరీఫ్‌పంట కాలంలో ఇచ్చిన స్వల్పకాలిక రుణాలు మొత్తం 32 కోట్ల నుండి 52 కోట్ల వరకు పెరిగాయి. చిన్న రైతులకు, సన్నకారు రైతులకు రుణాలు ఇవ్వడంలో అత్యంత ప్రాధాన్యం ఇవ్వడం జరుగుతున్నది. వ్యవసాయ పనులకోసం దాదాపు 4 లక్షల మంది సన్నకారు రైతులకు 38 కోట్లకు పైగా రుణాలు ఇవ్వడం జరిగింది. అదేవిధంగా 38 వేల మందికిపైగా పాడిపశువులను, గొర్రెలను కొనుక్కోవడానికి దాదాపు 6 కోట్ల రూపాయలవరకు రుణాలు ఇవ్వడం జరిగింది.

## వ్యవసాయ కార్మికులు

గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ కార్మికుల స్థితిగతులు ఆర్థికంగా చాలా బలహీనంగా ఉంటాయి అనే విషయం మనందరికీ తెలిసిందే. కనీస వేతనాలను 1974 ఆగస్టులో సవరించడం జరిగింది. తిరిగి 1975 డిశంబరు 2వ తేదీ నుండి అమలులోకి వచ్చేవిధంగా 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం క్రింద వీటిని మళ్ళీ ప్రభుత్వం పెంచింది. మరొక ముఖ్యమైన విశేషమేమంటే

లోగడలోవలె కాకుండా యిప్పుడు స్త్రీ, పురుషులకు సమాన వేతనాలు ఇస్తున్నారు. ప్రధానమంత్రి 20 సూత్రాల ప్రణాళిక క్రింద దేశం మొత్తంమీద 50 లక్షల హెక్టార్ల భూమికి అదనపు సాగునీటి సౌకర్యం కల్పించాలని ప్రతిపాదన చేశారు. ఇందులో మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు 7 లక్షల హెక్టార్లవరకు మనం నాగార్జునసాగర్, పోచంపాడు, తుంగభద్ర ఎగువ కాలువ, వంశధార ప్రాజెక్టులు యింకా యితర అనేక మధ్యతరహా ప్రాజెక్టుల క్రింద సాధించడానికి అవకాశం ఉంది.

ఈ దృష్టితోనే నాగార్జునసాగర్, పోచంపాడు ప్రాజెక్టుల మీద చేసేఖర్చు 36 కోట్ల మొత్తానికి చేరుకొనేవిధంగా ఏర్పాటు చేయడం జరిగింది. ఈ యేడు కొత్తగా 14 మధ్యతరహా ప్రాజెక్టులు చేపట్టడం జరిగింది. మన రాష్ట్రంలో వెట్టిచాకిరి అంతగాలేదు. అయినప్పటికీ 20 సూత్రాల పథకం క్రింద వెట్టిచాకిరిని నిషేధిస్తూ రాష్ట్రంలో ఆర్డినెన్స్ చేయబడింది. ఇటీవలనే కడప జిల్లాలో ఏడుగురు వ్యక్తులు వెట్టిచాకిరి పద్ధతిక్రింద అవస్థలు పడుతున్నట్లుగా ప్రభుత్వం దృష్టికి రాగానే అక్కడి జిల్లా కలెక్టరు వారిని వెట్టిచాకిరి నుండి విముక్తుల్నిచేసి, జీవనోపాధికోసం గొర్రెలు, మేకలు కొనిపెట్టి వారిని విముక్తులను చేయడం జరిగింది.

## చేనేత పరిశ్రమ

మన రాష్ట్రంలో చేనేత పరిశ్రమ చాలా ప్రధానమైనది. లక్షలాది మంది ప్రజలు యీ వృత్తిలో జీవిస్తున్నారు. సహకార రంగం పరిధిలోవున్నా, దాని వెలుపలవున్నా అందరు చేనేత పారిశ్రామికులకు ప్రయోజనం చేకూర్చే పథకాలు చేపట్టడం అవసరం. ఇందుకోసం చేనేత పథకాల ఎపెక్స్ సంఘాలకు 50 లక్షల రూపాయలు కేటాయించడం జరిగింది. మన రాష్ట్రంలో టెక్స్‌టైల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఏర్పాటు చేయబడింది. సహకార రంగంలోలేని చేనేత పారిశ్రామికులవద్ద నిలువవుండే సరుకును యీ కార్పొరేషన్‌వారు సేకరిస్తారు. పనిచేయకుండా వున్నటువంటి చేనేత పారిశ్రామిక సంఘాలను పునరుద్ధరించడానికి ఒక ముమ్మర కార్యక్రమం కొనసాగుతున్నది. ఇంతవరకు మన రాష్ట్రంలో ఈ రంగంలో తీసుకున్న చర్యలవల్ల అమెరికాకు, జర్మనీకి సుమారు 25 లక్షల రూపాయల విలువగల రెడీమేడ్ దుస్తులు పంపమని ఆర్డర్లు లభించాయి. అంతేకాకుండా కంట్రోలు దుస్తులు ఒక లక్ష మీటర్లవరకు ఉత్పత్తిచేయడానికి చేనేతరంగానికి కేటాయించడం జరిగింది.

ఇటీవలనే కేంద్రప్రభుత్వంవారు పట్టణభూముల జాతీయకరణ చట్టాన్నిచేశారు. మన రాష్ట్రంలోకూడా యీ చట్టం తగు మార్పులతో అమలుజరుగుతున్నది. ముందుగా హైదరాబాదు, విశాఖపట్టణం, విజయవాడ, గుంటూరు, వరంగల్ నగరాలలో మిగిలిన భూమిని లెక్కతేల్చి అక్కడి పేదప్రజలకు ఇండ్లస్థలాల కోసం మంజూరుచేయడం జరుగుతుంది.

పరిశ్రమల రంగంలో ప్రశాంత పరిస్థితులు ఏర్పడటం అనేది అతి ప్రధానమైన విషయం. దేశం ఏమాత్రం పురోగమనం సాగించాలన్నా పరిశ్రమల రంగంలో యజమానులకు, కార్మికులకు మధ్య సామరస్య వాతావరణం ఉండటం అత్యంత ప్రధానమైన విషయం. కార్మికులు చీటికీ మాటికీ సమ్మెలు జరపడం, యజమానులు లాకౌట్లు ప్రకటించడం వంటి సంఘటనలు జరుగుతూ వుంటే ఒక్క అడుగుకూడా మనం ముందుకు వేయలేము. ఇటు వ్యవసాయరంగంలోనూ అటుపరిశ్రమలరంగంలోనూ ఉత్పత్తి అధికంగా చేయగలిగితే దేశ ఆర్థిక వ్యవస్థ బాగుపడుతుంది. 20 సూత్రాల పథకం అమలు జరుగుతున్న కారణంగానూ అత్యవసర పరిస్థితివల్లనూ దేశంలో యీనాడు క్రమశిక్షణాభావం అన్ని రంగాలలో బాగా ఏర్పడింది. ముఖ్యంగా పరిశ్రమల రంగంలో ఇది ఏర్పడటం శుభ సూచకం. కార్మికులలో యీనాడు సమ్మెలు చేయాలనే ఉత్సాహం కనిపించడంలేదు. దీనికి తోడు కార్మికులకు కూడా పరిశ్రమల యాజమాన్యంలో భాగస్వామ్యం యివ్వాలనే ప్రతిపాదన 20 సూత్రాల పథకంలోని ఒక ముఖ్యాంశం. ఆ విధంగా మన రాష్ట్రంలో కూడా 10 పెద్ద పారిశ్రామిక సంస్థలలో కార్మికులకు వివిధ స్థాయిల్లో భాగస్వామ్యం లభించింది. అదే విధంగా సహకార పంచదార ఫ్యాక్టరీలలో డైరెక్టర్ల బోర్డులో కార్మికులకు సభ్యత్వం లభించింది. ఇతర ఫ్యాక్టరీలలో కూడా యీ కార్యక్రమాన్ని కొనసాగించాలని ప్రభుత్వం కృతనిశ్చయంతో ఉన్నది.

20 అంశాల కార్యక్రమంలో విద్యార్థుల అవసరాలను తీర్చడం కూడా ఒక ముఖ్యమైన కార్యక్రమం. విద్యార్థులు నివసించే హాస్టళ్లకు నిత్యావసర వస్తువులను అందజేసే విషయమై జిల్లా కలెక్టర్లకు ప్రత్యేకంగా సూచనలు యివ్వడం జరిగింది. ఈ విధంగా ఇంతవరకు దాదాపు లక్షయాభై వేల మంది విద్యార్థులకు మేలు జరిగింది. ఇందులో 73,300 మంది షెడ్యూల్డ్ తరగతి, షెడ్యూల్డ్ జాతులకు చెందినవారు. జాతీయం చేయబడిన పాఠ్యగ్రంథాలను యీయేడు ఒకకోటి ప్రతులు ముద్రించాలని నిర్ణయం జరిగింది. అంటే గత సంవత్సరం కంటే 40 శాతం ఎక్కువ. ఆయా ప్రాంతాలలో ప్రాంతీయ విక్రయశాలలను ప్రారంభించడం, పాఠ్యగ్రంథాలు అందరికీ అందేటట్లు చేయడం, గతంలో వలె కృత్రిమంగా కొరత వచ్చే పద్ధతులను నివారించడం జరిగింది. ఎక్సర్‌సైజ్ పుస్తకాలు కూడా చౌక ధరలకు లభించడానికి అన్ని ఏర్పాట్లు జరిగినవి.

ఇంతవరకు మన రాష్ట్రం వ్యవసాయ రాష్ట్రంగానే ప్రసిద్ధి చెందింది. పారిశ్రామికంగా మనం ఇంకా కొన్ని ఇతర రాష్ట్రాల కంటే వెనుకబడి వున్నామనే విషయం యథార్థం. అయినా ఇప్పుడు రాష్ట్రంలో ప్రశాంతమైన వాతావరణం ఏర్పడి వుండడం వల్ల ఇతర రాష్ట్రాల నుండి పారిశ్రామికవేత్తలు మన రాష్ట్రంలో పెట్టుబడి పెట్టడానికి ముందుకు వచ్చే అవకాశాలు వున్నవి. వారికి కావలసినటువంటి సౌకర్యాలను కల్పించడానికి రాష్ట్ర ప్రభుత్వం సిద్ధంగా వుంది. పరిశ్రమలు వృద్ధి పొందాలంటే విద్యుచ్ఛక్తి చాలా అవసరం. ఇటీవలనే దిగువ సీలేరు విద్యుచ్ఛక్తి పథకం క్రింద 100 మెగావాట్ల తొలి కేంద్రానికి ప్రారంభోత్సవం జరిగింది. త్వరలోనే మన రాష్ట్రం విద్యుచ్ఛక్తి రంగంలో స్వయంసమృద్ధి సాధించే అవకాశం వుంది. రామగుండంలో, కొత్తగూడెంలో సూపర్ థర్మల్ కేంద్రాన్ని ప్రారంభించవలసిందని మనం కేంద్రప్రభుత్వాన్ని కోరి వున్నాము. అది కూడా సిద్ధించినట్లైతే మనకు విద్యుచ్ఛక్తికి

( తరువాయి 11వ పేజీలో )

# "విశ్వకవి"
# రవీంద్రనాథ టాగూరు

— "అమరేంద్ర"



నూటపదహారు సంవత్సరాల క్రిందట జన్మించిన కవి రవీంద్రుడు ఏ రంగంలో అడుగుపెట్టినా, ఏ పీఠం ఎక్కినా, ఏ దేశం వెళ్ళినా కవిగా మసలుతూ తన విశిష్ట వ్యక్తిత్వాన్ని చాటుకోగలిగిన బహుముఖ ప్రతిభాశాలి. ఆయన వ్యక్తిత్వం శతపత్రసుందరి.

పట్టుదలతో ఏ పాఠశాలలోనూ, ఏ విశ్వవిద్యాలయంలోనూ ఆయన చదువుకోలేదు. కాని చదువుల తల్లి వరప్రసాదం వల్ల ఆయనకి అలవడని కళగాని విద్యగాని లేదు. సమస్త మానవ విజ్ఞానాన్నీ తన సామ్రాజ్యంగా చేసుకుని పరిపాలించగలిగిన సహజ పాండిత్యం ఆయనకి ఉగ్గుపాలతోనే పట్టుబడింది. ఉత్తమ విద్యాకేంద్రంగా జగత్ప్రసిద్ధి పొందిన ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమే శాంతినికేతనానికి తరలివచ్చి డాక్టరేట్ బిరుదు ప్రసాదించింది. ప్రకృతి అనే మహా విద్యాలయంలో పట్టభద్రులైన మహా కవుల కోవకి చెందిన ప్రతిభాశాలి ఆయన.

అసాధారణమైన ఆయన శైశవమే అద్వితీయమైన ఆయన వ్యక్తిత్వవికాసానికి ప్రాతిపదిక అయింది. పిన్నవయసులోనే తల్లిని కోలుపోవటంవల్ల త[illegible] సాన్నిధ్యంలో పెరిగి పెద్దవాడయ్యాడు. కడసారపు బిడ్డ కావటం మూలంగా, ఆడింది ఆటగా, పాడింది పాటగా పసితనం గడచిపోయింది. బడికి వెళ్ళడమంటే బందిఖానాలోకి నెట్టినంత బాధపడేవాడు. అర్థంకాని భాషలో ఆసక్తి కలిగించని పాఠాలు కోమల కుసుమాలమీద రాళ్ళవాన కురిసినట్లుగా తోచేవి. ఎక్కువసేపు ఏకాంతంగా తోటల్లో, దొడ్లలో గంతులువేస్తూ, చెట్లతో పిట్టలతో, పువ్వులతో, మబ్బులతో ముచ్చటలాడుతూ మురిసిపోయేవాడు. పల్లెపాటలూ, వీధిభాగవతాలు, తాతలనాటి కథలూ చెవి కోసుకుని వింటూండేవాడు. మారుమూలగదిలోనో, పాతపల్లకిలోనో, పచ్చికబయళ్ళలోనో తనచుట్టూ ఒక రమణీయ కల్పనా సామ్రాజ్యాన్ని సృష్టించుకుంటూ గంటల తరబడి గడిపేవాడు. ఆ లేత వయస్సులోనే ప్రకృతిసౌందర్యారాధనమూ, స్వేచ్ఛా ప్రియత్వమూ, స్వచ్ఛందచిత్తవృత్తీ రవీంద్రునిలో అంకురించాయి. తండ్రిబోధించే ఉపనిషత్సారంతోనూ, సాహిత్యామృతంతోనూ తన సుకుమార హృదయాన్ని నింపుకునేవాడు. పదేండ్లు నిండకమునుపే స్వతంత్ర కావ్యరచన చేయగల శక్తి అలవడింది. పదిహేనేళ్ళ ప్రాయానికే షేక్స్‌పియర్ మహాకవి రచించిన "మేక్‌బెత్" విషాద నాటకాన్ని అనువదించగల ఉభయభాషాప్రావీణ్యం సంపాదించాడు. ఎనిమిదేళ్ళ ప్రాయంలో ఆరంభమైన సాహిత్యవ్యాసంగం ఎనిమిది దశాబ్దాలు నిర్విరామంగా కొనసాగింది. నిరంతర సాధనగా, సమగ్ర నివేదనగా, పవిత్రమైన ఆరాధనగా ఆయన సాహిత్యవ్యాసంగం గడిచిపోయింది ప్రాంగణంలో మృత్యువువచ్చి నిలబడ్డపుడు కవిగా పలకరించి కళ్ళు మూసుకున్నాడు

## సంస్కరణోద్యమాలు

ఆయన జన్మించే సమయానికి వంగభూమిలో సాంస్కృతిక, రాజకీయ, సారస్వత రంగాలలో విప్లవాత్మకమైన ఉద్యమాలు కొనసాగుతున్నాయి. భారతీయ సంస్కృతిని చిన్నచూపు చూస్తూ పాశ్చాత్య నాగరికత పట్ల వ్యామోహాన్ని పెంచుకుంటున్న ఆంగ్ల మానస పుత్రుల సంఖ్య దేశంలో ఎక్కువగా వుండేది. వాళ్ళకి కనువిప్పు కలిగించాలనే ఉద్దేశంతో భారతీయ సాంస్కృతిక వైభవాన్ని పునరుద్ధరించే ఉద్యమం ఒకవంక తల ఎత్తింది. ఆంగ్ల విద్యాభ్యాసంవల్ల ఉత్తేజం పొంది, సత్యాన్వేషణ దృష్టితో, హేతువాదంతో వేదాలనీ, ఉపనిషత్తులనీ అధ్యయనం చేసిన రాజారామమోహనుని నాయకత్వంలో ఇంకొక ఉద్యమం చెలరేగింది. కర్మకాండలతోనూ, మూఢాచారాలతోనూ కరుడు కట్టుకుపోయిన హిందూ మతాన్నీ, సమాజాన్నీ సంస్కరించిన ఉద్యమం అది. ఈ ఉద్యమంలో రవీంద్రుని తాతా, తండ్రి ప్రముఖపాత్రలు నిర్వహించారు. ఇక సాహిత్య రంగంలో శుష్కపాండిత్యపు ఇనుప సంకెళ్ళలో కావ్యకన్య బందీ అయిపోయి మూర్ఛపడివున్న తరుణంలో బంకించంద్రుడు అవతరించాడు. ఆయన హస్తస్పర్శ సోకగానే నిద్రాణమైన సాహిత్యం నవచైతన్యంతో లాస్యం చేసింది. కల్పనాత్మకమైన, దేశభక్తి పూరితమైన నవలలూ కావ్యాలూ రచించి జీవం తొణికిసలాడే శైలిని సృజించాడు. ఈ ఉద్యమాలన్నిటికీ టాగూరుల వంశం సంగమక్షేత్రం. ఆనాడు వెల్లివిరిసిన చైతన్య

మంతా తనలో నింపుకుని బంకించంద్రుని ఆశీర్వాదంతో కావ్య సృష్టికి ఉపక్రమించాడు రవీంద్రుడు.

## "షెల్లీ ఆఫ్ బెంగాల్"

"సంధ్యా సంగీత్" అనే కావ్యంతో రవీంద్రుడు సాహిత్యాకాశంలో ఉజ్వల నక్షత్రంలాగా ఉదయించాడు. కవి తరుణ హృదయంలో మెదిలిన ఆశలూ, ఆశయాలు, స్వప్నాలూ, నిర్వేదమూ ప్రతి పంక్తిలో తొంగిచూశాయి. స్వీయానుభవాలని కవితా వస్తువులుగా స్వీకరించే భావ ప్రధానమైన నవ్య కవిత్వానికి ఈ కావ్యం శ్రీకారం చుట్టింది. కావ్యంలో తొంగిచూచిన చిక్కని విషాదచ్ఛాయలు ఆంగ్ల కవి షెల్లీని జ్ఞాపకం చేశాయి "అవర్ స్వీటెస్ట్ సాంగ్స్ ఆర్ దోజ్ దట్ టెల్ ఆఫ్ శాడెస్ట్ థాట్స్" అన్నట్లు మధురిమగా రూపొందిన వేదనా కావ్యంలో ప్రవహించింది. మృదువైన మధుర శైలీ, పూర్తిగా అర్థంకాకపోయినా రసస్ఫూర్తిని కలిగించగల భావ తీవ్రతా, అనిర్వచనీయమైన రమణీయతా ఈ కావ్యంలో పాఠకులని ఆకర్షించాయి. "షెల్లీ ఆఫ్ బెంగాల్" అని సహృదయులు రవీంద్రుని నోరారా కొనియాడారు. భావ ప్రధానమైన ఆత్మాశ్రయ కవిత్వానికీ, "లిరిక్" కవితా ప్రక్రియకీ భారతీయ సాహిత్యంలో రవీంద్రుడిదే అగ్రస్థానం.

ఇరవై రెండేళ్ల ప్రాయంలో ఒకనాటి ప్రభాతసమయం రవీంద్రునికి గొప్ప అనుభూతి కలిగించింది. తరుచ్ఛాయల్లో ఉదయించే ఉజ్వల భానుడు తన హృదయాంతరంలోకి ప్రవేశించినట్లు అనిపించింది. దట్టంగా కమ్ముకున్న చీకటి తృటిలో పటాపంచలై పోయింది. శోకంతో, చీకటితో, వగపులతో వెరపు గొలిపిన లోకం ఒక్క సారిగా కొత్త కాంతితో తళుక్కుమన్నది. సౌందర్యం, ఆనందం ఉత్తుంగ తరంగాలుగా పరవడి తొక్కుతూ, వాటి మీద సకలసృష్టి తేలుతూ ఆడుతూ వున్నట్టు కనిపించింది. కష్టాలు క్షణంసేపు ముసురుకునే మబ్బులు. కాని, ఆనందం సూర్యప్రభలాగా, చంద్రజ్యోత్స్నలాగా శాశ్వతం. ప్రణయమే ఈ సృష్టిలో అంతర్వాహిని—రవీంద్రుని జీవిత దర్శనానికి ప్రాతిపదికలైన ఈ విశ్వాసాలు ఆక్షణంలో అంకురించాయి. అప్పటి ప్రబోధాన్నీ పారవశ్యాన్నీ "వెలయేరు మేలుకొన్నది" అనే కావ్య ఖండంలోనూ, "సన్యాసి" అనే రూపకంలోను రవీంద్రుడు ప్రకటించారు. రవీంద్రుని ఆశావాదాన్నీ, రమణీయ దర్శనాన్నీ ప్రతిఫలించిన కావ్యం "ప్రభాత సంగీతం."

సాధారణంగా భావకవులు పాడిందే పాటగా పాడుతూ తమ విజయాలనే తాము అనుకరించుకుంటూ కొత్తదనంలేని పాత ధోరణిలో పోతూవుంటారు. కాని, సృజనాశక్తి నిర్నిద్ర జ్వాలలాగా హృదయంలో ప్రజ్ఞ ప్రజ్వలించే కవిపుంగవులు నిత్యమూ నూతన విజయాలకోసం ప్రయత్నిస్తారు. కొత్తదారులు తీస్తూ, మునుపు ఎక్కిన వాటికంటే ఎత్తునవున్న శిఖరాలమీద జయపతాకాలు నాటుతారు. లభించిన కీర్తితో తృప్తిపడి తాపీగా కూచుని తమ పూర్వ ప్రతిష్ఠనే పెట్టుబడి గావించుకుని సాహిత్య వ్యాపారం సాగించ దలచుకోరు. వెలువడిన ప్రతికొత్త కావ్యమూ సురలోక కొత్త అందాన్ని మెరిపించి వెలుగుదారులు పరుస్తుంది. "పరుషం పరశం", "చైతాలి", "గీతాలి", "బంగారునావ" వంటి కావ్యాలతో ఎంతోవస్తు వైవిధ్యము, శిల్పవైభవము గోచరిస్తాయి. ఎప్పటి కప్పుడు కొత్త సొయగాలు వెదజల్లుతూ కవితాసుందరి హృదయాలను ఉర్రూతలూగిస్తుంది "మానసి". అనే కావ్య సంపుటి రవీంద్రుని భావగాంభీర్యానికి, శైలీసౌకుమార్యానికి చక్కటి నిదర్శనం. శబ్దమూ, అర్థమూ అర్ధనారీశ్వరుల లాగ ఏకీభావం పొందిన ఉత్తమ కావ్యం "మానసి". "ఆయన కవిత ఉపనిషద్వనవాటికలలో తారాడే హరిణి ప్రభుని కొరకు పవలురేలు వల్లవించే విరహిణి"

జీవితంలో నాలుగు పదులు నిండిన తరువాత రవీంద్రుని హృదయం తీవ్ర మథనానికి గురి అయింది ప్రియతమ అర్ధాంగి, ఎనిమిదేళ్ళ పుత్రుడు, వివాహితులై కాపురాలు చేస్తున్న పుత్రికలు మృత్యురాక్షసి తీరని ఆకలికి ఆహారమైపోయారు, సంసారపు ఆర్థిక వ్యవస్థకూడా తలక్రిందులై పోయి ఎన్నో చిక్కులు వచ్చాయి. దుఃఖమూ, వేదనా రవీంద్రుని హృదయాన్ని కలచివేశాయి. నిష్ఠురమైన వేదనతో ప్రాణాన్ని ద్రాక్షపళ్ళ గుత్తిని పిండినట్లు వేధిస్తున్న అంతరతముని సాక్షాత్కారం కోసం తపించ పరితపించాడు. జీవన దేవతగా, ప్రణయాధినాథుడుగా, ప్రాణసఖుడుగా ఈశ్వరుని భావించి ఆయనతో సంయోగ వియోగాలు అనుభవించాడు. ఈ ప్రణయ లీలావిలాసమే "నైవేద్య", "ఉత్సర్గ", "ఖేయ" అనే కావ్యాలలో చిత్రించాడు. వీటిలోని కొన్ని రచనలను సేకరించి "గీతాంజలి" ప్రచురించి "నోబెల్" బహుమానం అందుకున్నాడు. భారత సాహిత్య విజయ పతాక విశ్వవీధుల్లో గర్వంగా నాట్యం చేసింది.

రవీంద్రుని కావ్యాలలో సమున్నత శిఖరం "బలాకా" అని విజ్ఞుల అభిప్రాయం సాగర గంభీరమైన భావాలను ఎంతో పొదుపుగా కొద్ది పంక్తుల్లో కుదించి చకితులను చేశాడు. ఆంగ్ల సాహిత్యంలో అర్థగౌరవానికి పేరుపొందిన బ్రౌనింగ్ కవిని గుర్తుకు తెస్తుంది ఈ కావ్యం. మానస సరోవరానికి ఎగిరిపోయే రాజహంసలాగా ప్రాణేశ్వరుని చరణ సన్నిధికి పయనించే మానవాత్మను చిత్రించే రచన ఈ సంపుటానికి మకుటం. కాలదేవత కపోలతలంలో పాలరాతి బాష్పబిందువులాగున్నదని తాజ్‌మహల్‌ను సంబోధించిన గేయం ప్రఖ్యాతమయింది.

## దీనులలో దైవదర్శనం

ఆయన లేఖినికి అలసటలేదు. విశ్రాంతిలేదు. మామూలుగా ముదిమివల్ల వచ్చే నిస్పృహ కనబడదు. "గతకాలమె మేలు వచ్చు కాలము కంటెన్" అనే బెంగతో వెనక్కిచూసే స్వభావం కాదు. నిర్భయంగా, నిశ్చయంతో భవిష్యత్తు స్వరూపాన్ని దర్శించ గలిగాడు. జర్మనీలో, రష్యాలో జపానులో, సాగుతున్న చరిత్రను గుర్తించాడు. గతి తార్కిక భౌతికవాదం, ప్రగతి శీలంవంటి సమకాలీన భావాలన్నిటినీ హృదయ కవాటాలు తెరుచుకుని విశాలదృష్టితో స్వీకరించాడు. "మానవుడు ఈ యుగానికి అతిథిగా రానున్నాడు. మకుటధారి మానవుడు" అనే అచంచల విశ్వాసంతో ఆయన కావ్యాలు నడిచాయి మానవుడే ఈశ్వరుని ప్రతిమ. "మాలోనే నీ మహిమ" అని గుర్తించి దైవాన్ని తలుపులతో మూసిన దేవాలయాలలో కాకుండా, అనాగారిన దీనులలో, గతిహీనులలో, పతితుల్లో దర్శించాడు. ఈ విశాల

మానవ భావన చివరి దశలో రవీంద్రుని లేఖిని వెలయించిన "శహనాయ్", "శేష సప్తక్", "పరిశేష్", "సబజాతక్" వంటి కావ్యాలలో ప్రస్ఫుటమయింది.

రవీంద్రుని కావ్యాలన్నిటిలో ప్రత్యేకత సంపాదించింది "శిశు". పసిపాపల చిత్తవృత్తిని ఆకళింపుకొని కళాఖండాలు సృష్టించటంలో ఆయనది అందెవేసినచెయ్యి. పరమాత్ముని ప్రతిబింబాలైన పసిపాపల అమాయకత్వం ఆయన్ని అలరించింది. బాలసాహిత్యానికి ఈ కావ్యం మేలుబంతి. కళలు పిండే నెలవంక మానవాత్మకు ప్రతీకం.

జానపద సాహిత్యంలోవుండి పండితుల చిన్న చూపుకు గురియైన దేశీయ ఛందస్సులను రవీంద్రుడు ధైర్యంగా స్వీకరించాడు. వాటికి తన భావనావైభవం జోడించి కావ్యగౌరవం సమకూర్చాడు. వైష్ణవ పదకవుల ధోరణిలోను, బిచ్చగాళ్ల తత్వాల వరసల్లోనూ, తాన్‌సేన్‌వంటి సంగీత కళానిధులమార్గంలోనూ, చండీదాస్, జయదేవ, కబీరువంటి భక్తకవుల పోకడల్లోను రవీంద్రుడు సుమారు రెండువేల పాటలు రచించి స్వరకల్పనచేశాడు. "ఈ నేలలో విరబూసి పరిమళించే పుష్పాలతోపాటుగా నా పాటలు కూడా జాతి జనుల గుండెల్లో గుబాళిస్తూవుంటాయి. కన్నీళ్లతో చిరునవ్వుతో నా జాతి నా పాటలు పాడుకుంటుంది." అని రవీంద్రుడు చాటుకున్నాడు. ఆయన పాటలు వెన్నెల బాటలు, తీయని తేనెల సోనలు.

## ఆలస్యంగా జన్మించిన కాళిదాసు

రవీంద్రుని హృదయానికి చాలా సన్నిహితుడు కాళిదాస మహాకవి. ఏ పండిత ప్రకాండునికీ అందని కాళిదాస కావ్య మర్మాలు రవీంద్ర కవీంద్రునికి కరతలామలకాలు. "నేను కాళిదాసు కాలంలో జన్మించి వుంటేనా? ఆ నవరత్నాల మాలలో దశమ రత్నంగా భాసించేవాడిని కానా?" అన్నారు గురుదేవులు. ఇంకొకచోట "నేను ఈ యాంత్రిక యుగంలో ఆలస్యంగా జన్మించిన కాళిదాసుని!" అన్నారు. విభిన్నంగా కనబడే సృష్టిలో దాగిన ఏకత్వాన్ని దర్శించి తరించిన కవీంద్రుడు రవీంద్రుడు. ఈ ఏకత్వమే జగత్తులోని అందానికీ, ఆనందానికీ మూలకందమని ఆయన గుర్తించాడు. ఈ రమణీయ దృష్టితో, శిశుసహజమైన కుతూహలంతో జగత్తుని సందర్శించినప్పుడు లోకం ఆనంద నందనంగా విశ్వవిభుని ప్రణయమందిరంగా సాక్షాత్కరించింది. అందుకే జాతిమతాల అడ్డుగోడలతో ముక్కలుకాని అఖండ ప్రపంచంకోసం ఆయన కలలుగన్నాడు. ఆయన భావనలో ఒక ఉత్తమ సమన్వయ సూత్రం గోచరిస్తుంది. ప్రాచీన భారతీయ సంస్కృతిలోని నిగ్గుని గ్రహించి ఆధునిక వైజ్ఞానిక యుగంలోని హేతువాదంతో మేళవించగలిగాడు. పాశ్చాత్య నాగరికతలో పొడగట్టిన ఆర్థిక, సాంఘిక వికాసాన్ని ప్రాచ్యదేశాలలోని ఆధ్యాత్మిక వైభవంతో సమన్వయించదలిచాడు. కనుకనే రవీంద్రుని కవితలో "కొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు" చిమ్ముతున్నది. సత్సంప్రదాయాలలోని ఉత్తమాంశాలపట్ల ఆదరమూ, నిత్యమూ నూతనత్వాన్ని అన్వేషించే విప్లవోత్సాహమూ రవీంద్రుని కవితలో చెట్టపట్టాలు వేసుకొని ముందుకి నడిచాయి. ఎల్లలోకము ఒక్క ఇల్లుగా భావించిన ఆయన దృష్టికి ఎల్లలు అడ్డురావు. ఆయన సకలమానవ కోటినీ సంబోధించి ఉత్తేజపరచిన విశ్వకవి. ఆయన ఆధునిక భారతంలో జన్మించడం మన భాగ్య విశేషం అన్నారు నెహ్రూ. "మీ దేశానికి స్వాతంత్ర్యం దనికి అంటే అక్కడ మీరు జన్మించకుంటే ఇంకా కారణం ఏం కావాలి?" అన్నారు అమెరికన్ వేదాంతి విల్‌డ్యురాంట్. సౌందర్యారాధకుడుగా, స్వాతంత్ర్య ప్రియుడుగా, సత్యాన్వేషిగా, సమగ్ర సుందర వ్యక్తిగా రవీంద్ర కవీంద్రుడు చిరస్మరణీయుడు. కత్తులు తుప్పుపడతాయి. గోపురాలు కూలిపోతాయి. మందిరాలు మూలపడతాయి. కాని రవీంద్రుని కవిత కాలమనే ఉద్యానంలో గుబాళించే అనర్ఘ్య ప్రసూనం. సరసాత్వపు పునాదిమీదనే స్వరసౌధాన్ని నిర్మాణం చేయవచ్చుననే ఉజ్వల సందేశం ఆయన కావ్య ప్రసూనాలు వెదజల్లే దివ్యపరిమళం.

ఆయన జీవితాన్ని తిరస్కరించిన పలాయన వాదికాదు. సుఖదుఃఖాలతో వెలుగు నీడలతో వింతగొలిపే జీవిత వైవిధ్యాన్ని కరాలుసాచి ఆహ్వానించి హృదయానికి హత్తుకున్న ఉజ్వల భావుకుడాయన. రకరకాల జీవితానుభవాలు ఆయన కవితలో ప్రతిఫలించాయి. అందుకే రవీంద్రుని కవితలో ఇంతటి వైవిధ్యమూ, ఆకర్షణా.

అందుకే శతాబ్దాలు గడిచినప్పటికీ ఆయన కృతులు రసాబ్ధాల వంటి శబ్దాలతో హృదయకేదారాలలో పన్నీటిజల్లు చిలకరిస్తూ బంగారు పంటలు పండిస్తూవుంటాయి.

---

# ఆర్థిక కార్యక్రమం

(8 వ పేజీ నుండి)

ఏ విధమైన కొరత వుండకుండా మన పరిశ్రమల రంగం మూడు పూలు ఆరు కాయలుగా వర్ధిల్లడానికి మంచి అవకాశం కలుగుతుంది. గ్రామీణ విద్యుదీకరణ కార్యక్రమాలలో కూడా మన రాష్ట్రం ముందంజ వేస్తున్నది. ఈ ఏడు ఇంతవరకు 205 గ్రామాలకు, 264 హరిజనవాడలకు విద్యుచ్ఛక్తి లభింపజేయడం జరిగింది. అంతేకాకుండా యీ సంవత్సరంలోనే 10 వేల పంపుసెట్లకు విద్యుచ్ఛక్తి లభించే కార్యక్రమం కూడా అమలు జరుగుతున్నది. ఈ విధంగా 20 సూత్రాల పథకంలో మన ప్రధానమంత్రి ప్రకటించిన వివిధ కార్యక్రమాలను మన రాష్ట్రం శ్రద్ధగా, శక్తివంతంగా అమలు పరుస్తున్నది. మన ప్రధాని చెప్పినట్లు యీ 20 సూత్రాల పథకంతోనే, దీన్ని పూర్తిగా అమలుపరచడంతోనే మన కార్యక్రమం పూర్తి కాదు. ఇది కేవలం మన అభ్యుదయ పురోగమన పథంలో ఒక ప్రారంభదశ మాత్రమే. ముందు ముందు ప్రధానమంత్రి నేతృత్వంలో మనదేశం ఇతోధికమైన అభివృద్ధి సాధిస్తుందనేది యథార్థం. మన రాష్ట్రం కూడా యీ దేశాభ్యుదయ కృషిలో శ్రద్ధతో పాల్గొంటున్నది అనడంలో సందేహం లేదు. వీటి వల్ల మన సామాన్య ప్రజల ఆర్థిక పరిస్థితి బాగుపడుతుంది.

# రాజధాని విశేషాలు

## పోటీకానిపోటీ-సినీతారల క్రికెట్ పోటీ

పంతాలు-పట్టుదలలు, జయాలు-అపజయాలు ఏమాత్రమూ లేని విచిత్రమైనపోటీ-సినిమాతారల క్రికెట్ పోటీ మార్చినెల 14వ తేదీన జంటనగరాల పౌరులకు అపూర్వ వినోదం కలిగించి, గిలిగింతలుపెట్టింది. ఈ పోటీ లాల్‌బహదూర్ స్టేడియంలో, దాదాపు 30 వేల మంది ప్రేక్షకులు మహోత్సాహంతో చూస్తూండగా జరిగింది. దాదాపు 50 మంది దాక్షిణాత్య, ఔత్తరాహ సినిమా తారలు దీనిలో పాల్గొన్నారు. అంబేడ్కర్ ఎడ్యుకేషన్ సొసైటీ సహాయార్థం జరిగిన పోటీ కాబట్టి, సినిమాతారలను చాలమందిని ఒక్కచోట చూడడం ముఖ్యమనుకున్నారు కాబట్టి, ఆట సూత్రాలనుగాని, ఆట పద్ధతులనుగాని ఎవ్వరూ పట్టించుకోలేదు. దాక్షిణాత్య బృందానికి ఎన్. టి. రామారావు కెప్టెన్, అక్కినేని నాగేశ్వరరావు మేనేజరు. ఔత్తరహ బృందానికి దిలీప్‌కుమార్ కెప్టెన్, కరన్ దవాన్ మేనేజరు. దక్షిణ భారత బృందం 67 పరుగులుచేసి, డిక్లేర్‌చేయగా, ఉత్తర భారత బృందం 192 పరుగులుచేసింది ఉత్తరభారత బృందంలో అగ్రనటులు-దిలీప్‌కుమార్, శశికపూర్, అమితాబ్ బచ్చన్ బాగా ఆడగలవారు. మొత్తం పోటీలో జనాన్ని ఎక్కువగా ఆకర్షించినవాడు దిలీప్‌కుమార్. ఇతడు ఎక్కువ పరుగులుచేయడం మాత్రమేకాక 'క్రికెట్ రాజు' అని పేరుగన్న లెఫ్టినెంట్ కర్నల్ సి.కె. నాయుడు ప్రేక్షకుల కోరికపై సిక్సర్‌కొట్టినట్టు దిలీప్‌కుమార్ కూడా సిక్సర్‌కొట్టి ప్రేక్షకులను సంతోషపెట్టాడు. దిలీప్‌కుమార్ భార్య సైరాబాను కూడా ఈ పోటీలో పాల్గొని బౌలింగ్‌లో శబాష్ అనిపించుకొంది పోటీకి ముందు ఇరుజట్టులవారు జీపులో స్టేడియంలో పెరేడ్ జరిపారు. ప్రేక్షకులు వారిని చూచి హర్షధ్వానాలు చేశారు. పెరేడ్‌లో రాజ్‌బాబు టోపీ కిందపడింది. అతడు జీపుదిగి టోపీని తీసుకొని వచ్చేలోగా జీపు వెళ్లిపోయింది. పరుగెత్తుకుంటూ వెళ్లి జీపు పట్టుకొన్నాడు. ప్రేక్షకులు గొల్లుమన్నారు. ఆట కొంత సాగిన తర్వాత, అలసిన ఆటగాళ్లు పానీయాలు సేవిస్తున్నప్పుడు అల్లు రామలింగయ్య

"దేశం పన్నెండుసార్లు చుట్టొస్తాను-నారాయణమ్మా
నన్ను పొమ్మనక రమ్మనవే-నారాయణమ్మా

సిన్మాలో చేర్పిస్తే-నాయుడు బావా
నా సొమ్ములన్నీ ఇస్తాను-నాయుడు బావా!"

అని జానపదగేయం పాడారు. ప్రేక్షకులు ఆనందంతో కేకలు వేశారు. రాజబాబు కుంటుతూ బ్యాటింగుకు వచ్చాడు. అతనికి ఒత్తాసుగా ప్రభాకరరెడ్డి ఉన్నాడు. రాజ్‌బాబు బ్యాటు విసిరి వెల్లకిల పడ్డాడు. నలుగురు స్ట్రెచర్‌తోవచ్చి అతనిని మోసుకుపోయారు. జయసుధ బ్యాట్ చేస్తున్నప్పుడు హిందీతారలు చుట్టుముట్టి అవుట్ చేస్తామని బెదరించారు, కెప్టెన్ దిలీప్‌కుమార్ వచ్చి, వారిని తొలగి పొమ్మన్నాడు సూర్యకాంతం సినిమాలలో మూరేకారం ఎడమచేత్తో బ్యాట్ తిప్పుతూ రాగా, ప్రతిపక్షబృందం చుట్టుముట్టారు, ఆమె బ్యాట్ తిప్పుతూ వారందరిని తరిమింది. జమున బ్యాటింగుకు పోతూ పోతూ సూర్యకాంతం అత్తయ్య పాదాలకు మొక్కి వెళ్ళింది. దిలిప్‌కుమార్ ఆట చివర ప్రసంగిస్తూ, ఈ లక్ష్యం విద్యాసంస్థకు సహాయంచేయడమని, వీటివల్ల సౌహార్దం, ఆత్మీయత పెరుగుతాయని, ఇంతమంది ప్రేక్షకులు తమ ఆటను చూడడం ఆనందంగా ఉందని అంటూ, ధన్యవాదాలు సమర్పించారు. ఇరుజట్ల క్రీడాకారులకు ఆంధ్రబ్యాంక్ మొమెంటోలు బహూకరించింది వాటిని గవర్నర్ శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా అందజేశారు. దక్షిణ బృందంలో ఆడినవారు:—అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణంరాజు, ఎన్.టి. రామారావు, సారధి, రంగనాథ్, చలం, జయచిత్ర, జయసుధ, శోభన్‌బాబు, కాంచన, జయప్రద, శ్రీధర్, రాజ్‌బాబు, సూర్యకాంతం, వాణిశ్రీ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, జమున. ఉత్తర బృందంలో ఆడినవారు:—అజయ్‌సాహ్నీ, అమితాబ్ బచ్చన్, సైరాబాను, ఆషా సచ్‌దేవ్, రిషికపూర్, నీతూసింగ్, కిరణ్‌కుమార్, సంజీవ్‌కుమార్, దిలీప్‌కుమార్, శశికపూర్, రమేశ్‌వర్మ, ప్రేమ్‌చోప్రా, నవీన్ నిశ్చల్, హెలెన్, నరేందర్‌నాధ్, శబానా, వినోద్ ఖన్నా, రింకుజయస్వాల్. డాక్టర్ సి. నారాయణరెడ్డి వ్యాఖ్యాతగా వ్యవహరించారు.

## ఉస్మానియా విశ్వవిద్యాలయంలో నవశకం

మార్చి 16వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయం నవశకం స్థాపించింది. ఇది ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు తెలుగులో స్నాతకోపన్యాస మివ్వడం. తెలుగును అధికారభాషగా చేస్తున్న ఈ తరుణంలో ముఖ్యమంత్రి స్నాతకోపన్యాసం తెలుగులో ఇచ్చి, తెలుగు ప్రతిష్ఠను పెంచారు. శ్రోతలు ఆనందాతిరేకంతో పొంగిపోయారు. ముఖ్యమంత్రి ప్రసంగం వారిలో నూతనోత్సాహం వెల్లివిరియజేసింది. వైస్ ఛాన్సలర్ డాక్టర్ జగన్మోహన్‌రెడ్డి ముఖ్యమంత్రి తెలుగు ప్రసంగానికి సంతోషం ప్రకటిస్తూ, "ఇది తెలుగుజాతి సమైక్యానికి చిహ్నం" అని ప్రశంసించారు.

## యూరోప్‌లో కీర్తితెచ్చిన తోలుబొమ్మలాట

ఫ్రాన్స్ దేశంలోని రెన్నెలో మార్చినెలలో జరిగిన అంతర్జాతీయ సాంప్రదాయిక కళా ప్రదర్శనంలో తోలుబొమ్మలాట-రామాయణం సుందరకాండ-ప్రదర్శించి, లండన్, ఆమ్‌స్టర్‌డామ్, బెర్లిన్, పారిస్ మొదలైన నగరాలలో పెక్కు ప్రదర్శనలు జరిపి, అపార గౌరవంతో తిరిగివచ్చిన ఛాయా థియేటర్స్ బృందానికి మార్చి 21వ తేదీ సాయంకాలం సంగీత నాటక అకాడమీ హాలులో సన్మానం జరిగినప్పుడు ప్రతి శ్రోత హృదయమూ ఉవ్వెత్తున లేచింది గర్వంతో. ఈ బృందానికి ప్రముఖ నాటకరంగ నిపుణుడు శ్రీ ఎ. ఆర్. కృష్ణ, శ్రీ ఎం. వి. రమణమూర్తి నాయకత్వం వహించారు. బృందంలో అనువంశికంగా తోలు బొమ్మలాటను ఆరాధిస్తున్న

ఆరెమరాటీలు శ్రీ సిందె నారాయణప్ప, ఆయనభార్య శ్రీమతి శాంతమ్మ, ముఖవీణా నిపుణుడు శ్రీ అంజనప్ప ఉన్నారు. వీరు అనంతపురంజిల్లావారు : దంపతులది చాకర్లపల్లె; అంజనప్పది కొత్తపల్లి. నారాయణప్ప మధుర గంభీరధ్వని, శాంతమ్మ కిన్నెర కంఠం, జేనెడు ముఖవీణతో అపూర్వానుభూతి కలిగించే అంజనప్ప నైపుణ్యం, రామాయణగాథ, రంగురంగు బొమ్మల రామణీయకం, పాశ్చాత్య ప్రేక్షకులను ఉర్రూతలూపిందని ఎ. ఆర్. కృష్ణ తమ ప్రసంగంలో తెలిపారు. శ్రీయుతులు నటరాజ రామకృష్ణ, డి కె. రావు, కౌండిల్య, ఏకా సుబ్బారావు, సీతారామయ్య సంగీతనాటక అకాడమీ సంయుక్త కార్యదర్శి శ్రీ బి. కృష్ణంరాజు బృందాన్ని అభినందించారు. తోలుబొమ్మలాట మొదలైన జానపద కళలను ప్రోత్సహించడం అవసరమనీ, విదేశాలలో వాటి ఎడల ప్రజలకు చాల ఆసక్తి ఉన్నదనీ అన్నారు. అధ్యక్షత వహించిన అధికార భాషా కమీషన్ అధ్యక్షుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య వక్తల సూచనలను బలపరుస్తూ, జానపదకళలలో జాతి జీవం నిలిచిఉన్నదనీ, వాటిని పునరుద్ధరించడం ప్రభుత్వ కర్తవ్యమనీ అన్నారు.

## ఓషియానియాలో కళాప్రదర్శనం

మానవుడు ప్రపంచంలో ఏ మారుమూలలో, ఏ సంఘానికీ సంబంధం లేకుండా వెలిగా ఉన్నా, తన సృజనాత్మక దృష్టిని కోల్పోడు; తన పరిసరాలలో ఉన్న వస్తువులతోనే తన భావనకు రూపం తీర్చుకుంటాడు—అనడానికి మార్చి 16 నుంచి 21 వరకు కళా భవన్‌లో జరిగిన ఓషియానియా సంచార కళా ప్రదర్శనం నిదర్శనం. దీనిని కేంద్ర విద్యాశాఖ, యునెస్కో సమిష్టిగా ఏర్పాటు చేశాయి పసిఫిక్ సముద్రం దక్షిణప్రాంతంలో తక్కిన ప్రపంచానికి సుదూరంగా సహస్రాబ్దాలుగా వుంటూ, ఎలాటి లోహమూ, చివరకు కాల్చిన మృణ్మయపాత్రలైనా కానని జనం, కర్రతో చేపల దంతపం కిరంపాలతో, రాక్షసి ఆలిచిప్పలనే పారలతో, కత్తులతో నిత్యజీవిక కోసం తీర్చిన వస్తువులు కళాఖండాలై విలసిల్లడం ఎవరికైనా ఆశ్చర్యం కలిగిస్తుంది. సముద్ర ప్రజల కళ గనుక దీనిని ఓషియానియా కళ అన్నారు. ఈ ప్రాంతాన్ని సాంస్కృతిక దృష్టితో 3 భాగాలు చేశారు శాస్త్రజ్ఞులు. 1. న్యూగినీ—మెలనేషియా: ఇది పశ్చిమ ఇరిన్ నుంచి న్యూకెలిలోనియా వరకు 2 మైక్రోనేషియా: పలావు నుంచి గిల్‌బెర్ట్స్ వరకు. 3. పాలినేషియా: ఇది చాల విశాలమైన ప్రాంతం: పడమర నుంచి తూర్పుగా ఫిజీ నుంచి ఈస్టర్ ఐలాండ్ వరకు; ఉత్తరదక్షిణంగా హవాయి నుంచి న్యూజిలాండ్ వరకు, ఈ ప్రాంతం జాతులలో కొన్ని వర్గాలకు ఏ లోహము తెలీదు. చేపల వళ్ల కత్తులతో, రాక్షసి ఆలి చిప్పలతో వ్యవసాయం సాగించారు. అరటి, చెరకు, మల్బరీ వంటి పంటలు పండించుకుంటారు. ఈ నిత్య కృత్యంలోనే వారిభావాలు, భావనలు, ఊహలు, కల్పనలు, విశ్వాసాలు రకరకాల కళారూపాలు పొందాయి. పసిఫిక్ సముద్ర దక్షిణప్రాంతంలో ఒంటరిగా వున్న ఈ జాతి చేతిలో కర్ర, ఆలిచిప్ప, టెంకాయిచిప్ప, నౌకాముఖంగా, దేవతారూపంగా, శిల్ప స్తంభంగా గృహద్వారతోరణంగా ఎలా మారాయో, మానవుడు ఎంతటి ఆశాజీవియో ఈ ప్రదర్శనం నిరూపించింది. నిర్వాహకులను ప్రేక్షకులెవరైనా అభినందిస్తారు.

## విధానసభకు మహిళల యాత్ర

పురుషులతో సమానంగా అన్నిరంగాలలోను హక్కు కావాలన్న విషయాన్ని ప్రభుత్వానికి నొక్కి చెప్పడానికి ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య నాయకత్వాన మార్చి 8వ తేదీన అఫ్జల్‌గంజ్, కోఠీల నుంచి వేలాది మహిళలు విధానసభకు ఊరేగింపు జరిపారు. ఈ ఊరేగింపులో జిల్లాలనుంచి వచ్చిన ఉపాధ్యాయినులు, డాక్టర్లు, విద్యార్థినులు, గుమస్తాలు, కార్మికులు మొదలైన వారున్నారు. సాంఘికమైన, ఆర్థికమైన మార్పులు తేవడానికి అహర్నిశలు పోరాడుతామని వీరు నినాదాలు చేశారు.

—శ్రీ తిరుమల రామచంద్ర



# మన జిల్లాల్లో ఏం జరుగుతోంది?

—సమాచార లేఖావళి—

## హైదరాబాద్ జిల్లా

చేవెళ్ళ పంచాయతీ సమితిలో ఇటీవల నిర్వహింపబడిన సామూహిక శిశు, నేత్ర మరియు కుటుంబనియంత్రణ శిబిరం ఆశించిన ఫలితం ఇవ్వడమేగాక రాబోవు శిబిరములకు మార్గదర్శి అయింది.

ఆరోగ్యశాఖ వివిధ డిపార్టుమెంటుల సమన్వయమేగాక శిబిరము నిర్వహించుటలో చేవెళ్ళలోని ఇండో—డచ్ ప్రాజెక్టు, సమితి స్థాయిలోని అధికారులు, అనధికారులు మొ॥ వారి సహాయ సహకారాలు శిబిరం విజయవంతం కావడానికి ముఖ్య కారణాలని చెప్పవచ్చును. సుమారు ముప్పైవేల రూపాయల అంచనా వ్యయంతో నిర్వహింపబడిన యీ శిబిరంలో 4000 శిశువులకు పోలియో, కోరింత దగ్గు మరియు 'టిటానస్'వ్యాధులకు గురికాకుండా టీకాలు ఇవ్వడమేగాక 190 మంది స్త్రీలకు కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్సలు జరుపబడ్డాయి. 150 నేత్ర శస్త్ర చికిత్సలు 1093 శిశువులకు మశూచి టీకాలు కూడా ఇవ్వబడ్డాయి. వేల సంఖ్యలో వచ్చిన ప్రజలకు డాక్టర్లు ఉచిత సలహాలు ఇచ్చారు.

చేవెళ్ళ తాలుకాలో 114 గ్రామాలు ఉన్నాయి. జనాభా 1,14000 పైగా ఉంటుంది. శిబిరం నిర్వహణకుముందు గ్రామాల లోని సామాన్య వ్యాధులను దృష్టిలోవుంచి ప్రజలకు అందుబాటులో వుండేలా 16 ఉపకేంద్రాలు యేర్పాటుచేయబడ్డాయి. ఉప కేంద్రాలలో పరీక్షలు జరిపిన తరువాత ఉచిత సలహాలు, చికిత్సలు చేయబడ్డాయి. శస్త్ర చికిత్స యోగ్యతగలవారిని ముఖ్యకేంద్రము నకు తరలించి శస్త్రచికిత్సలు చేయడం జరిగింది.

శిబిరమును ప్రారంభిస్తూ ఆరోగ్యశాఖా మంత్రి శ్రీ కె రాజమల్లుగారు తెలంగాణా సివిల్ అసిస్టెంటు సంఘం చేపట్టిన యీ కార్యక్రమములో పాల్గొన్నవారందరినీ అభినందించారు. ప్రజలు ఎక్కువసంఖ్యలో శిబిరమును దర్శించి ఉచిత వైద్యసలహా లను పొందవలసినదిగా కోరారు. శిబిరం నిర్వహింపబడిన కాలంలో రోగులకు ఉచిత భోజన వసతులు, ఔషధములు ఇవ్వడంకూడా జరిగింది. ట్యూబెక్టమీ ఆపరేషన్లు చేసుకున్న స్త్రీలకు ఒక చీర, రవిక ఉచితంగా ఇవ్వబడ్డాయి.

ఆరోగ్యశాఖలోని అన్నిరంగాలకు చెందిన నిపుణులు సామూహికశిబిరంలో పాల్గొన్నందున ప్రజలకు గణనీయమైన సేవ చేకూరిందని చేనేత-జవుళి పరిశ్రమశాఖామాత్యులు శ్రీ కె. వి. కేశవులు గారు ముగింపు కార్యక్రమముయొక్క సమావేశంలో పేర్కొన్నారు.

కుటుంబనియంత్రణ శస్త్రచికిత్సలు డా. హబీబుర్రహమన్ ఆధ్వర్యంలోనూ, శిశు ఆరోగ్య శిబిరము డా. లావణ్యముఖర్జీ పర్యవేక్షణలో నేత్రశస్త్ర చికిత్సలు డా. పి. శివారెడ్డి పర్యవేక్షణలో విజయవంతంగా జరిగాయి. ఆరోగ్యశాఖ కార్యదర్శి శ్రీ ఎమ్. ఆర్. పాయ్ సలహాలు సామూహిక శిబిరము సక్రమముగా నిర్వహింప బడుటలో తోడ్పడ్డాయి.

చేవెళ్ళ పంచాయతీ సమితి మాజీ అధ్యక్షులు శ్రీ వి. నరసింహారెడ్డి, శాసనసభ్యులు శ్రీ పి. కిషన్‌రావు, సమితి ప్రత్యేకాధికారి శ్రీ జి.వి. రామారావు శిబిరమును సమర్థవంతంగా నిర్వహించి ప్రశంసా పాత్రులయ్యారు.

---

శ్రీ ఎ. ఇంద్రసేన రెడ్డి

---

### కీసరగుట్ట జాతరలో అభివృద్ధి ప్రదర్శన

మేడ్చల్ సమితిలోకల కీసరగుట్టలోని రామలింగేశ్వర దేవాలయంలో శివరాత్రి ఉత్సవాలు ఫిబ్రవరి 25 నుండి మార్చి 2 వరకు వైభవంగా జరిగాయి.

ఈ మహోత్సవ సందర్భంగా హైదరాబాద్ జిల్లా కలెక్టరు గారి ఆదేశానుసారం అభివృద్ధి కార్యక్రమాల ప్రదర్శన ఒకటి తత్సంబంధిత అధికారులచే ఏర్పాటుచేయబడింది. ఆంధ్ర ప్రదేశ్ డెరీ డెవలప్‌మెంట్ సంస్థవారు కూడా ఒక ప్రదర్శన ఏర్పాటు చేశారు. యాత్రికుల సౌకర్యార్థం సూపర్ బజారుకూడా ఏర్పాటు చేయబడింది.

సుమారు రెండు లక్షల యాత్రికులు ఉత్సవాలలో పాల్గొన్నారు. యాత్రికులలోని అధికభాగం ప్రదర్శనశాలలను దర్శించారు. జిల్లా పౌరసంబంధశాఖ వారు, పశుగణాభివృద్ధి శాఖ వారు ప్రతిరాత్రి సినిమా ప్రదర్శనలు ఏర్పాటుచేశారు. కీసర గుట్ట జాతర కమిటీ తరఫున ఆటల పోటీలు, సాంస్కృతిక కార్యక్రమములు, పశుప్రదర్శన, శిశుప్రదర్శన పోటీలు నిర్వహింప బడ్డాయి. పౌరసంబంధశాఖ ఆధ్వర్యంలో శ్రీ గోపాల్‌రాజ్‌భట్ బృందం ఒక ప్రత్యేక సాంస్కృతిక కార్యక్రమాన్ని మార్చి 1 నాడు ప్రదర్శించి ప్రేక్షకులను రంజింపచేశారు.

చేనేత, జవుళి పరిశ్రమలశాఖామంత్రి శ్రీ కె.వి. కేశవులు ప్రదర్శన ప్రారంభించారు. ఆటల పోటీలలోని విజేతలకు శ్రీ ఎమ్. భోజిరెడ్డి మాజీ జిల్లాపరిషత్ అధ్యక్షులు బహుమతి ప్రదానంచేశారు. పశుగణాభివృద్ధిశాఖ డైరెక్టరు డా. బి. ఎ. శిరాజి

(తరువాయి 23 వ పేజీలో)

# 'నీల్' సత్యాగ్రహం

— శ్రీ ఎస్. ఆర్. కోటేశ్వరశర్మ

అది 1933 వ సంవత్సరం. ఆంధ్రప్రాంతం, తమిళ ప్రాంతంతో మద్రాసు "ప్రెసిడెన్సీ" గావున్న రోజులు. తెలుగువారు, తమిళులు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, రాజాజీ ప్రోత్సాహ సహకారాలతో బ్రహ్మాండమైన సత్యాగ్రహం మద్రాసు నగరాన జరిపారు. దానికి ఆనాడు మహాత్మాగాంధీ సానుభూతి, ఆశీస్సులు లభించాయి. స్వయంగా మహాత్మాగాంధీ సత్యాగ్రహంలో పాల్గొన్నారు. అదే చరిత్ర ప్రసిద్ధమైన "నీల్ సత్యాగ్రహం"గా భారత దేశం యావత్తూ ప్రాచుర్యం పొందింది.

ప్రథమ భారత స్వాతంత్ర్య దినాలందు (1857) నీల్ మద్రాసు పటాలంలో జనరల్‌గా వుంటూ వుండే వాడు. అప్పుడు భారత దేశంలో ఆంగ్లేయులకు రాజధాని కలకత్తా. ఉత్తరా పథంలో స్వాతంత్ర సమరాగ్నులను అణచడానికి జనరల్ నీల్‌ను గవర్నరు జనరల్ అయిన కానింగ్ కలకత్తాకు పిలిపించాడు. తదుపరి కలకత్తా నుండి కాశీకి పంపబడ్డాడు నీల్.

ఆనాడు ఉత్తర హిందూస్థానంలో జనరల్ నీల్ జరిపిన రాక్షసకృత్యాలు చరిత్రను, నాగరికతను వంచించాయి. అతడు జరిపిన ఘోర కృత్యాలను ఆంగ్లేయులు వీరకృత్యాలుగా వర్ణించి అతనిస్మృతి కోసం ఒకభారీ శిలా విగ్రహాన్ని మద్రాసు నగర కేంద్ర స్థలాన, మౌంటురోడ్డుపై విప్లవం సమసిపోయిన తర్వాత స్థాపించారు. ప్రథమ భారతస్వాతంత్ర్యం విఫలమైనా, దేశం యావతూ మహాత్మాగాంధీ, నేతాజీ ప్రభృతుల నేతృత్వంలో ఈ శతాబ్దపు తృతీయ దశాబ్దంలో మరల స్వాతంత్ర్య పోరాటం సాగింది. పెద్ద ఎత్తున స్వాతంత్ర్య సమరం సాగింది. స్వాతంత్ర్య సమర భాగంగా, తుచ్ఛమైన నీల్ విగ్రహ ప్రతిష్ఠను భారత జాతికి అవమానంగా, తలవొంపులుగా మద్రాసు ప్రజలు భావించారు. ఆ విగ్రహాన్ని తీసివేయడం కోసం భారీ ఎత్తున సత్యాగ్రహం జరిపారు.

## విగ్రహ ప్రతిష్ఠ

మద్రాసులో నీల్ విగ్రహ ప్రతిష్ఠ. దానివెనుక గల చారిత్రిక సత్యాలను తెలుసు కుందాం. 1857 జూన్ 3 వ తేదీన నీల్ కాశీలో అడుగు పెట్టాడు. కాశీ ఆనాడు ఆంగ్లేయుల బలానికి కీలక స్థానంగా వుండేది. 4 వ తేదీన కాశీ సమీపానగల "అజంఘర్"లో సిపాయిలు తిరుగబడ్డారు. ఆంగ్లసైనికులకు దేశీయ వీరులకు భయంకరమైన యుద్ధం జరిగింది. ఆంగ్లేయులు వీగిపోయారు. ఆంగ్లేయులు వీగి పోయినా, వారి స్త్రీలకు పిల్లలకు ఏహానిని తలపెట్టక దేశీయ వీరులు స్వయంగా బళ్లు కట్టించి వారు కోరుకున్న ప్రాంతాలకు సురక్షితంగా పంపారు. మానవత్వానికి, నాగరికతకు దేశీయ వీరులు పెట్టింది పేరుగా ప్రఖ్యాతిగాంచారు.

దేశీయ వీరులను అణిచే సత్తా, సైనిక సంఖ్య నీల్ వద్ద లేదు. కన్నంలో తేలుకుట్టిన దొంగలా మిన్నకున్నాడు. అప్పుడు పటాలం స్వాతంత్ర్య సమరంలో పాల్గొనక, ఆంగ్లేయుల కొమ్ము కాసింది. కాశీలో నీల్ కోసం దేశీయ వీరులు వెదికారు. కాని అతడు దాక్కొన్న రహస్య స్థావరాన్ని కనిపెట్టలేక పోయారు. 5 వ తేదీన సాయంత్రం కల్లా సిక్కు పటాలం బ్రిటిషువారికి సహాయంగా కాశీ వచ్చింది. నీల్, మిగిలిన తెల్ల దొరలు సిక్కు పటాలపు రాకతో వీరుల్లా బయటకు వచ్చారు. దానికితోడు తెల్లసైన్యం కూడా నీల్‌కు సహాయంగా వచ్చిచేరింది. దేశీయ వీరులు నిరాయుధులు కావింపబడ్డారు. 37 వ పటాలానికి సంబంధించిన ఆరు భారత సిపాయి కంపెనీల సైనికులు నీల్‌చే కాల్చిచంపబడ్డారు. నీల్ అసుర కాండ అంతటితో ఆగలేదు.

## హింసాకాండ

నీల్ జరిపించిన హింసా కాండ మధ్యయుగాల బానిస కాండనే చిత్తుచేస్తుంది. కాశీ, అజంఘర్ పరిసర గ్రామాలకు ఆంగ్ల సైనికుల్ని పంపాడు విప్లవ సంబంధం లేని గ్రామాలను కూడా తగులబెట్టించాడు. మంటల బారి నుంచి పారిపోతున్న అమాయక ప్రజల్ని పల్లెల వెలుపల గల చెట్లకు కట్టి వురితీయించాడు. "వృథాగా తుపాకుల్లోని తూటాలను ఖర్చుపెట్టకండి. ఈ భారతీయకుక్కలను చెట్లకు కట్టి ఉరితీయండి. లేక పోతే చేతికందిన వాడినల్లా కుక్కలను బాదినట్టు బాది చంపండి. ఈ చావుకంటే నికృష్టమైన చావు-వాండ్లు ఎన్నడు చూచి వుండ కూడదని" జనరల్ నీల్ తన సైనికులను ఆదేశించాడు. భారత పల్లె ప్రజను వురితీసే కార్యక్రమంతో డస్సి పోయిన ఆంగ్లేయులు మంటలు వేసి సజీవ దహనం కావించారు. మంటల బాధకు తాళ లేక బయటకు వురికే మనుష్యులను తుపాకీ మడమలతో చావమోదారు. ఇదంతా నీల్ నాయకత్వాన జరిగింది. ఆంగ్లేయులు అంచనా ప్రకారమే విప్లవానికి సంబంధం లేని అమాయక ప్రజలు పదివేలకు మించి నీల్ దహన కాండకు గురి అయినా రంటే, అసలు సంఖ్య యింకా ఎంత వుంటుందో!

కాశీ నుండి నీల్ అలహాబాదు చేరాడు. అతని బండిని లాక్కొచ్చింది గుర్రాలు కాదు, భారతీయ సైనికులు. ఈ చేష్టలకు ఆంగ్లేయులే తలవంచుకున్నారు. అలహాబాదు లోని ఖుస్రూబాగ్ విప్లవ కేంద్రం. జూన్ 17 నాటికి అనగా పది రోజుల భయంకర యుద్ధం తర్వాత గాని నీల్‌కు వశంకాలేదు. అలహాబాదులో విప్లవ ప్రభుత్వం వీగిపోవడంతో, నీల్ కాశీలో జరిపిన రాక్షసకృత్యాలను అలహాబాదునందు పరిసర ప్రాంత పల్లెలందు జరిపించాడు. వేలకొలదిమందిని మట్టుపెట్టాడు.

ఆనాడు ఆంగ్లేయులచే కనబడ్డ భారతీయులందరు చంప బడ్డారు. నీల్ జరిపించిన ఉరిశిక్షలకు, దుర్మార్గాలకు పసిపిల్లలు, స్త్రీలు కూడా గురైనారు. పదిపన్నెండు ఏళ్ల ప్రాయంగల పిల్లలు భార్యలు తమ తండ్రుల్ని, భర్తల్ని అన్యాయంగా ఉరికంబాలెక్కిస్తూ వుంటే, వారి ప్రాణాల్ని రక్షించమని ప్రాధేయపడ్డారు. ఫలితంగా ఆంగ్లేయుల కర్కశహస్తాల్లో వారుకూడా అసువులు బాశారు.

"ముసలివాళ్లు మనకేమి అపకారం చేయలేరుగదా! నిజానికి చేయరుకూడా. స్త్రీలు పూర్తిగా నిరపరాధులు, ఇక పిల్లలా! వారి

కేమి తెలుసు? అయినా వాళ్లందర్నీ మనం మన కసికి గురిచేశాం", అని నీల్ దారుణహింసాకాండను చూసి భరించలేక హామ్స్ అనే సైనికాధికారి అలహాబాదులో అన్నాడు. ఆనాటి సమకాలీన బ్రిటీషు పత్రాలందు నీల్ ఘోరకృత్యాలు రికార్డు గావించబడ్డాయి. అయినా అతడు ఆంగ్లేయులకు దేవత. కాని స్వాతంత్ర్యప్రియులందరకూ విరోధియే. నీల్ విగ్రహం తొలగించడంకోసం ఉవ్వెత్తున మద్రాసు సత్యాగ్రహం జరిగింది.

స్వాతంత్ర్యసమరం సమసిపోయి, 1858లో తెల్లవారి అధికారం ఈస్టిండియాకంపెనీ నుండి, బ్రిటీషు పార్లమెంటుకుమారింది. నీల్‌కు స్మృతిగా ఆంగ్లేయులు ఉత్తరహిందూస్థానంలో ఎక్కడా విగ్రహాన్ని ప్రతిష్ఠించలేకపోయారు. అతని దారుణకృత్యాలను చవిగొని, చూచి, విన్న ఉత్తరహిందూస్థాన ప్రజలు నీల్ విగ్రహాన్ని కూడా సహించలేరని బ్రిటీషుప్రభుత్వం భయపడింది మద్రాసు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనలేదు. అప్పటికి నీల్ దారుణకాండ గూర్చి మద్రాసు ప్రజకు తెలియదు. నగరంలో విగ్రహస్థాపనచేస్తే, ఎంతోమంది విగ్రహాలలో, నీల్ విగ్రహం ఒక్కటి అని మిన్నకున్నారు. దశాబ్దాలు మారాయి. ప్రథమ భారత స్వాతంత్ర్యసంగ్రామం అప్పుడు విఫలమైనా, తర్వాత స్వాతంత్ర్య పోరాటానికి ఉత్తేజాన్ని కూర్చింది. నీల్ దురంతాలను విన్న మద్రాసు ప్రజలు, వాని విగ్రహాన్ని పీకేయమని శాంతియుతంగా సమరం సాగించారు. నీల్ జరిపించిన ఊచకోతలను, సామూహిక మరణకాండను బ్రిటీషు చరిత్రకారులు వీరకృత్యాలు గావించారు. మన వీరులు కావించిన ఉదంతాలను దురంతాలుగా మార్చి చరిత్రపుటల్ని చెత్తలో నింపివేశారు. ఆ అబద్ధాలను యిటీవలి వరకు మనం నిత్య పారాయణం చేస్తూవుండ వలసి వచ్చింది.

## నీల్ వధ

1857 సెప్టెంబరు నెలలో విప్లవప్రభుత్వం నుండి ఢిల్లీ నగరం ఆంగ్లేయుల వశమైంది. కాని లక్నోనగరం మాత్రం ఆంగ్లేయులకు కొరకరాని కొయ్యగా మారింది. కానింగ్ ఆదేశానుసారం అశేషమైన ఆంగ్ల సైన్యాన్ని, సిక్కుపటాలాన్ని తీసికొని నీల్ లక్నోనగరం వైపు 22వ తేదీన బయలుదేరాడు. అతనికి హేవ్లాక్, జాట్రమ్ అను ఆంగ్ల సేనాపతులు ముఖ్యానుచరులుగా వచ్చారు.

23న లక్నోనగరంలో బార్‌ఖాన్‌వంతెన వద్ద హేవ్లాక్ ఆధ్వర్యంలోను, ఖాసింబజారులో నీల్ ఆధ్వర్యంలో ఆంగ్లేయులు దేశీయవీరులతో యుద్ధం చేశారు. అమాయకులైన పసిపిల్లలను, సూర్యరశ్మి సోకని స్త్రీలను సైతం చిత్రవధలు గావించిన ద్రోహి, పాషండుడు, నరరూపరాక్షసుడు అయిన నీల్‌ను దేశీయవీరులు ఖాసింబజారు పోరాటంలో కుక్కను చంపినట్టు పొడిచి చంపారు. దాంతో భారత ప్రజాద్రోహి, క్రూరుడు అయిన నీల్ అంతమయ్యాడు. దీనిని బట్టి "నీల్" ఎవడో, మద్రాసులో ప్రజ్వరిల్లిన నీల్ సత్యాగ్రహం యొక్క ప్రాముఖ్యత ఏమిటో తేటతెల్లం కాగలదు.

బ్రిటీషు ప్రభుత్వం ప్రజాభీష్టాలన్నీ మన్నించి, నీల్ విగ్రహాన్ని తొలగించకపోతే, ప్రమాదం వాటిల్లగలదని గ్రహించింది. కాని హింసాత్మక విప్లవాగ్ని అదే సంవత్సరంలో మద్రాసు నందు భగ్గుమంది. బెంగాలుకు, పంజాబుకు సంబంధించిన టెర్రరిస్టులైన శంభునాథ్, ప్రేమ్‌ప్రకాశ్, రోషన్‌లాల్, టబ్బులాల్, ఖుషీరాం మెహతా, హజార్‌సింగ్, గోవిందరామ్, నిత్యానంద్ అను యువకులు మద్రాసు చేరారు ఊటీబ్యాంకు దోపిడీ చేయించారు. లింగంశెట్టి వీధిలో బాంబులు తయారుచేశారు. హింసాత్మక విప్లవంతో ఆంగ్లప్రభుత్వాన్ని కూలద్రోయాలని నమ్మిన ఆ దేశీయవీరులు అడ్డు వచ్చిన కొంత మంది బ్రిటీషు అధికార్లను హతం కావించారు. దాంతో నీల్ సత్యాగ్రహ విజయం వెనుకకు మరలింది. ఎంతటి ఉద్యమాన్ని అయినా ఎదుర్కొని, అణచివేద్దామని ఆంగ్లప్రభుత్వం నిర్ణయించుకుంది.

## సత్యాగ్రహ విజయం

1935 సంవత్సరం మాంటేగ్-ఛెమ్స్‌ఫర్డు సంస్కరణల దృష్ట్యా, దేశీయనాయకుల సంప్రదింపులు ఫలితంగా 1937లో ఏడు రాష్ట్రాలందు ఎన్నికలు జరిగాయి. కాంగ్రెసువారు మంత్రిపదవులు స్వీకరించారు. మద్రాసులో రాజాజీ ముఖ్యమంత్రిగా దేశీయులు మంత్రి పదవులు అలంకరించారు. 1937లో మద్రాసులో మొదటి కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడినప్పుడు గాని, 1933 నాటి మద్రాసు ప్రజల సత్యాగ్రహ ఆశయం నెరవేరలేదు. నీల్ విగ్రహాన్ని బహిరంగ ప్రదేశం నుండి తొలగించారు ప్రస్తుతం ఈ విగ్రహం మద్రాసు మ్యూజియంలో గలదు. 1938వ సంవత్సరంలో బెంగాల్, పంజాబ్‌కు చెంది చనిపోగా మిగిలిన విప్లవకారుల్ని కూడా యితర రాజకీయ ఖైదీల మాదిరే రాజాజీ ప్రభుత్వం విడుదల చేసింది.

కేవలం నాలుగు దశాబ్దాల క్రితం, దేశవ్యాప ప్రాధాన్యం పొందిన నీల్ సత్యాగ్రహం గూర్చి వివరాలు చరిత్ర పుటలకెక్కక పోవడం విచారకరం. ఆనాడు మద్రాసులో జరిపిన నీల్ సత్యాగ్రహం తెలుగు, తమిళ ప్రజలకే గాక, భారత దేశీయులకు, స్వాతంత్ర్యప్రియులందరకూ ఆదర్శప్రాయమైంది.

# శాసనసభ బడ్జెటు సమావేశాలు

## ఒక సమీక్ష

ప్రత్యేక విలేఖరి

జనవరి 28వ తేదీన ప్రారంభమైన రాష్ట్ర శాసన సభల బడ్జెటు సమావేశం మార్చి 30వ తేదీతో ముగిసింది. సుమారు రెండు నెలల పాటు జరిగిన యీ సుదీర్ఘ సమావేశంలో 1976-77 సంవత్సరపు బడ్జెటును ఆమోదించడమేకాకుండా శాసన సభలు ఇరవైకి పైగా బిల్లులను ఆమోదించినాయి. సమగ్ర విద్యాబిల్లు జాయింటు సెలక్టు కమిటీకి పంపబడింది. గ్రామపంచాయితీలు, పంచాయితీసమితులు, జిల్లా పరిషత్తుల సవరణ బిల్లులపై సెలెక్టు కమిటీ నివేదిక శాసన సభలకు అందజేయబడింది. ఈ రెండు బిల్లులు, సమగ్ర విద్యా బిల్లుపైన చర్చలు వచ్చే జూన్ సమావేశంలో జరుగుతాయని ప్రకటించబడింది.

గవర్నరు శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా ప్రసంగంతో, ఉభయ సభల సమావేశాలు జనవరి 28న ప్రారంభమైనాయి.

గవర్నరు ప్రసంగంపై అభినందనలు తెలుపుతూ ప్రవేశ పెట్టిన తీర్మానం పై అయిదు రోజులపాటు చర్చజరిగింది. ఈచర్చకు సమాధానం చెబుతూ, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు,వచ్చే అయిదేళ్ల కాలములోను, రాష్ట్రంలో ప్రస్తుతం సాగవుతున్న భూమిని రెట్టింపు భూమికి సాగు కిందికి తీసుకు రావడం జరుగు తుందని ప్రకటించారు. ప్రభుత్వపు ఆర్థిక వనరులు మెరుగు పడి నందువల్లా, నాగార్జునసాగర్, పోచంపాడు వంటి భారీ ప్రాజెక్టులకు ప్రపంచ బ్యాంకు సహాయం లభిస్తున్నందువల్లా, భూగర్భ జలాలు ఎక్కువగా లభించడం వల్లా అదనపు భూమి సాగు చెయ్యబడగల దని, ముఖ్యమంత్రి వివరించారు.

రాష్ట్రం మొత్తం మీద 31 శాతం మాత్రమే ప్రస్తుతం సాగు చేయబడుతున్నదనీ అయిదేళ్లలో 70 శాతం భూమిని సాగులోకి తీసుకురావాలన్న లక్ష్యంతో ప్రభుత్వం కృషి చేస్తున్నదనీ ఆయన చెప్పారు.

### గోదావరి జలాల ఒప్పందం

కొద్ది మాసాల కిందట గోదావరి నదీ జలాల కేటాయింపు పై అయిదు రాష్ట్రాల మధ్య జరిగిన ఒప్పందం ఫలితంగా, ఆంధ్రప్రదేశ్‌కు కేటాయింపబడిన గోదావరి జలాలను పూర్తిగా వినియోగించుకోవాలంటే, కొత్త ప్రాజెక్టుల నిర్మాణానికి గాను 30 ఏళ్ల పడుతుందనీ, 2500 కోట్ల రూపాయలు ఖర్చు కాగలదనీ ముఖ్యమంత్రి అన్నారు.

ధాన్య సేకరణ విషయం గురించి ప్రస్తావిస్తూ 1975 లో అయిదు లక్షల టన్నుల బియ్యం సేకరించడం జరిగిందనీ, అంతకు ముందు సంవత్సరం కంటే రెండు లక్షల టన్నుల బియ్యం అద నంగా సేకరింపబడిందనీ వెంగళరావుగారు తెలియజేశారు. అయితే, రాష్ట్రంలో గిడ్డంగులకొరత ఏర్పడిన కారణంగా ధాన్య సేకరణలో కొంత యిబ్బంది ఏర్పడిందని చెబుతూ నిరుపయోగంగా పడివున్న కొన్ని విమానాశ్రయాలను కూడా ధాన్యం నిల్వలను భద్రపరచడం కోసం ఉపయోగించడం జరుగుతుందని, ముఖ్యమంత్రి అన్నారు.

ముఖ్యమంత్రి తమ సుదీర్ఘ సమాధానంలో, చర్చలో సభ్యులు లేవదీసిన అంశాలన్నింటికి వివరంగా సమాధానం చెప్పారు.

భూకమతాల పరిమితి శాసనం కట్టుదిట్టంగా అమలు జరప బడుతుందనీ, ఈ చట్టాన్ని ఉల్లంఘించిన వారు, ఎంత గొప్పవారైనా సరే, అట్టి వారిపై కఠినచర్యలు తీసుకోబడుతా యనీ ముఖ్యమంత్రి హామీ యిచ్చారు. కాని సభ్యులు గాలి వాటంగా ఆరోపణలు చెయ్యకూడదని, నిర్దుష్టమైన ఆరోపణలు చేయాలని, అలా చేసినట్లయితే, వాటిపై తగిన విచారణ జరిపించి, ఈ చర్య తీసుకోవడం జరుగుతుందని కూడా ఆయన హామీ యిచ్చారు.

### గవర్నరు ప్రసంగంపై చర్చ

కాంగ్రెసు సభ్యుడు శ్రీ యం నారాయణరెడ్డి ప్రవేశపెట్టిన గవర్నరు ప్రసంగానికి అభినందనలు తెలిపే తీర్మానంపై జరిగిన చర్చలలో, గోదావరి నదీ జలాల ఒప్పందంపై సభ్యులు రాష్ట్ర ప్రభుత్వాన్నీ ముఖ్యమంత్రి చూపిన చొరవనూ అభినందించారు.

ఫిబ్రవరి 18వ తేదీన ఆర్థిక మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి గారు 1976-77 సంవత్సరానికి ప్రవేశ పెట్టిన బడ్జెటు అంచనాలలో, మొత్తం మీద 43 కోట్ల రూపాయల తరుగు కనిపిస్తున్నప్పటికీ, ఈ లోటును భర్తీ చేయడానికి కొత్త పన్నులు ఏమీ విధింపబడ లేదు. కొత్త బడ్జెటు అంచనాల ప్రకారం, ఆదాయం 656.16 కోట్ల రూపాయలు. ఖర్చు 616.41 కోట్ల రూపాయలు. దీని ప్రకారం, 39.74 కోట్ల రూపాయలు మిగులు కనిపిస్తున్నప్పటికి పెట్టుబడి ఖాతాలో ఖర్చు 129.17 కోట్ల రూపాయలు కూడా లెక్కలోకి తీసుకుంటే మొత్తం మీద 42.69 కోట్ల రూపాయలు లోటు తేల తుంది. పన్నులు, పన్నుల బకాయిల వసూళ్ల మరింత కట్టు దిట్టం చేయటంతోను కేంద్రం నుంచి రుణాల ఎక్కువ సహాయం తోనూ, ఈ లోటును భర్తీ చేయగలమన్న ఆశాభావాన్ని ఆర్థిక మంత్రి ప్రకటించారు.

నిజానికి 1976-77 సంవత్సరంలో తేలిన 42.69 కోట్ల రూపాయలలోటు ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన మొదటి సంవత్సరంలోని ప్రభుత్వపు రెవిన్యూ ఆదాయానికి దాదాపు సరిసమానంగా వున్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన. సంవత్సరంలో (1956-57) ప్రభుత్వ రెవిన్యూ ఆదాయం రూ. 47.25 కోట్లు కాగా, రెవిన్యూ ఖర్చు 51-94 కోట్లు వున్నది. దానితో పోల్చి చూస్తే రెండు దశాబ్దా లలో ప్రభుత్వ రెవిన్యూ ఆదాయం 14 రెట్లు పెరిగింది. ఖర్చుకూడా అదే ప్రమాణంలో పెరిగిందనుకోండి. కాని రెండు దశాబ్దాలలో రాష్ట్ర ఆర్థికవనరులు ఎన్ని రెట్లు పెరిగినాయో, ఆర్థికాభివృద్ధి ఎంతగా జరిగిందో అర్థంకాగలదు.

ప్రయోజనకరమైన ఆర్థిక చర్యలకు తోడు, అనుకూలమైన వాతావరణ పరిస్థితులు మనరాష్ట్ర ఆర్థిక వ్యవస్థ పునరుజ్జీవన కార్యక్రమానికి దోహదం చేశాయని ఆర్థిక మంత్రి శ్రీ రంగారెడ్డిగారు అన్నారు. ఇందుకు నిదర్శనంగా 1973–74 సంవత్సరంలో కనిపించిన అభివృద్ధి సూచనలు 1974–75లో బాగా స్పష్టంగా బైటపడ్డాయని ఆయన పేర్కొన్నారు. రాష్ట్ర ఆదాయంఅప్పుడు రూ. 3711.3 కోట్ల నుండి రూ. 4119.1 కోట్లకు అంటే 11 శాతం పెరిగింది. 1974–75 లో రాష్ట్రంలో 90 లక్షల టన్నుల రికార్డు స్థాయిలో ఆహార ధాన్యాలు పండినాయి. ఖరీఫ్ రాబి పంటల కాలాలలో వాతావరణ పరిస్థితులు చాలా వరకు అనుకూలంగా వున్నందువల్ల యీ ఏడు కూడా ఆహార ధాన్యాల ఉత్పత్తి యింకా ఎక్కువగా వుంటుందని ప్రభుత్వం విశ్వసిస్తోంది. పారిశ్రామిక ఉత్పత్తుల విషయంలో కూడా పరిస్థితి యిదే విధంగా ప్రోత్సాహకరంగా వుంది. 1974 సంవత్సరంలో యీ రంగంలో 14.8 శాతం అభివృద్ధి కనిపించింది, 1975 లో కనిపించిన అభివృద్ధి 17.2 శాతం వీటన్నిటిని బట్టి చూస్తే గత రెండు, మూడేళ్లలోనూ వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో ఎంత అభివృద్ధి చెందినదో అర్థంకాగలదు.

రెవిన్యూ ఆదాయంతో పాటు 1976 77 వార్షిక ప్రణాళిక పెద్ద ఎత్తున పెరిగింది. 1975–76 సంవత్సరపు వార్షిక ప్రణాళికకు మొదట్లో బడ్జెటులో రూ. 153.68 కోట్లు కేటాయించబడింది. తరువాత దానిని రూ 187.50 కోట్లకు పెంచడం జరిగింది. కాగా సవరించిన అంచనాల ప్రకారం యీ మొత్తం యింకా పెరిగి రూ 203.30 కోట్ల అయింది. ఈ పెరుగుదల ముఖ్యంగా విద్యుచ్ఛక్తి నీటి పారుదల రంగాలలో జరిగింది.

1976 సంవత్సరపు వార్షిక ప్రణాళికకు బడ్జెటు అంచనాలలో చూపబడిన మొత్తం రూ. 238.06 కోట్లు అయితే వార్షిక ప్రణాళిక రూ. 238 కోట్ల నుండి రూ. 262 కోట్లకు పెరిగితే దాదాపు యీ పెరుగుదల అంతా సేద్యపు నీటిపారుదల. విద్యుచ్ఛక్తి రంగాలకే వర్తిస్తుందని ఆర్థికమంత్రి అన్నారు. తత్ఫలితంగా సేద్యపు నీటిపారుదలకు బడ్జెటులో చేసిన కేటాయింపు రూ. 61.20 కోట్లు యిప్పుడు రూ. 71.30 కోట్లకు పెరుగుతుంది. విద్యుచ్ఛక్తిలో కేటాయింపు రూ. 90 కోట్ల నుండి రూ. 106.18 కోట్లకు పెరుగుతుంది. అదేవిధంగా వ్యవసాయం దానికి సంబంధించిన కార్యక్రమాల కేటాయింపు రూ. 16.63 కోట్ల నుండి రూ. 17.96 కోట్ల వరకు పెరుగుతుంది. ఈ పెరుగుదలవల్ల అనావృష్టికి గురిఅయ్యే ప్రాంతాలకు తగినంతగా నిధులు సమకూర్చడానికి వినియోగించబడుతుంది. కాగా, సాంఘిక సేవాకార్యక్రమాల మీద కేటాయింపు రూ. 33.64 కోట్ల నుండి రూ. 34.08 కోట్లకు పెరుగుతుంది.

ఈ సంవత్సరం (1976–77) వార్షిక ప్రణాళిక రూ. 262 కోట్ల పెట్టుబడి, గత సంవత్సరంకంటే (1975–76) 30 శాతం ఎక్కువన్నమాట. దాన్నిబట్టి ఈ సంవత్సరంలో అభివృద్ధి కార్యక్రమాలను ఎంత భారీ ఎత్తున విస్తరింపజేయవచ్చునో వూహించుకోవచ్చు.

ఇక పోతే కేంద్ర ప్రతిపాదిత పథకాలక్రింద చేసిన కేటాయింపులు, దానికితోడు యింకా ప్రత్యేక అభివృద్ధి పథకాలకు లభించే రూ. 20 కోట్లను కలుపుకుంటే. 1976–77 సంవత్సరంలో అభివృద్ధి కార్యక్రమాలమీద జరిగే మొత్తంఖర్చు రూ. 300 కోట్లు దాటుతుందనీ, ఆర్థికమంత్రి శ్రీ రంగారెడ్డి స్పష్టంచేశారు.

1976–77 సంవత్సరంలో ఒక్కొక్క రంగంలోనూ, చేసిన కేటాయింపులు. అవిగాక సంవత్సరంకన్న ఎంత ఎక్కువగా వున్నదీ ఆర్థికమంత్రి విపరంగా తెలియజేశారు. ఇందువల్ల అభివృద్ధి కార్యక్రమాలమీద పెట్టుబడులు బాగా అధికం చేసుకోగలుగుతున్నామనీ, ఆ విధంగా వాటి వేగాన్ని నిలుపుకోగలుగుతున్నారనీ స్పష్టంగా తెలుస్తున్నదనీ, శ్రీ రంగారెడ్డి అన్నారు మరొకవైపు అవసరం అయినంతవరకు ప్రణాళికేతర రంగంలోని ఖర్చులను కూడా, అంటే ఉద్యోగుల సంక్షేమానికి సంబంధించినవిగానీ, ఆస్తులను, సౌకర్యాలను సరిగ్గా నిర్వహించుకోడానికి సంబంధించినవిగానీ, అభివృద్ధేతరమైనవైన కొన్ని అత్యవసర సేవలను విస్తృతపరచుకోడానికి సంబంధించినవిగానీ, యిటువంటి ప్రణాళికేతరఖర్చులను కూడా చేసుకోగలుతున్నాం. మన వనరులను అభివృద్ధిపరచుకున్నందువల్ల, వాటిని జాగ్రత్తగా ఉపయోగించుకుంటున్నందువల్ల యిది సాధ్యపడుతున్నది. ఈ విధంగా మనం అభివృద్ధి పరచుకున్న వనరులను సమర్థవంతంగాను, పొదుపుగానూ వినియోగించుకుంటూ, ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి, సాంఘిక న్యాయసాధన అనే జంటలక్ష్యాల సాధనకు, వాటిని ఉపయోగించుకునే బాధ్యత అందరి మీద ఉన్నదని శ్రీ రంగారెడ్డి హెచ్చరించారు.

బడ్జెటు అంచనాలపై ఉభయ శాసనసభలలోను అయిదు రోజులపాటు చర్చలు జరిగినాయి ప్రభుత్వ కార్యక్రమాలను అమలు జరపడంతో పరిపాలనా యంత్రాంగం మరింత చురుకుగా, సమర్థవంతంగా పనిచేయడంకోసం. యంత్రాంగాన్ని మరింత పటిష్టవంతంగాచేయాలని చర్చలో పాల్గొన్న ప్రతిపక్షనాయకులు శ్రీ వేములపల్లి శ్రీకృష్ణ ప్రభృతులు సూచించారు. ఈ సంవత్సరం అకాల భారీ వర్షాలవల్ల, కొన్ని ప్రాంతాలలో సన్నకారు, మధ్యతరగతి రైతులు నష్టపోయారనీ, రైతుకు సరైన గిట్టుబాటు ధర చెల్లించాలనీ, పలువురు సభ్యులు సూచించారు.

ఆర్థికమంత్రి చర్చకు సమాధానంచెబుతూ, రాష్ట్రంలో పరిశ్రమలను సత్వరంగా నెలకొల్పటానికిగాను పెద్దఎత్తున కార్యక్రమం చేపట్టబడిందనీ, పలుప్రాంతాలలో పారిశ్రామిక వాడలు స్థాపించడం జరుగుతుందనీ, శ్రీ రంగారెడ్డి వివరించారు. అయితే ఆరు సూత్రాల పథకంక్రింద కేంద్రప్రతిపాదిత పథకాలు ఆమోదించడంలో గత సంవత్సరం కొంత జాప్యం జరిగిన మాట వాస్తవమేనని. ఆయన అంగీకరిస్తూ, యికముందు అటువంటి జాప్యం జరగకుండా, ఆర్థిక సంవత్సరం ప్రారంభం కాకముందే. కేంద్రంనుంచి అనుమతి పొందడం జరుగుతుందనీ, శ్రీ రంగారెడ్డి హామీయిచ్చారు

కాగా, ప్రధాని 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం అమలు జరపడంలో, రాష్ట్రం తీసుకున్న చర్యలను వివరిస్తూ, ఈ విషయంలో రాష్ట్రం ముందంజవేసిందనీ, నిత్యావసర వస్తువుల ధరలు యిప్పుడు ప్రజలకు అందుబాటులోవున్నాయనీ, ఉత్పత్తి పెరుగుదల కారణంగా ధరలు తగ్గినాయనీ, ఆర్థికమంత్రి వివరించారు. అదే విధంగా, భూసంస్కరణల చట్టం పట్టుదిట్టంగా అమలు జరుపబడుతోందనీ, యిళ్ల స్థలాలు లేనివారికి మూడు లక్షలకుపైగా ఇళ్ల స్థలాలు యింతవరకు పంపిణీ చేయబడినాయనీ, 1976-77లో నాలుగున్నర లక్షల స్థలాల పంపిణీ జరుగుతుందనీ, ఆర్థిక మంత్రి హామీ యిచ్చారు.

ఆ పిమ్మట, శాసనసభ వివిధ శాఖల పద్దులపై చర్చలు జరిపి వాటినన్నిటినీ ఆమోదించడం జరిగింది.

తమతమ శాఖల పద్దులపై జరిగిన చర్చలకు సమాధానమిస్తూ మంత్రులు కొన్ని ప్రధాన అంశాలపై కొన్ని ప్రకటనలు చేయడం జరిగింది.

గ్రామాధికారుల వ్యవస్థలో ముఖ్యమైన మార్పులు ప్రవేశ పెట్టాలని ప్రభుత్వం సంకల్పించిందనీ, యిందుకుగాను, కర్నాటక రాష్ట్రంలో అమలు జరుపుతున్న పద్ధతిలో ప్రయోగాత్మక ప్రాతిపదికపై కొన్ని తాలూకాలలో గ్రామాధికారుల స్థానంలో పూర్తి కాలం శిక్షణపొందిన లోయర్ డివిజన్ గుమస్తా హోదాకలిగిన సిబ్బందిని నియమించడం జరుగుతుందనీ, రెవిన్యూ శాఖకుచెందిన పద్దులపై జరిగిన చర్చకు సమాధానం చెబుతూ మంత్రి శ్రీ పి. నర్సారెడ్డి ప్రకటించారు. ఈ ప్రయోగం ఎలా పనిచేసిందీ చూసిన తరువాత ఇతర తాలూకాలకు ఆ పద్ధతిని విస్తరింపజేసే విషయం ప్రభుత్వం పరిశీలిస్తుందని కూడా ఆయన హామీయిచ్చారు.

ఈ పద్దులపై జరిగిన చర్చలలో పాల్గొన్న సభ్యులు గ్రామోద్యోగుల వ్యవస్థను పునర్నిర్మించాలనీ, ఆహార ధాన్యాల టోకు వ్యాపారాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలనీ, కోరారు. రైతులకు పాస్ పుస్తకాలు జారీచేయాలని కూడా పలువురు సభ్యులు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

ప్రభుత్వోద్యోగులు ఇండ్లుకట్టుకోడానికి, కొనడానికి రుణాల క్రింద కోటిరూపాయలు ఆర్థిక శాఖ పద్దులో కేటాయించినట్లు మంత్రి శ్రీ రంగారెడ్డి ప్రకటించారు. ఈ కోటి రూపాయలలో 40 శాతం నాల్గవ తరగతి ఉద్యోగులకు,30 లక్షల రూపాయలు నాన్‌గజిటెడ్ ఉద్యోగులకు కేటాయించినట్లు ఆయన తెలియ జేశారు. అంతేకాకుండా, నెలకు వెయ్యి రూపాయలకు పైబడిన జీతం తీసుకునే అధికారులు ఇళ్ళుకట్టుకునే నిమిత్తం రుణాలు యిచ్చే సమస్యనుకూడా ప్రభుత్వం పరిశీలిస్తుందని శ్రీ రంగా రెడ్డి హామీ యిచ్చారు.

రాష్ట్రంలో రోడ్ల అభివృద్ధికి గాను 1976-77 లో రు. 33 కోట్లకు పైగా కేటాయించ బడిందన్న విషయాన్ని పబ్లిక్‌వర్క్సుశాఖ మంత్రి శ్రీ చనుమోలు వెంకట్రావు తమశాఖకు సంబంధించిన పద్దులను ప్రవేశపెడుతూ తెలియజేశారు. వచ్చే మూడు సంవత్సరాలలో రోడ్ల అభివృద్ధికి ఏటా కనీసం నాలుగు కోట్ల రూపాయలు వెచ్చించాలని కూడా ప్రభుత్వం భావిస్తున్నట్టు ఆయన చెప్పారు.

రోడ్డురవాణా సర్వీసుల జాతీయకరణ విషయంలో, రవాణా శాఖ మంత్రి శ్రీ జె. చొక్కారావు కొన్ని కార్యక్రమాలను ప్రకటించారు. వాటి ప్రకారం రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థవారు మరో 170 బస్సు మార్గాలను స్వాధీనం చేసుకునేందుకు పథకాలను తయారు చేశారని, ఆయన ప్రకటించారు. ప్రస్తుత కార్యక్రమం ప్రకారం, అయిదవ ప్రణాళిక కాలం పూర్తి అయ్యే నాటికి, రాష్ట్రంలోని బస్సు రూట్లన్నింటినీ జాతీయకరణ చేయడమే లక్ష్యంగా పెట్టుకోవడం జరిగిందని శ్రీ చొక్కారావు వివరించారు.

భారీ, మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టులకుగాను 1976-77 లో సుమారు రు. 110 కోట్లకు పైగా కేటాయించడం జరిగింది. ఈ విషయాన్ని ఈ శాఖలకు సంబంధించిన పద్దులను ప్రవేశ పెడుతూ, మంత్రి శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు తెలియ జేశారు.

ఈ ఆర్థిక సంవత్సరములో నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు రు. 18 కోట్లు కేటాయించడం జరిగింది. పనులను శీఘ్రతరం చేయడానికి, రెండువేల వరకు ఒక్కొక్క దానిని ప్రత్యేకించి ఒక్కొక్క ఛీఫ్ ఇంజనీర్ సర్కిల్ ఏర్పాట్లు చేయడంతోబాటు, అదనంగా చీఫ్ ఇంజనీరు పదవిని కూడా కల్పించినట్లు, మంత్రి తెలియ జేశారు.

కాగా విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల విషయం శ్రీశైలం జల విద్యుత్ కేంద్రం మొదటి యూనిట్ 1978 లో పని ప్రారంభించాలనే లక్ష్యంతో ప్రభుత్వం వున్నదని, మంత్రి శ్రీ జి. రాజారాం తమ శాఖ పద్దును ప్రతిపాదిస్తూ పేర్కొనడం జరిగింది.

విదేశీ సహాయం. కేంద్రం నుంచి అదనంగా సహాయం లభించినప్పుడు ఈ ప్రాజెక్టు వార్షిక వ్యయాన్ని పెంచి అనుకున్న లక్ష్యాన్ని సాధిస్తామనీ అటు తరువాత ఆరునెలల వ్యవధిలో మిగతా మూడు యూనిట్లు పని ప్రారంభిస్తాయని ఆశిస్తున్నట్లు, శ్రీ రాజరాం వెల్లడించారు.

ఈ పద్దులపై జరిగిన చర్చలలో పాల్గొన్న పలువురు సభ్యులు, రాయలసీమ అవసరాలు తీర్చే విధంగా కృష్ణా జలాల వినియోగించడానికి శ్రీశైలం ప్రాజెక్టును బహుళార్థసాధకంగా చేపట్టాలని కోరారు.

రాష్ట్రంలో ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో వైద్య సదుపాయాలు యితోధికంగా కల్పించాలన్న ధ్యేయంతో ప్రభుత్వం కృషి చేస్తున్నదని, ఆరోగ్య, వైద్య శాఖా మంత్రి శ్రీ కోదాటి రాజమల్లు తమ శాఖకు సంబంధించిన పద్దులపై జరిగిన చర్చకు సమాధానంగా చెప్పారు.

వైద్య విద్యకు సంబంధించిన ప్రభుత్వ విధానాన్ని శ్రీ రాజమల్లు వివరిస్తూ గ్రామీణ అవసరాలకు అనుగుణంగా వుండే విధంగా సాంఘిక శాస్త్రం, పౌష్టికాహారం, కుటుంబనియంత్రణ, సమాజాభివృద్ధి లాంటి కార్యక్రమాలను కొత్తగా సిలబసులో చేర్చడానికి వీలుగా అండర్ గ్రాడ్యుయేట్ ప్రణాళిక సిలబసును మార్చాలని విశ్వవిద్యాలయాలను కోరడం జరుగుతున్నదని, మంత్రి

తెలియజేశారు. ఆరోగ్య వైద్య శాఖలకు గాను రు. 66.63 కోట్లు కేటాయించబడినాయి.

సన్నకారు, మధ్య తరగతి రైతులకు, 1976-77 లో సహకార రంగంలో యితోధికంగా రుణ సౌకర్యం కల్పించబడుతుంది. ఈ విషయాన్ని సహకార శాఖ పద్దులను ప్రతిపాదిస్తూ, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు తెలియజేశారు.

ప్రాజెక్టు ప్రాంతాలలోని అభివృద్ధి లక్ష్యాన్ని, పెరుగుతున్న అవసరాలను దృష్టిలో పెట్టుకొని, 1976-77 సంవత్సరం లో రూ. 26 కోట్లు రూపాయల మేరకు రుణాలిచ్చే కార్యక్రమాన్ని సహకార శాఖ రూపొందించిందని ఆయన తెలియజేశారు.

ఇరవై సూత్రాల ఆర్థిక కార్యక్రమంలో ఒక అంశంగా, దాదాపు నాలుగు లక్షల ఎకరాలకు ప్రయోజనం చేకూరగల 75 వేల బావుల త్రవ్వకానికి, 19 వేల పంపు సెట్లను ఏర్పాటు చెయ్యడానికి, అయిదవ ప్రణాళికా కాలంలో 60 కోట్ల రూపాయల మేరకు వ్యవసాయదారుకు రుణాలను సమకూర్చడానికి కేంద్ర వ్యవసాయ అభివృద్ధి బ్యాంకు ఒక దీర్ఘ కాలిక కార్యక్రమాన్ని రూపొందించిందని కూడా ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలోని కొల్లేరు సరస్సు ప్రాంతంలోని 7100 మంది కుస్తివారికి ప్రయోజనం అభివృద్ధికి, రు. 205.90 లక్షల మేరకు దీర్ఘకాలిక రుణాలను యివ్వడానికి నిశ్చయించబడింది. ఇందులో సగం డబ్బుకు ప్రభుత్వం హామీ వుంటుంది.

అదే విధంగా, వ్యవసాయోత్పత్తులను పెంచడానికి రైతులను ప్రోత్సహించే నిమిత్తం 1976-77 లో రు. 100 కోట్ల మొత్తాన్ని సల్ప కాలిక రుణాలుగా లభ్యం చెయ్యడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ విషయాన్ని వ్యవసాయ శాఖ మంత్రి శ్రీ చొక్కారావు తమ శాఖ పద్దులను ప్రతిపాదిస్తూ వివరించారు. ఈ రుణాలను సహకార కేంద్ర బ్యాంకు ద్వారా పంపిణీ చేయడం జరుగుతుంది.

రాష్ట్ర వార్షిక బడ్జెటులో అత్యధిక భాగం సుమారు నాలుగవ వంతు—విద్యాశాఖకు కేటాయించబడుతుంది. ఈ శాఖ పద్దులపై రెండు రోజులపాటు చర్చ జరిగింది. చర్చకు సమాధానమిచ్చిన విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు ప్రస్తుత అవసరాలకు, రాజ్యాంగ లక్ష్యాలకు అనుగుణంగా పాఠ్య ప్రణాళికను చక్క దిద్దవలసిన విషయంతో సహా విద్యావిధానాన్ని పునర్వ్యవస్థీకరించే అంశాన్ని పరిశీలించడానికి గాను ఒక కమీషన్‌ను నియమించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదని వెల్లడించారు.

బడ్జెటు సమావేశంలో 20 కు పైగా బిల్లులు ఆమోదింపబడినాయి. విద్యామంత్రి ప్రవేశ పెట్టిన సమగ్ర విద్యా సంస్కరణల బిల్లు జాయింటు సెలెక్టు కమీటికి పంపబడింది. ఈ బిల్లులోని ప్రధాన లక్ష్యాలు ఏవంటే రాష్ట్రంలో అమలులో వున్న విద్యా విధానాన్ని సంస్కరించి, వ్యవస్థీకరించి, అభివృద్ధి చేయుట దాని నిమిత్తం అందుకు సంబంధించిన శాసనాలను ఏకీకృతము చేసి సవరించుట, సాధారణంగా ప్రజాశ్రేయస్సు దృష్ట్యాను, ప్రత్యేకించి విద్యార్థుల శ్రేయస్సు దృష్ట్యానూ రాష్ట్రంలోని ప్రయివేటు విద్యా సంస్థలను క్రమబద్ధం చేయుటను, నియంత్రణ చేయుటకు యీ బిల్లు వుద్దేశింపబడింది.

ఈ బిల్లు కొఠారి కమీషన్ చేసిన సిఫార్సులననుసరించి, రాష్ట్రస్థాయి విద్యాసదస్సు చేసిన సూచనలను ఆధారంగా చేసుకొని రూపొందించబడింది.

గ్రామ పంచాయతీలు, పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల సవరణ బిల్లులపై జాయింటు సెలెక్టు కమిటీ రిపోర్టును పంచాయతీ రాజ్ శాఖ మంత్రి శ్రీ లుకలాపు లక్ష్మణదాసు సన సభకు నివేదించారు. పంచాయతీ రాజ్య వ్యవస్థలను ఎన్నికల పద్ధతి లోను ఎన్ని మార్పులు ప్రవేశ పెట్టడానికి యీ బిల్లు తేబడింది. అయితే జిల్లా పరిషత్తు అధ్యక్షుల ఎన్నికల పద్ధతి, సవరించబడిన బిల్లులో సూచింపబడి నట్లు కాకుండా యిప్పటిప్రకారం కొనసాగాలని జాయింట్ సెలెక్టు కమిటీ అభిప్రాయపడటంతో, అందుకు సంబంధించిన సవరణ సెలెక్టు కమిటీలో ప్రభుత్వం వారిచే ఉపసంహరింపబడింది. కాగా సర్పంచ్ సమితి అధ్యక్షుల ఎన్నికలు మాత్రం ప్రత్యక్ష్యంగానే జరుగుతాయి.

ఈ సవరణ బిల్లులో శాసన సభ జూన్ సమావేశంలో చర్చ జరుపుతుందని, మంత్రి ప్రకటించారు.

శాసనసభలు ఆమోదించిన కొన్ని బిల్లుల్లో ప్రధానమైనవి రెంటిని పేర్కొనవచ్చును. ఇంతవరకు డెల్టా ప్రాంతాలలోనే మురుగునీటి పారుదల సౌకర్యాల ఏర్పాటు కోసం డ్రయినేజి సెస్సు విధించబడుతున్నది. మొన్న ఆమోదింపబడిన బిల్లు ప్రకారం డెల్టా కాని అన్ని ప్రాంతాలలోగల అన్ని భూములపై మురుగు పారుదల సెస్సు విధించి వసూలు చేయడానికి ప్రభుత్వానికి అధికారమివ్వబడింది.

సభవారు ఆమోదించిన మరొక బిల్లు ప్రకారం, రాష్ట్రంలో నీటి పారుదల ప్రాజెక్టుల క్రిందవున్న కొన్ని భూములమీద ప్రత్యేక భూమి పన్ను విధించి, వసూలు చేయడానికి ప్రభుత్వానికి అధికార మివ్వబడుతుంది. ఇంతకుముందు అమలులో వున్న అడ్వాన్సు, అభివృద్ధి విరాళము విధింపు చట్టం రద్దుచేయబడుతుంది. కాగా పాత చట్టం క్రింద వసూలు చేయబడిన లేదా అడ్వాన్సు విరాళము, కొత్త చట్టం ప్రకారంప్రత్యేక భూమి పన్నుగా చెల్లించవలసిన మొత్తం క్రింద సర్దుబాటు చేయబడుతుంది.

# కళలు పండిన కామోల్

ఆదిలాబాదు జిల్లా ముధోలు తాలుకాకు చెందిన ఒక చిన్న గ్రామ పంచాయతీ కామోల్. ఆ గ్రామములోని సగానికి మించిన భూమిలో అధిక దిగుబడి వంగడాలు వాడబడుతున్నవి. వాడుకలో వున్న వంగడాలు హెచ్–4 ప్రత్తి, హైబ్రిడ్ జొన్న, రత్న, జయ మరియు ప్రొద్దు తిరుగుడు పువ్వు, మిగిలిన భూములలో మిర్చి, జొన్న, ప్రత్తి, నూనె గింజలు, గోధుమ మరియు కంది మొదలగు స్థానిక విత్తనములు వాడుచున్నారు. అధికోత్పత్తిని సాధించుటకై స్వాభావిక ఎరువును మొత్తము సాగుభూమిలో వేయుచున్నారు. పంచాయతీలోని అన్ని గ్రామాలలో అధికోత్పత్తిని సాధించుటకై ఆధునిక వ్యవసాయ పద్ధతులు అవలంబించబడుతున్నవి. రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక మందులు వాడబడుచున్నవి. రైతులకు వ్యవసాయ, విద్యావిషయ పరిజ్ఞానము అందజేయుటకు ఒక కమిటీ ఏర్పాటుచేయబడినది. రైతులు ఎప్పటికప్పుడు పంచాయతీ కార్యాలయములోని రేడియోద్వారానూ, సమాచార శాఖవారి కరపత్రములద్వారానూ, ఆధునిక వ్యవసాయ పరిజ్ఞానము పొందుతున్నారు. అట్టి పరిజ్ఞానము మొత్తము రైతు కుటుంబాలకు అందజేయబడినది. విత్తన శుద్ధి పరికరములు, పీడర్లు, డస్టర్లు ఇనుప నాగళ్ళు వగైరా వాడుకలోనున్నవి. అట్టి పరికరములను గ్రామ పంచాయతీ ఉచితముగా బీదరైతులకు వాడుకొనుటకు ఇస్తున్నది. ప్రతి కుటుంబము ఎరువు గుంటలను త్రవ్వి కంపోస్టు తయారుచేయుట ద్వారా 800 నుండి 900 టన్నులవరకు ప్రతి సంవత్సరము ఎరువును తయారు చేసుకొంటున్నది. కంపోస్టు ఉద్యమములో గ్రామ పంచాయతీ స్వయముగా పాల్గొనుచున్నది. వరి పైరు సాగుబడిలో సగము జపాను పద్ధతిపై సాగుచేయబడుతున్నది.

భూమి లేని హరిజనులకు 200 ఎకరముల ప్రభుత్వ భూమిని యిప్పించి సాగుచేయించుటవలన పంచాయితీలోని సాగుబడి భూమి పెరుగుటకు దోహదకారి అయినది. గ్రామములోని రోడ్లు, మురుగు కాలువలు శుభ్రపరుపబడుచున్నవి. అన్ని యిండ్లకు ఏటా ఒకటి లేక రెండుసార్లు సున్నము వేసుకొనునట్లుగా ప్రోత్సహించుటద్వారా యిండ్లు పరిశుభ్రముగా ఉంచబడుతున్నవి. జాతీయ ఉత్సవ దినములలో పారిశుధ్యపు ఉద్యమములు నిర్వహింపబడుతున్నవి. బలహీన వర్గాల సంక్షేమముకొరకు గ్రామ పంచాయతీ ప్రత్యేక శ్రద్ధవహించుచున్నది. గత 17 సంవత్సరముల నుండి అంటరానితనమును పాటించుట లేదు. హరిజనవాడకుకూడా వీధి దీపములు, మంచినీటి వసతి, సామాజిక కేంద్రము ఏర్పాటు చేయబడినవి. ఈ పంచాయతీయందలి హరిజనులందరూ తమ తమ కులవృత్తులను వీడకుండా అవలంబించుచున్నారు.

మహిళా సంక్షేమం నిమిత్తం ఒక మహిళా మండలి ఏర్పాటు చేయించబడి పంచాయతీలోని గృహవసతివారి గ్రంథాలయముకొరకు కేటాయింపబడినది. మహిళలు 'బ్రతుకమ్మ' మరియు 'ఏకాదశి' పండుగ దినములలో సాంస్కృతిక కార్యక్రమములు ఏర్పాటు చేయుచున్నారు.

'కామోల్' గ్రామ పంచాయితీ 73–74 ఆర్థిక సంవత్సరములో పన్నులు నూటికి నూరు పాళ్ళు వసూలు చేయగలిగింది. ఇదే పంచాయితీ 72–73 లో 80 శాతము పన్నులు మాత్రమే వసూలు చేయగలిగినది. 1971–72 సంవత్సరములో 100 ఆస్థి విలువపైగల 25 పైసల పన్నును ఐచ్ఛికముగా 50 పైసలకు పెంచనైనది. గ్రామ పంచాయితీ ఆదాయం 17 శాతము పెరిగినది.

గ్రామ పంచాయితీ, విద్యుచ్ఛక్తి మొదలగు సౌకర్యములు గల తమ స్వంత కార్యాలయ భవనమును కలిగియున్నది. గ్రామ పంచాయతీ స్థాపింపబడిననాటినుండి అనగా 1959–60 నుండి శ్రీ వినాయక్‌రావుగారు వరుసగా సర్పంచ్ బాధ్యతలు నిర్వహించుచున్నారు. 1964 మరియు 1970 సంవత్సరములలో జరిగిన ఎన్నికలలోనూ వారు ఏకగ్రీవముగా ఎన్నికైరి. అట్టి ఎన్నిక వారు గ్రామమునకు చేసిన సేవను వ్యక్తము చేయుచున్నది. వారి హయాములో ప్రాథమిక పాఠశాల, మాధ్యమిక పాఠశాలా స్థాయిని అందుకున్నది. మధ్యాహ్నపు భోజనవాటా ధనము ప్రతి సంవత్సరమును తప్పనిసరిగా అనువగు కాలములో పాఠశాలకు అందజేయబడుచున్నది. ఎట్టి ఫిర్యాదు లేకుండా చౌక దుకాణముద్వారా పంచాయతీ ప్రజలందరకు నిత్యావసర వస్తువులు సరఫరా చేయబడుచున్నవి. ప్రథమ చికిత్సకొరకు మందులు సప్లై చేయించి రోగ నివారణ సౌకర్యము కల్పించుచున్నది.

గ్రామ పంచాయతీ తమ స్వల్ప నిధులతోనే అభివృద్ధి కార్యక్రమములను చేపట్టుచున్నది. పై లక్షణములన్నియు యీ గ్రామ పంచాయితీ, 1973–74 సంవత్సరమునకు ముధోల్ తాలూకాలో అత్యుత్తమ గ్రామ పంచాయితీగా నిర్ణయించుటకు తోడ్పడినవి. అట్టి ఫలితము 74–75 సంవత్సరములో ప్రకటింపబడినది. ఇది యితర పంచాయితీల అభివృద్ధిని ప్రోత్సహించింది. ఈ విధముగా 'కామోల్' గ్రామ పంచాయితీ జ్ఞానవ్యాప్తి కేంద్రముగా రూపొంది కళలతో విలసిల్లుచున్నది.

# ఆదిలాబాదు జిల్లా హరిజన మహాసభ

—శ్రీ డి. వి. గోపాలరావు

'ఈశావాస్యమిదం సర్వం' అని వల్లించే మన దేశంలోనే మనుష్యులంతా ఒకటే అను నమ్మకం లేక పోవడం వల్లనే 20వ శతాబ్దములో కూడా హరిజన సమస్య అపరిష్కృతంగా ఉండి పోయింది. భారత సమాజ వృక్షానికి వేరుపురుగైన అస్పృశ్యతా దురాచారాన్ని నిర్మూలించలేకపోయింది.

గాంధీజీ, డా. అంబేడ్కర్ వంటి మేధావులు సమాజాన్ని జాగృతం చేసి యీ కళంకానికి సిగ్గుపడునట్లు చేసినారు. భారత రాజ్యాంగ చట్టము ఏర్పరచుకున్న తరువాత యీ దురాచారానికి నీడ లేకుండాపోయింది. అత్యధిక సంఖ్యలో ఉన్న వెనుకబడిన జాతులవారి అభ్యుదయాన్ని సాధించగలిగిన నాడే మన దేశానికి నిజమైన ప్రగతి. స్వాతంత్ర్యము వచ్చినప్పటినుండి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనేక రంగాలలో కృషిచేస్తు ఉన్నాయి. యీ సమస్య జటిలము కావడంవల్ల ఎంత చేసినా యింకా ఎంతో చేయ వలసినది మిగిలియున్నది.

ఈ విషయాలన్నింటికి పరిష్కార మార్గాలు ఆలోచించుటకై మన రాష్ట్ర ప్రభుత్వము జిల్లా స్థాయి మరియు రాష్ట్ర స్థాయిలో హరిజన మహా సభలు జరుపుటకై నిశ్చయించినది. అట్టి నిర్ణయ పర్యవసానమే ఆదిలాబాద్‌లో జరిగిన మహాసభలు.

ఈ సందర్భములో హరిజన సంక్షేమము కొరకు ఆదిలాబాదు జిల్లాలో జరిగిన కృషి వివరణ యిది.

ఈ జిల్లాలో 1971 జనాభా లెక్కల ప్రకారము 12 లక్షల 86 వేల 970 లో 2,24,634 మంది హరిజనులు ఉన్నారు.

## విద్యాసౌకర్యాలు

ప్రభుత్వ వసతి గృహాలు—984 మంది విద్యార్థులతో జిల్లాలో మొత్తము 21 వసతి గృహాలు, 60 మంది విద్యార్థినులతో 2 వసతి గృహాలు నడుపబడుతున్నవి. యీ వసతి గృహములలో ఉచిత భోజన మరియు వసతి ఏర్పాట్లు కలిగించబడినవి. యివి 75% హరిజనుల కొరకు కేటాయించబడినవి. 1975-76 సం॥లో 6,71,630 రూ. వసతి గృహములు నడుపుటకై కేటాయింపబడినవి. దీనిలో 4,71, 135 రూ. విద్యార్థులకు దగ్గరలో అందు బాటుకై ఆయా ప్రాంత మందలి అధికారులకు బదిలీచేయ బడినవి. పై మొత్తము కాక అదనముగా మున్సిపల్ ప్రాంతములలో గల విద్యార్థుల కొరకు ఉద్దేశించబడిన వసతి గ్రహములపై రు. 71,244 వినియోగించబడినవి.

వసతి గృహేతర విద్యార్థులకు ఉపకార వేతనములు :—10వ తరగతిలోపు విద్యార్థులకు ఉపకార వేతనములు యిచ్చుటకై 1975-76 లో 80, 000 రూ. విడుదల చేయబడినవి. దీనికితోడు గత సంవత్సరపు నిల్వ అయిన రూ. 50,000 లు కూడా ఖర్చు చేయుటకై ఉన్నది. పై మొత్తము నుండి 1515 విద్యార్థులకు రూ. 71,520 లు వినియోగించబడినవి.

కేంద్ర ప్రభుత్వ ఉపకార వేతనములు:—వసతి గృహములలో ఉండు కాలేజీ మొదటి సం॥పు విద్యార్థులకు నెల ఒక్కంటికి రూ. 70/- లు, 2 వ సం॥పు విద్యార్థులకు నెలకు 75/ లు ట్యూషను ఫీజు మరియు యితర ఫీజుల క్రింద మంజూరు చేయ బడును. పై మొత్తము కాక ప్రతి విద్యార్థికి సాలుకు రూ. 180/- చొ॥ అద్దె, నీరు, విద్యుత్తు వగైరా ఖర్చులకు గాను యివ్వబడును. వసతి గృహములలో నుండు విద్యార్థినులకు యిచ్చు ఉపకార వేతనము వలెనే కాలేజీలకు పోవు విద్యార్థులకై నిర్వహింపబడు వసతి గృహములలోని విద్యార్థులకు కూడా యీ ఉపకార వేతనములు మంజూరు చేయబడును.

ఆదిలాబాదు, నిర్మల్, భంసా, మంచిర్యాల మరియు కాగజ్ నగరులలో మొత్తము 152 మంది విద్యార్థుల సంఖ్యతో కాలేజీ విద్యార్థులచే వసతి గృహములు నిర్వహింపబడుచున్నవి.

డే-స్కాలర్స్:—కాలేజీలలో చదువు మొదటి సంవత్సరము వారికి నెలకు రూ 40/-ల చొ॥ మరియు వారు కట్టవలసిన ఫీజులున్నూ, రెండవ సంవత్సరం విద్యార్థులకు నెలకు రూ. 45/-లు మరియు వారు కట్టవలసిన ఫీజులున్నూ మంజూరు చేయబడును.

యీ పని నిమిత్తము 5,50,000/- రూ.లు విడుదల చేయబడినవి. యీ మొత్తము నుండి 1,38,330/-లు వినియోగింప బడినవి. దీనికితోడు 94 గురు విద్యార్థులకు డే-స్కాలర్స్ క్రింద రూ. 52,301/-లు వినియోగింపబడినవి.

జిల్లా కార్యాలయములో మంజూరీ నిమిత్తము దరఖాస్తు లేవియూ మిగిలి లేవు.

ఐ.టి.ఐ. మంచిర్యాల నాన్-రెసిడెన్షియల్ స్కాలర్‌షిప్స్ (1) :—యీ సంత్సరము విద్యార్థి ఒక్కొక్కరికి నెలకు రూ. 45ల చొ॥ రూ. 7,000 లు విడుదల చేయబడినవి. దీని నుండి 7 గురు విద్యార్థులకు రూ. 6,532/-లు వినియోగింపబడినవి.

జాతీయ పాఠ్య గ్రంథములు:— 1975-76 సం॥లో 1,647 గురు (1 నుండి 10 తరగతుల వరకు గల) విద్యార్థులకు రూ. 12,802/-లు విలువగల 8000 పాఠ్య గ్రంథములు ఉచితముగా సరఫరా చేయబడినవి.

ఉచిత బట్టల సౌకర్యము:— వసతి గృహములలో నివసించు విద్యార్థులకు ఒక్కొక్కరికి సాలుకు రూ. 25/-లకు మించకుండా

బట్టలు ఉచితముగా సరఫరా చేయబడుచున్నవి. యీ పని నిమిత్తము రూ. 21,000. 1975.76 సం॥ లో విడుదలచేయబడినవి. దీనివలన 740 విద్యార్థులకు లాభం కలిగినది. యిందు నిమిత్తము ఖర్చు చేయబడిన మొత్తము రూ. 18,5000 లు.

అంటరానితనము:— యీ విషయముపై జిల్లా పోలీసుసూపరింటెండెంటు గారిని ఎన్ని కేసులు నమోదు చేయబడినవో తెలుపవలసినదిగా కోరినారు. యింతవరకు ఎట్టికేసులూ నమోదు అయినట్టుగా తెలుపబడలేదు.

## ప్రోత్సాహక బహుమతులు

కులాంతర వివాహములు చేసుకున్న దంపతులకు బహుమతులు యిచ్చుటకై రూ. 20,000 యీ సంవత్సరము విడుదల చేశారు. మండలాధికారులను అట్టి కేసులను తెలియపర్చవలసినదిగా కోరారు. యింతవరకు ఒక దంపతులకు రూ. 1,000 లు బహుమతిగా యిచ్చారు. అవసరమగు ధృవపత్రములు సేకరింపబడుచున్నవి. అట్టివి సేకరించిన వెంటనే మిగిలిన యిద్దరు దంపతులకు కూడా యి బహుమతులు మంజూరు చేయబడును.

అత్యాచారములు:— హరిజనులపై అత్యాచారములు గావింపబడిన 3కేసులు ప్రభుత్వదృష్టికి తేబడినవి. జిల్లాపోలీసు సూపరింటెండెంటుగారు యీ విషయములో తగు చర్య తీసుకొనుచున్నారు.

ఉద్యోగములలో కేటాయింపు:— యితర ప్రభుత్వ శాఖాధికారులను ఉద్యోగముల కేటాయింపు విషయములో ప్రభుత్వాదేశములను పాటించవలసినదిగా కోరడమైనది.

బలహీన వర్గాల జిల్లాస్థాయి కమిటీ,జిల్లా కలెక్టరు గారి అధ్యక్షతన వీరి సంక్షేమ కార్యముల అభివృద్ధిని సమీక్షించుచున్నది

## భూమి లేని కూలీలకు భూమి పంపిణీ

కేంద్ర ప్రభుత్వము 1973.74 సంవత్సరములో రూ.90,3700 యీ పద్దు క్రింద ఆదిలాబాదు జిల్లాలో వినియోగించుటకు ఆమోదించింది. ఇందులో 25% ప్రథమ వాయిదాగా భూమిని కొనుటకు దానిని అభివృద్ధి పరచుటకుగాను రూ. 22,59,230లు విడుదల చేసినది. ఈ ధనము 1973-74 సంవత్సరాఖరులో హౌసింగు సొసైటీ ఖాతాకు జమచేయబడినది

ఈ స్కీము 1974 మే నెలలో ప్రారంభింపబడి ముందుగా ఆదిలాబాదు ఖానాపూరు మరియు చెన్నూరు బ్లాకులలో అమలు పరుపబడిన తరువాత మొత్తము ఆదిలాబాదు జిల్లాకు వ్యాపింపచేయబడింది. ప్రారంభము నుండి 29-2-1976 వరకు 8,911 పట్టా సర్టిఫికేట్లు పంచిపెట్టబడినవి. లాభము పొందిన వారిలో సగానికి పైగా హరిజనులు కలరు. రూ. 1,47,371 భూఅభివృద్ధి క్రింద, రూ. 295,365 భూమి ధర క్రింద వినియోగింపబడినది. ఈ విధముగా రూ 4,4,736 పై రెండు స్కీములకు గాను ఖర్చుచేయబడినది.

130 కేసులలో డ్రాఫ్టు నోటిఫికేషన్లు, 126 కేసులలో డ్రాఫ్టు డిక్లరేషన్లు ఆమోదించబడినవి. యీ విధముగా ఇంకా ఎక్కువ కేసులు వచ్చే అవకాశమున్నది.

## షెడ్యూల్డు కులాల వారికి భూమి పంపిణీ

1975-76 సం. రూ. 2,40,000 విడుదలచేయబడినది. ఇందులో రూ. 99,170 హరిజనుల ఇండ్ల స్థలముల కొరకు రూ. 6,095 ఆదివాసుల ఇండ్ల స్థలముల కొరకు వినియోగింపబడినది. 29-2-76 వరకు మొత్తము 2,659 ఇండ్ల స్థలముల. పట్టా సర్టిఫికేట్లు ఆదిలాబాదు జిల్లాలో పంచబడినవి.

---

# హైదరాబాదు జిల్లా

(14 వ పేజీ నుండి)

పశు ప్రదర్శనలోని ఉత్తమ పశుపోషకులకు బహుమతులు ఇచ్చారు. జిల్లా ఉపవైద్య అధికారి శ్రీ అహమద్ మొహియుద్దీన్ శిశు ప్రదర్శనలో ఎంపికైనవారికి బహుమతులను పంచియిచ్చారు.

జాతర ముగింపు కార్యక్రమంలో పాల్గొన్న వ్యవసాయశాఖామాత్యులు శ్రీ జె. చొక్కారావు ప్రదర్శన ఏర్పాటుచేసిన వివిధ డిపార్టుమెంటులకు ప్రశంసా పత్రాలను అందజేశారు. పాల ఉత్పత్తి సంస్థ (Dairy Development Corporation) కు మొదటి బహుమతి, వ్యవసాయశాఖకు రెండవ బహుమతి, అటవీ శాఖకు మూడవ బహుమతి చొప్పున అమాత్యులు ప్రదానం చేయుటతో వారం రోజులపాటు దిగ్విజయంగా జరిగిన కీసరగుట్ట మహాశివరాత్రి జాతర ముగిసింది.

# శ్రీకాకుళం జిల్లాలో హరిజనోద్ధరణ

—శ్రీ దేవరపల్లి కేశవరావు

మన రాష్ట్రంలో ఈ జిల్లా ఒకవిధముగా చూస్తే మొట్ట మొదటిది మరోవిధంగా చూస్తే చిట్టచివరిది. మా జిల్లా జనాభా 26 లక్షలలోను దాదాపు రెండు లక్షల నలుబది వేలమంది హరిజనులున్నారు. మొత్తం జనాభాలో వీరు దాదాపు 10 శాతం. వీరిలో ఎక్కువ మంది పాతపట్నము, పాలకొండ, బొబ్బిలి, చీపురుపల్లి తాలూకాలలో స్థిరపడ్డారు. మిగతా 7 తాలూకాలలోను హరిజన జనాభా యింత లేదు.

ఈ హరిజనులతోపాటు మా జిల్లాలో రెండు లక్షల పన్నెండు వేల మంది గిరిజనులు కూడా ఉన్నారు. జాతివేరైనా నివసించే ప్రదేశాలలో తేడాఉన్నా, మాట్లాడే భాష ఒకటి కాకపోయినా, సాంఘిక, ఆర్థిక పరిస్థితులలో ఈ రెండు జాతులు అధోగతిలోనేవున్నవి కాబట్టి ఈ గిరిజన సమస్యలను కూడా దృష్టిలో వుంచుకొని అన్ని విషయాలు సమగ్రంగా ఆలోచించి వారి సత్వర పురోభివృద్ధికి అనుకూలించే కార్యక్రమం రూపొందించాలి.

## మొదట మసలిన మానవుడు

ఈ పేదవారి సమస్యలు పలురకాలు—ఈ సమస్యలను దృష్టిలో వుంచుకొని, మన రాజ్యాంగ రచయితలు ఎన్నో రక్షణలను ఏర్పాటు చేశారు. వారి అభివృద్ధికి అవకాశాలు కల్పించారు. మన రాష్ట్రంలో మొదట మసలిన మానవుడు హరిజనుడే. అందుకే ఆ కులానికి 'ఆది ఆంధ్ర' అనే పేరు ఈ నాటికి స్థిరపడి వుంది. అయితే కాలగమనమున దేశం నలుమూలల నుండి బలవంతమైన జాతులు వచ్చి ఈ ప్రాంతాన్ని ఆక్రమించుకొని అసలు జాతిని అణగద్రొక్కి వారిని బానిసలుగా పరిగణించి బండపనులు, పనికిరాని పనులు చేయడానికి వినియోగించి వారిని అంటరాని వారిగా వేరుచేసి దూరంగా ఉంచి వేశారు మన దేశాన్ని ఎందరో పరదేశస్థులు ఆక్రమించుకొని పరిపాలించారు. వారిలో బలవంతులైనవారు—'రవి అస్తమించని సామ్రాజ్యానికి అధిపతులు' రెండు వందల ఏండ్లపాటు నిరాటంకగా మనల్ని పరిపాలించిన ఆంగ్లేయుల్ని అహింసాయుతంగా ఓడించి, వైదొలగించిన 'బాపూజీ' మనకు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సంపాదించి యిప్పటికి 27 సంవత్సరము లయ్యింది. బ్రిటిష్ వారు వైదొలగక పూర్వమే వారి దీర్ఘపాలనా కాలంలో శిథిలమైపోయిన మన దేశ సాంఘిక, ఆర్థిక వ్యవస్థను ఏ విధంగా పునర్నిర్మాణము చేయాలో వారు ప్రయోగాలు చేసి పద్ధతులు సూచించారు. ఆనాటి వరకు మాల, మాదిగ, చండాల, చర్మకార మొదలగు పేర్లతో నీచంగా పిలువబడే ఈ జాతులకు 'హరిజనులు' అనే ఆప్యాయమైన, ఆదరమైన నామకరణం చేసి వారి పురోభివృద్ధికి పథకాలు ప్రారంభించారు. మనిషి మనిషికీ మధ్య విభేదాలున్నంత వరకూ వివిధ జాతులుగా భారతీయులను విడదీసి వారి కలయికకు వీలులేని అడ్డుగోడలు సృష్టించిన మతాధిపతుల్ని, సాంఘిక దురాచారపరుల్ని సంస్కరించి భారతీయులందర్నీ ఒకే జాతిగా ఏకంచేసి బృహత్తరమైన ఒకే జాతిని సృష్టించి ప్రపంచంలో అన్ని దేశాలకు మించిన ఉన్నతమైన దేశంగా మనదేశాన్ని అభివృద్ధిపరచడానికి ఆయన ఎంతో ప్రయత్నం చేశారు. వాటిలో ముఖ్యమైనది 'కులాంతర వివాహాలు'. ఆ తరువాతది 'కుటీర పరిశ్రమల ద్వారా వ్యక్తుల ఆర్థిక పరిస్థితిని బాగు పరచడం,' మూడవది 'అహింసావిధాన మద్వారా జాతుల సమైక్యతకు భంగం వాటిల్లకుండా కాపాడటం'.

ఈ మూడు కార్యక్రమాలు నిర్విఘ్నంగా కొనసాగితే మన దేశానికి సంపూర్ణశాంతి సౌభాగ్యాలు ఏనాడో సమకూరేవి. గాంధీజీ మరణానంతరం ఈ కార్యక్రమాలను నామమాత్రంగా కొనసాగిస్తూ వచ్చామే కాని ఆ ఉద్దేశాలను దేశమంతటా విస్తరించడానికి కట్టుదిట్టమైన కార్యక్రమాలు లోపించడం వల్ల ఈనాటికీ హరిజన సమస్య అలాగే మిగిలి వుంది.

హరిజనులలో చదువురానివారు చాలా ఎక్కువ. ఆర్థిక యిబ్బందుల వల్ల వీరు పిల్లలను చిన్న తనమునుండీ పనులలో నియమించి తృణమో, పణమో ఆదాయము సంపాదించటానికి తాపత్రయపడ్డారే కాని ఆపిల్లలను బడికి పంపించి చదివించ లేకపోయారు. చదువు లేని చోట సంస్కారం లోపిస్తుంది. వీరి అజ్ఞానాన్ని అవకాశంగా తీసుకొని కొందరు స్వలాభపరులు, పరాన్నభుక్కులు, దేశద్రోహులు, వీరి శ్రమను తమ బాగుకై వినియోగించుకొని చెమటోడ్చిన వారు ఎన్నడూ బాగుపడటానికి వీలు లేని విధంగా వెట్టిచాకిరీలు, ఫాయిదాలు, భోగబంధాలు మున్నగు సంకెళ్ళు తగిలించి వుంచారు. ఈ పద్ధతుల నుండి సంపూర్ణవిముక్తి రానంతకాలం, యిటువంటి పద్ధతులు మళ్ళీ తలఎత్తకుండా చేయనంతకాలం ఈ జాతుల జీవితంలో వెలుగు కన్పించదు.

## చదువు సంధ్యలు

ఈ జాతి వారిలో భూవసతి కలవారు చాలా తక్కువ. ఆ ఉన్న భూమి కూడా ఎవ్వరికీ పనికిరాని నిస్సారవంతమైన గయాళి. ఎంతో మందికి ఇదికూడా లేక సంవత్సరము పొడుగునా కూలి కోసం ఎదురు చూడవలసి వస్తుంది. మన జిల్లాలో వ్యవసాయం ఎక్కువగా వర్షాధారము. వర్షాలు బాగున్న సంవత్సరాలలో కూడా తొలకరి నుండి మార్చిల వరకు అప్పుడప్పుడు కలిసి మొత్తము తొంభై రోజులు మాత్రమే పనివుంటుంది. ఇది కూడా అందరికీ దొరకదు. బలముగల వారికీ, భయభక్తులతో మెలిగే వారికీ, బానిసత్వం చేసేవారికీ యిది పరిమితమై వుంటుంది. అయితే ఈ తొంభై రోజుల పని పాట్లకు వచ్చే కూలి డబ్బులతో 365 రోజులు వారు జీవించవలసి

వుంటుంది. అమలులో వున్న కూలి విధానం అంత ఆదాయం సమకూర్చదు కాబట్టి వీరు ఈనాటికీ భార్యా పిల్లలతో పనులు వెతుకుతుంటూ వలస పోవలసి వస్తున్నది. ఎన్నో రోజులు పస్తులుండవలసి కూడా వస్తున్నది.

వీరినార్థికంగా బాగు జేయడానికి తలపెట్టిన కార్యక్రమాలెన్నో వున్నాయి ఇందులో పాడిపశువుల పెంపకం, గొఱెల పెంపకం, పందుల పెంపకం, కోళ్ళపెంపకం, వృత్తులలో శిక్షణ, చిన్న వ్యాపారం చేసుకొనే అవకాశం కల్పించటం రిణాలు సమకూర్చటం, పరిశ్రమలు ఏర్పరచటం, ప్రభుత్వ శాఖ ద్వారా జరిగే పనులను కంట్రాక్టు ద్వారా యిప్పించటం చెప్పుకో దగ్గవి. ప్రభుత్వ అధీనములోనున్న భూములను కూడా కొంతవరకు పంచి యివ్వడం జరిగింది కాని వీటన్నింటివల్లా హరిజనుల ఆర్థిక సమస్యఎంతవరకు తీరిందని సమగ్రంగా పరిశీలించినట్లయితే లాభించినవారి శాతం చాలాస్వల్పం.

2,40,000 హరిజన జనాభాలోను పనిచేతగాని పిల్లలు, పని చెయ్యలేని వృద్ధులు 50 000 వరకు వుంటారు. మిగిలిన వారిలో సుమారు 40 000 మందికి సంవత్సరం పొడుగునా ఏదో ఒక ఉపాధి ప్రస్తుతం వున్నదని మనం భావిస్తే యింకా 1,60,000 మందికి సంవత్సరములో 9 మాసాలు ఏ పనీ లేదు

## మూడువందల కోట్ల రూపాయల నష్టం

ప్రతివ్యక్తికీ రోజు కు రూ 3/- లు కూలి తెచ్చుకోగల శక్తి వుందనుకొంటే వీరికి పని లేక పోవడం వల్ల సంవత్సరానికి సుమారు 12 కోట్ల రూపాయలు వరకూ ఈ జిల్లాలో నష్టపోతున్నారని చెప్పకోక తప్పదు. అంటే ఈ 27 సంవత్సరములలోను కేవలం చాలినంత పని లేనందువల్ల మూడువందల కోట్ల రూపాయల విలువగల శ్రమను ఈ హరిజనులు కోల్పోయారని అంచనా వేయవచ్చు. ఈ పరిస్థితిని ముందే అరికట్టి వుంటే ఆర్థికంగా వారీ పాటికి మెరుగుపడి యితర వర్గాలతో సమానంగాను, లేక వారిని మించిన వారుగా అభివృద్ధిచెంది వుందురు.

మనము కార్చిన చెమటే మన ఆస్తికి మూలం. మనం దాచుకున్న శ్రమ మన దరిద్రానికి హేతువు. ఈ మూలసూత్రాన్ని గుర్తించి యిక ముందైనా వీరికి సంవత్సరము పొడుగునా ఉపాధి కల్పించే మార్గాలు ఆలోచించ వలసిన బాధ్యతమన అందరి మీదా వుంది. వ్యవసాయరంగంలో అందరికీ అవకాశం లేదు కాబట్టి పారిశ్రామిక రంగంలో మిగిలిన వారికి ఈ అవకాశాలను కల్పించాలి.

సంక్షేమ కార్యక్రమాలలో కూడా వీరికి తగినంత సహాయం దొరక లేదనే చెప్పాలి. గ్రామాలకు విద్యుచ్ఛక్తి వున్నప్పటికీ హరిజన వాడలలో వీధిదీపాలు లేని గ్రామాలు యింకా ఎన్నో వున్నాయి. మంచినీటి సౌకర్యం లేని హరిజనవాడలో, మురుగు కాలువలు లేని పేటలో, రోడ్లు, మరుగుదొడ్లు, బడులు, రేవుయోలు లేని వాడలో యింకా చాలా వున్నాయి. చాలీచాలని తిండితో యీ మురికి వాడలలో నివసిస్తున్న హరిజనులను గజ్జి, తామర, కలరా, మశూచి మొదలగు అంటువ్యాధులు పట్టుకొని విడిచి పెట్టడం లేదు. తిండికే డబ్బులేని వీరు డాక్టర్లకు, మందులకు డబ్బిచ్చుకో లేరు. వీరిని ఈ అంటురోగాల బారినుండి విముక్తి చేయడానికి ఒక సమగ్రమైన పథకాన్ని రూపొందించడం ఎంతైనా అవసరం.

సాంఘికంగా వీరు యితరులతో సమానులని చట్టరీత్యా వక్కాణించినా ఆచరణలో మాత్రము వారికి ఈనాటికీ ఈగౌరవం లభించడంలేదు. ఈ నిరాదరణ ఒక్క మానవ సమాజంలోనే కాకుండా దైవసన్నిధిలోకూడా అక్కడక్కడా యింకా వున్నట్లే కనబడుతున్నది దీనికి తోడు మద్యపానం, మూఢనమ్మకాలు వీరిని మరీ క్రుంగదీస్తున్నాయి.

మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ప్రసాదించిన 20 సూత్రాల ఆర్థిక ప్రణాళికలో, 7 సూత్రాలు ప్రత్యేకంగా ఈ పేద జనాన్ని ఉద్ధరించడానికి ఉద్దేశించబడినవే. ఈ కార్య్యక్రమాన్ని రాష్ట్రమంతటా సత్వరంగా అమలు పరచడానికి దీక్షవహించిన మన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారి ఆశయం సిద్ధించడానికి ఈ రంగంలో మనం ఎంతో కృషి చెయ్య వలసిఉంది

# తీర్థం గ్రామం

—శ్రీ పి. సూర్యప్రకాశ్

చిత్తూరు జిల్లా పలమనేరు సమితిలోని తీర్థం పంచాయతీ జనాభా 3,000 ఇచ్చట పంచాయతీకి స్వంత భవనం వుంది. పాఠశాల భవనం కూడా వుంది. "శ్రీమతి పి. కృష్ణవేణమ్మ ఉచిత ప్రాథమికోన్నత పాఠశాల" భవనమును ధర్మార్థముగా నిర్మించుచున్నారు. మహాత్మాగాంధీ జయంతి సందర్భముగా హరిజనులకు ఇండ్ల స్థలములను ఉచితముగా పంచాయతీవారు పంచినారు. గ్రామంలో 80 శాతం భూమిలో మేలురకం విత్తనం వేద్యం చేశారు. తీర్థం గ్రామం ఉత్తమ పంచాయతీగా ఎన్నికై రెండువందల రూపాయలను బహుమానంగా స్వీకరించినది. పంచాయతీరాజ్ రజతోత్సవములు జరుపుకొని 20 సూత్రాల ఆర్థిక పథకమును ప్రజలకు తెలియజేసినారు. ఈ గ్రామస్థులు 40 వేల రూపాయలు ఖర్చుచేసి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ జాతీయ సేవా పథకము ద్వారా విద్యార్థులు, గ్రామస్థులు, స్థానిక నేతాజీ యువక సంఘంవారు కలిసి రక్షిత మంచినీటి పథకాన్ని 3 రోజులలో పూర్తి చేసినారు. 100 ఇంటి కొళాయిల కనెక్షన్లు, 12 వీధి కొళాయిలు అమర్చి గ్రామమునకు సౌకర్యమును కలిగించుకొన్నారు. 19-11-1975వ తేదీ శ్రీమతి ఇందిరాగాంధీ పుట్టినరోజు పండుగ సందర్భంగా రక్షిత మంచినీటి పథకము శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ వైస్ ఛాన్స్‌లర్‌గారైన శ్రీ కె. సచ్చిదానందమూర్తిగారు ప్రారంభోత్సవము చేసినారు సమితి ప్రెసిడెంట్ శ్రీ రాధాక్రిష్ణన్ అధ్యక్షతన "అడ్వకేట్ శ్రీ కుప్పరాజు ద్వారా ప్రజలకు కోడిపుంజులను, కొబ్బరి చెట్లను గొఱెలను సబ్సిడీ క్రింద పంచినారు హరిజనులకు ఎద్దుల కొనుగోలుకు రుణాలు పంచినారు. డా॥ సుభహన్‌సింగ్‌చే పశువుల ప్రథమ చికిత్సా కేంద్రమును ప్రారంభం చేసినారు. మండలి వికాసాధికారిచే బాల్‌వాడి కేంద్రమును ప్రారంభం గావించిరి.



# కృష్ణాజిల్లా దశాబ్ద ప్రగతి

శ్రీ పిడపర్తి రామకృష్ణారావు

గత దశాబ్దంలో కృష్ణాజిల్లా ప్రగతి పథంలో ముందుకునడచి వ్యవసాయిక, పారిశ్రామిక తదితర రంగాలలో గణనీయమైన అభివృద్ధిని సాధించింది. ఇందుకు అధికార అనధికారుల అవిరళ కృషి, ఇతోధిక సహకారాలే మూలకారణము.

చరిత్రలో ఒక దశాబ్దం–అతి స్వల్పకాలం కావచ్చును గాని కృష్ణాజిల్లా ప్రగతికి ఆలంబనమైన ఈ కాలం స్వర్ణాక్షరాలలో లిఖింపదగినది. ఆంధ్రప్రదేశ్‌లో ధాన్యాగారంగా కృష్ణాజిల్లాకు గల విశిష్టస్థానాన్ని నిరూపించగలిగింది. ఈ కాలంలోనే మన పురోగమనానికే అవరోధాలుగా మిన్నువిరిగి మీదపడినట్లు పెనుతుపానుల విలయతాండవం, అతివృష్టి, అనావృష్టి తదితర ప్రకృతివైపరీత్యాలను ఎదుర్కొని కృష్ణాజిల్లా కార్మిక, కర్షక ప్రజల అవిరళకృషి ఫలితంగాను జిల్లా పరిషత్తు, జిల్లా పరిపాలనా యంత్రాంగం, పంచాయతీ సమితులు, పంచాయతీల యొక్క విజ్ఞత, విశిష్టసేవల ఫలితంగా సస్య, శ్వేత, అరుణ, నీలి విప్లవాలలో సాధించిన ఘన విజయాలు ప్రశంసనీయం.

అనాదిగా వ్యవసాయం ఒక వంశవృత్తిగాను, జీవిత విధానంగానే తప్ప శాస్త్రీయదృక్పథంలో, వ్యాపార దృక్కోణాన్ని అవలంబించే విధంగా ముందుకు సాగని కారణంవల్ల, వందలాది సంవత్సరాలనుండి వ్యవసాయ రంగంలో ఎట్టిమార్పులు రాలేదు. పంచభూతాల దయా దాక్షిణ్యాల మీదనే ఆధారపడటం, పురాతనపు పనిముట్లనే ఉపయోగించటంవల్ల పాశ్చాత్యదేశాలస్థాయికి వ్యవసాయోత్పత్తులను పెంచటం సాధ్యపడలేదు.

ఇటీవల కాలంలో నీటి తీరువ సదుపాయాలు పెంచడం ద్వారాను, ఎరువుల వినియోగం పదిరెట్లు పెరగటంవల్లా, సస్యరక్షణ చర్యలను తీవ్రతరం చేయటంవల్లా, ఆధునిక వ్యవసాయ పద్ధతులను, పనిముట్లను ప్రవేశపెట్టటంవల్లను, రబీపంట విస్తీర్ణం రెట్టింపుచేసి, వ్యాపార పంటల విస్తీర్ణం అత్యధిక స్థాయికి చేరడం వల్లా అధిక దిగుబడి వరివంగడాలను విస్తృత ప్రాతిపదికపై ప్రచారం చేసి వినియోగించటంవల్లనూ, జిల్లాలో వ్యావసాయ దిగుబడులు బాగా పెరిగినవి.

1961 లో 14.81 లక్షల ఎకరాలు సాగులో నుండగా ఈనాడు అది 17.5 లక్షల ఎకరాలకు పెరగటం సామాన్య విషయం కాదు రెండవ పంట విస్తీర్ణం 2.61 లక్షల ఎకరములనుండి 5·2 లక్షల ఎకరాలకు పెరిగింది, వరి విస్తీర్ణం సార్వాలో 7 48 లక్షల ఎకరములు దాళ్వాలో 2.17 లక్షల ఎకరాలకు విస్తరింప బడింది. ఒకనాడు 10 వేల ఎకరాలు మాత్రం వున్న చెరకు పంట ఈనాడు 3800 ఎకరములకు వ్యాపించింది. పంచదార ఉత్పత్తి 13.5 లక్షల టన్నుల స్థాయినందు కొన్నది, ప్రత్తిపంట 15 వేల ఎకారాలలోను, పొగాకు 40 వేల ఎకరాలలోను, మామిడి 70 వేల ఎకరాలలోను పండించబడుతున్నది.

జిల్లాలో 15 లక్షల టన్నులవరకు ఆహారధాన్యాలు, తదితర వ్యాపారపంటలు పండించి సస్యవిప్లవానికి పునాది వేయగలిగింది కృష్ణాజిల్లా. నీటి తీరులను ఆధునీకరించటానికి, నీటిని సకాలంలో అందించడానికి, దిగువసాగులకు అనువుగా కాలనిర్ణయపట్టిక ప్రకారం నీటిని విడుదల చేస్తున్నారు. ( Judicious water management scheme ) నిపుణుల ప్రత్యేక సలహా పథకం (Agricultural consultancy service scheme)ను ముదినేపల్లి, క్రొత్తపెన్ను గ్రామాలలో ప్రవేశపెట్టి ఈ రంగములో క్రొత్త మలుపును తీసుకువచ్చారు. దీనివల్ల రైతులకు అందుబాటులో ప్రతి గ్రామములోను ఒక వ్యవసాయ నిపుణుని సలహా సహాయాలు లభ్యమవుతాయి. అత్యధిక దిగుబడులు సాధించడానికి అవకాశం కలుగుతుంది.

## నిరవధికమైన నీటివనరులు

అనేక నీటిసాగు పథకాలను అమలుజరపటంద్వారా 10లక్షల ఎకరాల వరకూ సాగులోనికి తేగలుగుట ఈ దశాబ్దిలో ఇరిగేషన్ పథకాల క్రింద సాధించిన ఘన విజయం. దివిసీమలో వరదకట్టల నిర్మాణంవల్ల 64వేల ఎకరములలో పంటలు రక్షింపబడ్డాయి

మెట్ట తాలూకాల్లో 26 వేల ఎకరాలకు నీటి సరఫరాకు 14 మైనరు ఇరుగేషను పథకాలు నిర్వహింపబడ్డాయి. 170 చెరువులను వినియోగంలోకి తీసుకువచ్చి 65 వేల ఎకరాలు సాగులోనికి తేగలిగారు. పంపింగ్‌స్కీమ్ క్రింద 27 పథకాలు నిర్వహించి 32వేల ఎకరాలు సాగులోకి తెచ్చారు. (Emergency Agricultural Production Programme) అత్యవసర వ్యవసాయోత్పత్తి పథకం క్రింద రూ. 27.8 లక్షల ఖర్చుతో 10 వేల 8 వందల ఎకరములు సాగులోనికి తెచ్చారు 7 లక్షల రూపాయల వ్యయంతో నిర్వహించి 4000ల సాగులోనికి తెచ్చిన నల్లపూడి పంపింగ్‌స్కీమ్ చెప్పదగినది.

ఈ సంవత్సరంలో రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ వెంగళరావు గారిచే శంఖుస్థాపన చేయబడిన రూ. 47 39 లక్షల కొత్త కోన బ్లాకు పథకంద్వారా 10,300 ఎకరములలో ముంపు ప్రమాదం నివారించటమే గాక 7,780 ఎకరములు అదనంగా సాగులోకి

వస్తుంది. రెండవదైన పులిగడ్డ ఆక్విడక్టు విస్తరణ పథకానికి రూ 26 లక్షల ఖర్చు నిర్వహించి 8 వేల ఎకరాల సాగు అభివృద్ధికి వేల ఎకరములలో క్రొత్త సాగుకు అవకాశం కలిగింది. వీటివల దివిసీమ దివ్వెల సీమ కాగలదు.

ఇంకా అయిదు లిఫ్ట్ ఇరిగేషన్ పథకాలు మరి అయిదు మైనరు ఇరిగేషను పథకాలు రూ. 20 లక్షల ఖర్చుతో నిర్వహించి 4 600 ఎకరములు సాగులోకి తేవటానికి కృషి జరుగుతున్నది.

## మురుగు నీటి పథకాలు

ఒకటిన్నర దశాబ్దాలుగా పనిచేస్తున్నా కృష్ణాడెల్టా సాగులో మురుగు నీటి సమస్య కరుడు గట్టి పోయింది. కొంతకాలంగా ఈ సమస్య జాప్యం చేయటం వల్ల మురుగు నీటి వనర్లు మృగ్యమయి పోయినవి. మిత్రా కమిటీ వారు చేసిన సిఫార్సుల ఫలితంగా ఈ సమస్య పరిష్కారానికి క్రొత్త అధ్యాయం ప్రారంభమయింది. ఇటీవల సుమారు రూ. 5 కోట్ల ఖర్చుతో 23 పథకాలను అమలు జరిపారు. మురుగు కాల్వల విస్తరణ మూలంగా అనేక పాత వంతెనలనుకూల్చి వేసి క్రొత్త వంతెనలు కట్ట వలసి వచ్చింది ఇప్పటికే రు 50 లక్షల ఖర్చుతో 114 వంతెనలు నిర్మించారు. ఇంకా రూ 28 లక్షల ఖర్చుతో 35 వంతెనల నిర్మాణం జరుగుతున్నది. ఈ సంవత్సరంలో జిల్లాడై 9నేజి బోర్డువారు రూ. 19 51 లక్షలతో 31 వంతెనల నిర్మాణానికి నిర్ణయించారు.

ఈ పథకాలు నిర్వహించిన ఫలితంగా 7.27 లక్షల ఎకరాల పంట భూమిని ముంపు నుండి రక్షించి 17 లక్షల బస్తాల అదనపు పంటను సాధించి 0 కోట్ల రూపాయలు అదనంగా సంపాదించ టానికి రైతాంగానికి ఎక్కువ చేయూత నిచ్చింది.

## శ్వేత విప్లవం : పశు సంక్షేమం

1964 సంవత్సరములో విస్తృత పశుగణా భివృద్ధి పథకం (I. C. D. B) ఏర్పాటు చేసి జిల్లాలో మేలురకం జాతులైన ముర్రా, జర్సీ, హాల్ స్టీన్ తదితర సంతతులు అభివృద్ధి చేసి శ్వేత విప్లవానికి నాంది పలికి ది. కృష్ణా జిల్లా రెండవ పంజాబుగా పేరు పొందింది. ఎక్కడ చూచినా ముర్రా జాతి గేదెలే. 109 పశుగణావృద్ధి ఉప కేంద్రాలను స్థాపించారు. 89 పశువుల ఆస్పత్రులు, 32 కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు. గన్నవరంలో కేంద్రీయ వీర్య సమీకరణ కేంద్రము ద్వారా 194 ఉప కేంద్రాలకు వీర్యాన్ని సరఫరా చేయ టానికి ఏర్పాటు చేశారు. వందలాది వైద్యసిబ్బంది మారు మూల గ్రామాలలో కూడ పశువైద్యం చేస్తున్నారు. బుద్ధవరం, గుడ్ల వల్లేరు గ్రామాలలో సమీకృత ఆహార ఉత్పత్తి కర్మాగారాలు నెల కొల్పి, పాడి పశువులకు పోషకాహారాన్ని అందించటానికి 350 అమ్మకపు కేంద్రాలను నడుపుతున్నారు సాలుకు 60 వేల టన్నుల మేలురకం గడ్డి రకాలు పండిస్తున్నారు

కోళ్ళ పెంపకంలో ఈ జిల్లా రాష్ట్రంలోనే అగ్రస్థానం చూర గొన్నది. నాలుగులక్షల కోళ్ళతో 350 కోళ్ళఫారాలు నడుప బడు చున్నవి. రెండులక్షల ఖర్చుతో విజయవాడలో కోళ్ళ మార్కెటు కేంద్రం ప్రారంభింపబడింది. ప్రతిరోజు రెండులక్షల గ్రుడ్లు మద్రాసు, బొంబాయి, కలకత్తా, నాగపూరు నగరాలకు పంపు తున్నారు కొల్లేరు ప్రాంతంలో బాతుల పెంపకం విస్తృతం చేయటం వల్ల ఒకలక్ష మేలురకం బాతులు అభివృద్ధి చెందాయి. కైకలూరులో బాతుల విస్తరణ కేంద్రం కూడ పనిచేస్తున్నది.

శ్వేత విప్లవానికి దారి తీసిన విస్తృత పాల పరఫరా పథకం జిల్లాలో పాలదిగుబడికి, రైతుల ఆర్థిక ప్రగతికి ఎంతగానో దోహదం చేసింది. రు 4.3 కోట్ల ఖర్చుతో నిర్మింపబడి రోజుకు ఒకలక్ష ఏభై వేల లీటర్లను సేకరించి రైతులకు కనీసం రూ. 3 లక్షలవరకు ఆదాయం చేకూర్చగలిగిందంటే జిల్లా ఆర్థికంగా ఎంత బలపడిందో ఊహించ వచ్చు. 701 పాల సేకరణ కేంద్రాలు, 287 పాలఅమ్మకపు కేంద్రాలు నిర్వహిస్తూ 2500 మందికి ఉద్యోగావకాశాలు కల్పించటమే కాక,సుమారు వెయ్యి గ్రామాలలో 60 వేల మంది పాలఉత్పత్తి దార్లకు అండగా నిలిచింది. దీనికి అనుబంధంగా ఈ జిల్లాలో 9 పాల శీతల కేంద్రాలు, గుంటూరు జిల్లాలో 5 కేంద్రాలు నిర్మించారు. రోజుకు 56. టన్నుల నెయ్యి, 8 టన్నుల పాలపొడి కూడ ఈ ఫ్యాక్టరీలో తయారు చేస్తున్నారు.

రూ. 70 లక్షల వ్యయం తో కేసర పల్లి వద్ద ప్రాంతీయ సీమపందుల కేంద్రం, బేకన్ ఫ్యాక్టరీ నెలకొల్పారు. వీటికి పందులు సప్లయి చేయటానికి గన్నవరం, ముక్త్యాల, పెనవేగి గ్రామాలలో గవర్నమెంటు పందుల ఫారాలు నడుపుతున్నారు. సంవత్సరానికి వేలాది మాంసం తయారుచేయగల శక్తిగలది ఈ ఫ్యాక్టరీ. అలీఘర్ ఫ్యాక్టరీ తరువాత ఇది రెండవది. ఇచ్చట గొర్రెలు, కోళ్ళు, మేకల మాంసంకూడ తయారుచేస్తారు. ఇచ్చట 15 లక్షల ఖర్చుతో మృత పశు కళేబర వినియోగ కేంద్రం కూడా నడుపబడు చున్నది. (సశేషం)

---

**1976 జూన్ నెల నుండి**

## స్వర్ణయోగి (క్రొత్త సీరియల్)

రచన: శ్రీ పులిచెర్ల సాంబశివరావు

---

# మీనవోలు గ్రామం

—శ్రీ ఎన్. నరసింహస్వామి

విజయవాడ—మధిర రహదారిపై కట్టలేరు ఏటిఒడ్డువనున్న మీనవోలు గ్రామం రజాకార్ల దురాగతాల కాలంనాటి నుండి నేటి వరకు ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది. దాదాపు 3.000 జనాభాతోనున్న యీ గ్రామంగుండా ప్రయాణంచేస్తూ యిటీవలే నిర్మించిన పెద్ద కాలనీ చూస్తే గతం గుర్తుకు రాకమానదు.

1969 "మే" నెలలో సంభవించిన వరదల బీభత్సం వలన బాగా దెబ్బతిన్నదీ గ్రామం. దాదాపు నాల్గవవంతు గ్రామం. ముఖ్యంగా హరిజనవాడ నామరూపాలు లేకుండా కొట్టుకొని పోయినది. అప్పటికి యిచ్చటనున్న కట్టలేటిపై రోడ్డు వంతెన నిర్మాణం జరుగలేదు. అక్కడవరకు వేసిన రోడ్డు కూడా పూర్తిగా కొట్టుకొని పోయినది. వరదల వలన నిర్వాసితులైన కుటుంబాలకు వేరే ఎత్తయిన ప్రదేశంపై పునరావాసం కల్పించే ఉద్దేశంతో ప్రభుత్వం వారు సాంఘిక సంక్షేమశాఖ ద్వారా రూ. 1 06,126 ఖర్చుతో ప్రస్తుతమున్న గ్రామానికి ఉత్తరంగా 35 ఎకరాల 37½ సెంట్లు భూమిని సేకరించి యిందులో 468 కుటుంబాలకు యిండ్ల స్థలాలు కేటాయించారు. ఇందు 224 హరిజనులు, 35 ఎరుకల కుటుంబాలు. మిగిలినవారు యితర బల హీన వర్గాలవారు. ఈ కుటుంబాలవారు తిరిగి యిండ్లు నిర్మించుకొనటానికి సహాయంగా ప్రభుత్వంవారు రూ 89,4000 మంజూరు చేశారు. ప్రజా విరాళం క్రింద గ్రామం తరపున రూ. 65 500 జమ చేయటం జరిగింది. ప్రభుత్వంవారు ఈ కాలనీలో 6 మంచినీటి బావులు త్రవ్వించి. చక్కటి బాటలు నిర్మించి విద్యుత్తు సౌకర్యం కల్పించారు.

## గృహనిర్మాణం

గ్రామ పునర్నిర్మాణ సంస్థ (గుంటూరు) వారు శ్రీ వెండీ గారి ఆధ్వర్యాన యీ స్థలాలలో ప్రభుత్వ సహాయం, ప్రజా విరాళం మరియు వారి సంస్థ సహాయంతో ఒక్కొక్క యింటికి రూ. 2,000 చొ॥న ఖర్చుచేసి 460 యిండ్లు నిర్మించే పథకాన్ని చేపట్టినారు. ఈ నిర్మాణం 5 అంచెలుగా జరుగుతుంది. ఇప్పటి వరకు 300 గృహాలు నిర్మించబడ్డాయి. ఈ క్రొత్త కాలనీకి "పంచరత్నపురి" అని నామకరణం చేయబడినది. ఈ సంస్థ తరపున యిచ్చట ఒక గ్రామీణ వైద్యశాల, కుటీర పరిశ్రమలు నెలకొల్పి యీ గ్రామాన్ని ఒక ఆదర్శ గ్రామంగా తీర్చిదిద్దవలెనను తలంపుతో కృషి జరుపబడుచున్నది. ఈ గ్రామ హరిజన విద్యార్థుల నిమిత్తమై ప్రభుత్వ విద్యార్థి వసతి గృహము 25 మందితో నడుపబడుచున్నది. ఈ గ్రామ ప్రజలు విద్యయందు తగు శ్రద్ధ వహిస్తున్నారనుటలో సందేహంలేదు. ఇక్కడ దాదాపు 207 విద్యార్థులతో ప్రాథమికోన్నత పాఠశాల నడుపబడుచున్నది. ఇచ్చట చదువుతున్న విద్యార్థులు గతంలో యిద్దరు సర్వేయర్ పబ్లిక్ పాఠశాలకు ఎన్నికైనారు. ఇచ్చటి ప్రధానోపాధ్యాయుడు యీ సంవత్సరము సమితి స్థాయి ఉత్తమ ఉపాధ్యాయునిగా ఖమ్మంలో ముఖ్యమంత్రిగారిచే సన్మానింపబడినాడు.

ఈ గ్రామ ప్రజలు ఐకమత్యంతో దాదాపు రూ 1 000 విలువ చేసే గ్రంథాలయ భవనాన్ని స్వయం కృషితో నిర్మించుకున్నారు. ఇందు జిల్లా గ్రంథాలయ సంస్థవారి శాఖ నెలకొల్పబడినది. 1974–75 సం॥లో యీ గ్రామ పంచాయతీ మధిర సమితిస్థాయి ఉత్తమ గ్రామపంచాయతీగా ఎన్నికైనది. ఇక్కడ కట్టలేరుపై దాదాపు రూ. 17 లక్షలతో రోడ్డువంతెన నిర్మించిన తరువాత ఖమ్మం—జమలాపురం, ఖమ్మం—విజయవాడ, విజయవాడ—మధిర బస్సులు మరియు యితర వాహనముల రద్దీతో యీ రహదారి కళకళ లాడుచున్నది. ఇచ్చటి రైతులు చాలా అభివృద్ధి కాముకులు. 135 మంది సభ్యులతో సహకార సంఘం చక్కగా పనిచేస్తున్నది. ఈ సంఘం ద్వారా యీ సంవత్సరము రైతులకు రు 2,41,500 ఋణాలు మంజూరు చేయటం జరిగింది. ఏటిఒడ్డున గొట్టపు బావులు నిర్మించి రెండు పంటలు పండిస్తున్నారు. సంకరజాతి జొన్న, సజ్జ, మిర్చి, ప్రత్తి, వరి, ప్రొద్దు తిరుగుడుపూవు, వేరుశనగ, పెసర, కందిలాంటి పంటలు ఆధునాతన పద్ధతులతో పండిస్తూ అధిక ఫలసాయం తీస్తున్నారు. 1971 సం॥లో 20 మంది మహిళలతో బాపూజీ మహిళా మండలి స్థాపించబడింది. ఈ మండలివారు కుట్టుపని కేంద్రం నడిపారు. అంతర్జాతీయ మహిళా సంవత్సరోత్సవముల సందర్భమున మధిర సమితివారు యీ మండలికి 50% ప్రజా విరాళంపై మహిళా శిశు సంక్షేమ శాఖామాత్యురాలు శ్రీమతి ఎం. లక్ష్మీదేవిగారి ద్వారా ఒక కుట్టుమిషను సరఫరా చేసినారు. ఇచ్చట నాన్‌ఫార్మల్ విద్యా కేంద్రము (Non-formal Education Centre) నడుపబడుచున్నది.

ఈ విధంగా యీ గ్రామ ప్రజలు ప్రభుత్వ సహాయాన్ని ఆసరాగా తీసుకొని స్వయం కృషితో ప్రగతి పథంలో పయనిస్తున్నారు.

# సంక్షిప్త తెలుగు సాహిత్య చరిత్ర

శ్రీ కె. ఆర్. కె. మోహన్

-8-

మర్నాడు అందరూ తిరిగి సమావేశమయ్యారు. మామయ్య చెప్పడం మొదలుపెట్టాడు.

"తెలుగులో మొట్టమొదటి పుస్తకం అచ్చయింది ఆంధ్ర దేశంలో కాదు-భారత దేశంలో అంతకన్నా కాదు-విదేశాలలో అంటే ఆశ్చర్యం వేస్తుంది. కలకత్తాలోని 'శ్రీరామ్‌పూర్ మిషన్'వారు బెంజమిన్ షూల్జ్ అనే జర్మన్ ఫాదరీ తెనిగించిన క్రైస్తవ మత విషయాలను ప్రష్యా దేశంలోని హ్యారీ అనే పట్నంలో ముద్రించాడు. తెలుగు అచ్చులను పోతపోసి అక్కడికి పంపించాడు. ఈయన క్రైస్తవ మత గ్రంథాలను అయిదింటిని వ్రాశాడు. తర్వాత డాక్టర్ క్యారీ అనే ఫాదరీ తెలుగు నేర్చుకుని 1807లో తెనుగు వ్యాకరణం రచించాడు. బైబిల్‌ను తెలుగులోకి అనువదించాడు. ఈయన తన పుస్తకాలను శ్రీరామ్‌పూర్‌లో (బెంగాల్) అచ్చు వేయించాడు. తర్వాత ఈయన మద్రాసు, విశాఖపట్నం, బళ్ళారిలలో తెలుగు ప్రెస్సులు నెలకొల్పాడు. 1817 లో సి పి. బ్రౌన్ దొర తెలుగు వ్యాకరణము వ్రాసి, పంచతంత్ర కథలు సులభ శైలిలో ప్రచురించాడు. ఈ బ్రౌన్‌దొర కారణజన్ముడు అనడంలో ఆశ్చర్యంలేదు. ఈతడు తెలుగు భాషకి చేసినంత సేవ మరి ఏ ఇతర తెలుగువ్యక్తి కానీ మరెవరు కానీ చేయలేదు. ఈతడు తెలుగు భాష అందానికి ముగ్ధుడై దానికి 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని బిరుదు ఇచ్చాడు. తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు, ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులను వ్రాశాడు ఎన్నో పూర్వకావ్యాలను సేకరించి వాటిని సరిదిద్దించి అచ్చు వేయించాడు. ఈ కృషిలో తన స్వంత డబ్బుని ఎంతో ఖర్చు చేశాడు ఎందరో పండితులను పోషించాడు. తెలుగులో కవిత్వం చెప్పాడు. కలెక్టరుగా, జిల్లా మేజిస్ట్రేటుగా పనిచేస్తూ కొన్ని సందర్భాలలో తన తీర్పుని కవిత్వ రూపంలో చెప్పగలిగిన దిట్ట తెలుగు లిపిని సంస్కరించాడు. మెకంజీ దొర సేకరించిన 'స్థానిక చరిత్రలను' తిరిగి వ్రాయించి భద్రపరిచాడు. ఈతడు ఆంధ్ర బంధువు-అభినవ ఆంధ్రభోజుడు అనడంలో ఆశ్చర్యం లేదు.

1807 ప్రాంతంలో కర్నల్ కాలిన్ మెకంజీ అనే ఆంగ్లేయుడు మద్రాసులో సర్వేయర్‌గా పనిచేస్తుండేవాడు. ఆయన దక్షిణ దేశమంతటినుంచీ అనేక రాగి శాసనాలు, తాటియాకు గ్రంథాలు సేకరించాడు. అవి ఎంత ఎక్కువగా సేకరించాడంటే వీటితోనే ప్రధానంగా, మద్రాసులోని ప్రాచ్య లిఖిత పుస్తక భండాగారం నెలకొల్పబడ్డది. ఇది ప్రపంచంలోనే పెద్దది. ఇతడు 'స్థానిక చరిత్రలు' పేరిట 62 సంపుటాలు వ్రాయించాడు. ఇందులో తెలుగు 48, తమిళం 2, కన్నడం 2, మిగిలినవి సంస్కృతం, ఇతర భాషలలో ఉన్నాయి. దీనినిబట్టి ఆ రోజుల్లో తెలుగు భాష ఎంత ప్రధానంగా ఉండిందో తెలుసుకోవచ్చు.

1836 లో రావిపాటి గురుమూర్తి శాస్త్రి గారి తెనుగు వ్యాకరణం అచ్చయింది. 1890 ప్రాంతంలో గద్వాల, వనపర్తిలలో తెలుగు ప్రెస్సులు వెలిశాయి. తర్వాత తెలుగు ముద్రణ త్వరితంగా వ్యాపించింది.

తెలుగులో పత్రికలు ప్రారంభమవడంతో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. తెలుగులో మొట్టమొదటి పత్రిక 'శ్రీయక్షిణి' అనేది. 1840 ప్రాంతంలో బళ్ళారిలో ప్రారంభించబడింది. ఇది వారపత్రిక.

తెలుగులో 'వర్తమాన తరంగిణి' అనేది మొట్టమొదటి దినపత్రిక. దీనిని 1840 ప్రాంతంలో పువ్వాడ వెంకటరావుగారు మద్రాసులో ప్రారంభించారు. తర్వాత 1902లో మచిలీపట్నంలో స్థాపించబడిన 'కృష్ణా పత్రిక' ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకత్వంలో దేశాన్ని ఉర్రూతలూగించింది. దేశోద్ధారక, విశ్వదాత బిరుదులుగల కాశీనాధుని నాగేశ్వరరావుగారు 1908లో బొంబాయి నుంచి 'ఆంధ్రపత్రిక' దినపత్రికను, 1924 లో మద్రాసునుంచి 'భారతి' మాసపత్రికను ప్రారంభించారు. ఈ విధంగా ఎన్నో పత్రికలు వివిధ ప్రదేశాలనుంచి వెలువడసాగాయి.

క్రీ. శ. 1850 వరకు తెలుగులో సంస్కృత భూయిష్టమైన రచనలూ, వాడుక భాషలో నున్న రచనలూ వస్తూనే వచ్చాయి. 1850లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో పరవస్తు చిన్నయసూరిగారు ఆంధ్ర పండితులుగా ప్రవేశించారు. ఈయనకి వ్యావహారిక భాష అంటే గిట్టదు శుద్ధ గ్రాంథిక భాషావాది. ఈయన 1859లో 'బాలవ్యాకరణం' ప్రచురించారు. అల్లాగే పంచతంత్రాన్ని 'నీతిచంద్రిక' పేరుతో ప్రచురించారు. అప్పటినుంచీ తెలుగు గ్రంథాలలో వాడుకభాష మాయమయి, గ్రాంథిక భాష మాత్రమే చోటు చేసుకుంది. అన్ని విద్యాలయాలలోనూ ఈ గ్రాంథిక భాషే బోధించబడసాగింది.

20 వ శతాబ్దం ప్రారంభంలో గిడుగు రామమూర్తి పంతులుగారు, యేట్సుదొర ప్రోత్సాహంతో, ప్రజల భాషలోనే గ్రంథాలు వెలువడాలనే ఉద్యమం లేవనెత్తారు. ఇదే 'వ్యావహారిక భాషోద్యమం' అనే పేర ప్రఖ్యాతి చెందింది. ఈ ఉద్యమాన్ని ఎందరో ప్రతిఘటించారు. దీనికి ఎందరో సహాయం చేశారు. చివరికి పంతులుగారి వాదమే నెగ్గి విద్యాలయాలలో గ్రాంథిక భాషతోపాటు వాడుకభాషకూడా ప్రవేశ పెట్టబడింది. ఇందులో ఆయనకి గురజాడ అప్పారావు పంతులు, కందుకూరి వీరేశలింగం పంతులు వంటి మహానుభావులు అండగా నిలిచారు.

క్రీ. శ. 1909 లో గురజాడ అప్పారావుగారు తమ 'కన్యాశుల్కాన్ని' సవరించి తిరిగి ముద్రించారు. ఇది అతి సహజమైన వాడుక భాషలో ఉండడంలో ప్రథమ నాటకంగా చెప్పుకుంటున్నాము.

క్రీ. శ. 1888 లో కందుకూరి వీరేశలింగంగారు 'రాజశేఖర చరిత్ర' రచించారు ఇది తెలుగులో మొదటినవల. ఇది ఆంగ్లరచయిత గోల్డుస్మిత్‌రచన 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్'కి అనుసరణ. అయితే 1872 లోనే నరహరి గోపాలకృష్ణమ చెట్టిగారు 'శ్రీ రంగరాజు చరిత్ర' అనే నవల వ్రాశారు. కాని ఇది అంత ప్రచారం పొందలేదు.

1892 లో 'చింతామణి' పత్రిక నవలల పోటీలు మొదలు పెట్టింది. ఈ పోటీల్లో అనేక మంది రచయితలు బహుమానాలు పొందుతూ వచ్చారు. ఈ బహుమతులను నాలుగుసార్లు స్వీకరించినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు. అట్టిదే ఈయన రచన 'రామచంద్ర విజయం'. ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' అంటరానితనాన్ని గాఢంగా విమర్శించింది.

తెలుగులో ముద్రణ ప్రారంభమయి పత్రికలు వెలువడడంతో అనేకమంది రచయితల రచనలు పుంఖాను పుంఖాలుగా రాసాగాయి. అనేకమంది ప్రచురణకర్తలు ముందుకు రావడంతో ఎన్నో కథలు, నవలలు, నాటకాలు, విమర్శలు—ఒకటేమిటి అన్నిరకాల సాహిత్య ప్రక్రియలు నిరంతరం రాసాగాయి వాడుక భాషలోని రచనలకు ప్రజల ఆదరణ లభించడంలో ఇట్టి రచనలు అసంఖ్యాకంగా వస్తున్నాయి. అతి స్వల్పకాలంలో అత్యంతాభివృద్ధి చెందిన తెలుగు సాహిత్యం ప్రపంచ సాహిత్యంతో పోటీ పడుతోంది. ఇందుకు తార్కాణం పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన' కథకు ప్రపంచపోటీలో బహుమతి రావడం.

అనేకమైన మేటి పత్రికలు ఆకర్షణీయమైన పోటీలు నడిపి అనేకమైన ఉత్తమ రచనలు రావడానికి సహాయం చేస్తున్నాయి. ప్రభుత్వం స్థాపించిన అకాడెమీలు కూడా పోటీలు పెట్టి, ఉత్తమ గ్రంథాలు ప్రచురించి ఎంతో సాహిత్యసేవ చేస్తున్నాయి. అల్లాగే విశ్వవిద్యాలయాలు కూడాను ఈనాటి తెలుగు సాహిత్యం సమకాలీన ప్రపంచ సాహిత్యంలో విశిష్ట స్థానాన్ని కలిగి ఉందనడంలో ఆశ్చర్యంలేదు. మీరంతాగూడా మంచి రచయితలు కావాలర్రా" అంటూ ముగించాడు మామయ్య.

"మామయ్య బలే మంచి విషయాలు చెప్పాడు" అంటూ పిల్లలు చప్పట్లు కొడుతూ "బందరు మామయ్య జిందాబాద్" అంటూ నినాదాలు చేశారు.

(సమాప్తం)

## పాఠకుల లేఖలు

మీరు ప్రచురిస్తున్న ఆంధ్ర ప్రదేశ్ ఈ నెల సంచిక మాకు అందింది. "అందులో కెరటం" కథ చాలా బాగుంది. ఎమర్జెన్సీ యొక్క సత్ఫలితాలను పరోక్షముగా విజయలక్ష్మిగారు పాఠకులకు తెలియజేశారు. యక్షప్రశ్నలు బాగున్నాయి. నాటకాల గురించి వెంగళరావు గారి అభిప్రాయము బాగుంది. మున్ముందు ఈ పుస్తకము ఇంకా బాగుండేటట్టు చేస్తారని ఆశిస్తున్నాను.

గంగిరెడ్డి బంగారయ్య
చెలవూరు గ్రామం, విజయనగరం.

సంపాదకుల వారికి,

ఆంధ్ర ప్రదేశ్ విడువకుండా చదివే అశేషాభిమాన పాఠకుల్లో నేనూ ఒకణ్ణి. మన పత్రిక ఇప్పుడు నూతన పంథాలో వస్తూందనుటలో సందేహం లేదు...పత్రికా రంగంలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్నది. వెలను పెంచక కేవలం తక్కువ మూల్యానికి ఎన్నో విషయాల నందించే ఏకైక మాస పత్రిక. ప్రతి ఒక్కరికీ అందుబాటులో ఉండే వెల బహుశా మన ఆంధ్ర ప్రదేశ్ పత్రిక దేననుకుంటాను. కథల సంఖ్య రెండుకు పెంచితే బావుంటుంది. అలాగే కార్టూన్లనూ ఎక్కువగా వేయమని కోరుతున్నాను.

ఇన్ని ఆకర్షణలున్న మన పత్రికలో మహిళలకూ, బాలలకూ ప్రత్యేక శీర్షికలు లేనిది చంద్రుడు లేని వెన్నెలలా ఉంటుంది కనుక మార్చి సంచికలో ఒక సోదరి కోరినట్టు, ఆమెగారి సలహా మేరకు దయ చేసి పై రెండు శీర్షికలను కూడా త్వరలో ప్రవేశ పెట్టగలరని ఆశిస్తున్నాను. అలాగే రచయితలకు సూచనలు వంటివి ప్రచురిస్తే మన పత్రిక్కి క్రొత్తగా ఎవరైనా రచనలు పంపదలచిన వారికి మార్గదర్శకంగా ఉంటాయని నా అభిప్రాయం.

దయచేసి ప్రతినెలా మొదటి వారానికి పాఠకుల చేతుల్లోకి వచ్చేలా ప్రయత్నించమని మిమ్మల్ని మరీ మరీ ప్రార్థిస్తున్నాను.

ఎన్. నరసింహమూర్తి
అనంతపురం-515001

ఆర్యా,

నమస్సులు, నేను "ఆంధ్ర ప్రదేశ్" పత్రిక అభిమాన పాఠకుణ్ణి. ఆంధ్ర ప్రదేశ్ ఇప్పటి పత్రికలలో తలమానికమూ. విజ్ఞానదాయకమూను. పత్రిక ధర తక్కువ, విషయాలెక్కువ; సంతోషదాయకమే. నేను 1975 ఫిబ్రవరి నుండీ ఆంధ్ర ప్రదేశ్ తెలుగు సంచిక కొంటూ పరిశీలిస్తున్నాను. నా వంటి పాఠకుల అభిప్రాయాలు, సమర్థనలు మాత్రమే గాకుండా, విమర్శలు కూడ పత్రికలో ప్రచురించడంలో మీ యొక్క హృదయ వైశాల్యంవ్యక్తమవుతున్నది.

అప్పలయ్యా భట్ల నాగరాజ శర్మ
పీలేరు, చిత్తూరు జిల్లా

# నవయుగ వైతాళికుడు
# శ్రీ కందుకూరి వీరేశలింగం



(జననం: 1848 ఏప్రియల్ 16)

శ్రీ వీరేశలింగం పంతులు గారు సాంఘిక సంస్కర్త. సంఘసేవా పరాయణుడు సాహిత్య సవ్యసాచి. వీరు తెలుగు మాత బిడ్డలగుట మనకెంతో గర్వకారణము.

శ్రీ పంతులు గారు నిర్మొహమాటి, తను నమ్మిన సిద్ధాంతములకు కట్టుబడిన మహా మనిషి, పూర్ణ పురుషుడు, కరుణా మయుడు, కార్యశూరుడు.

వెన్నంటి మనస్సు మిన్నంటెడి యశస్సు వీరిది. ఇవి కేవలం భగవత్ప్రసాదములని చెప్పవలసి యుంటుంది.

శ్రీ వీరేశలింగంగారు తాను నమ్మిన సిద్ధాంతములను చాటిరి. వాటికి తగు బీజములు నాటిరి, అవియే బాలికాపాఠశాలలు, మహిళా కళాశాలలు. ఆనాడు స్త్రీ విద్య మహా పాపమని భావించిన రోజులలో వీరు సమాజము నెదుర్కొని మూఢ విశ్వాసముల ఛేదించిరి. అందుకని శ్రీ కందుకూరి కలం—స్త్రీ జాతి పుణ్యఫలమంటారు.

శ్రీ కందుకూరి జీవితమంతయు విద్యార్థియే. అనగా విద్య అంతులేనిది విజ్ఞానమనంతమైనది.

శ్రీ వీరేశలింగం పంతులు గారు శుద్ధ బ్రాహ్మణ కుటుంబమందు, కళలకు పుట్టినిల్లయిన రాజమహేంద్రవరమున ఏప్రిల్ 16, 1848న పున్నమ్మ, సుబ్బారాయుడను పుణ్య దంపతులకు జన్మించెను. బాల్యదశయందే వీరి తండ్రిగారి మరణమువలన వీరిపోషణభారము వీరి పెదతండ్రిపై బడెను.

## బాల్యము —విద్య

బాల్యమందు వీరు అనారోగ్యముగా, బలహీనముగా నుండెడివారు. కండబలము లేకపోయినా గుండె బలము కలవారైరి. వీరు ఏకసంథాగ్రాహి.

వీధిబడిలో రెండవ తరగతి చదువుచున్న రోజులలోనే సాహిత్యముపై అభిరుచి, దీనికి తోడు-సరస్వతి దీవించడమూ సంభవించినది. చిన్ననాటనే భారత, రామాయణ పురాణేతిహాసములను, ఎన్నో కావ్యములను, క్షుణ్ణంగా పఠించిరి. బాల్యమునందే కవిత్వమబ్బినది. పంతులుపట్ల తోటి బాలురకు, ఉపాధ్యాయులకు కూడా, ఎంతో ప్రేమాభిమానము. చిన్ననాడే పంతులుగారిలో భాషాజ్ఞానము, ప్రపంచ జ్ఞానము ఒక దానితో ఒకటి పోటీ పడినవి.

1861లో కాతేరు నివాసియగు అద్దంకి పట్టాభి రామయ్యగారి కూతురు రాజ్యలక్ష్మమ్మతో వివాహం జరిగెను. ఈమె పాతివ్రత్యమును పాటించిన యిల్లాలు. మహాసాధ్వీమణి, కరుణా మయురాలు, అనాథ బాలురకు తల్లివంటిది. పంతులుగారి తెలివి తేటలు యీమెకు సంక్రమించినవి.

1870లో విశ్వ విద్యాలయ పరీక్షలో కృతార్థుడయి 1871లో రాజమహేంద్రవరమున నొక పాఠశాలలో ఉపాధ్యాయునిగా, 1872లో కోరంగిలోగల యింగ్లీషు స్కూలులో ప్రధానోపాధ్యాయుడుగా పని చేసెను. మూఢ విశ్వాసముల పారద్రోల వలెనని విద్యార్థులకు ప్రబోధిస్తూ సమాజములోగల మూఢ విశ్వాసములపై ధ్వజమెత్తెను.

## స్త్రీ విద్య

స్త్రీ విద్యకై ఆయన చేసిన సేవ అమూల్యము. అపురూపము, అనితర సాధ్యము. స్త్రీవిద్య మహాపాపమనియు, స్త్రీ అనగాపిల్లల కనుయంత్రమనియు-స్వాతంత్ర్యమెరుగని జీవితమనియు సమాజపు నమ్మికగా నుండెను. పంతులుగారు స్త్రీవిద్య సహేతుకమనీ. విద్య అభ్యసించవలెననీ, విద్య అభ్యసించని స్త్రీలు-స్త్రీలే

శ్రీ మెదకు సుబ్రహ్మణ్యం

కారని మహోద్యమమును నడిపి సంఘసనాతన వాదులతో తీవ్రపోటీ పడవలసి వచ్చెను. స్త్రీలు విద్య నభ్యసించుటవలన చెడిపోదురు, పెడత్రోవ పట్టెదరన్న వితండ వాదములను వేదములనుండి ఉదాహరణలు చూపి ఖండిస్తూ స్త్రీలు తక్కువేమి-పురుష లెక్కువేమి యని వితండవాదుల ప్రశ్నించెను.

 

స్త్రీవిద్యా ప్రచారము గూర్చి ఎన్నో సభలు–సమావేశము లేర్పాటుచేస్తూ 1874లో ధవళేశ్వరమున బాలికాపాఠశాలను ప్రారంభించెను. ఈయన ఉద్యమమునకు వేలాదిస్త్రీలు చేయూత నిచ్చుటచే సనాతన వాదులు వెనుకంజ వేసిరి. దీనికితోడు విద్యార్థుల సంపూర్ణ అండదండలు పంతులు గార్కి లభించినవి.

## వివేక వర్ధని పత్రిక

సంఘోద్ధరణయందాసక్తి, శక్తి తనకు కలవని వివేక వర్ధని పత్రికద్వారా నిరూపించెను. ఈపత్రిక విద్రోహులపాలిట మహిషాసుర మర్ధని అయినది. దేశభక్తులనే ముసుగుక్రింద చేస్తూన్న మోసముల బట్టబయలు చేసినది. జీవితమును వ్యర్థముగా ఎండబెట్టక కాలమున క్షణ క్షణమును, కాయమున అణువణువును ఒక సత్కార్యమునకు వినియోగించ వలసిందిగా, దీక్ష, తవన శక్తియుక్తులను సంఘసేవకై అర్పించ వలసిందిగా ప్రబోధించినదీ పత్రిక.

ప్రజాసేవకై పూనిన ప్రగాఢ మగు దీక్షయే పంతులు గారికి అగ్ని పరీక్ష అయినది. ప్రగతికై ఆరాటమే ప్రాణములతో చెలగాటమైనది.

1876 లో వివేక వర్ధని పత్రికతోపాటు "హాస్య సంజీవని" అనువ్యంగ్య పత్రికను ప్రారంభించి సంఘమూఢ విశ్వాసముల నిరసించెను. వంచకులు, లంచగొండులు, జారులు, చోరులు సమాజపు చీడపురుగులని అభివర్ణించెను. బాల్య వివాహములనర్థదాయకములని తెల్పుతూ, రజస్వలానంతర వివాహముల సమర్థించిరి.

1870లో పంతులుగారు ఆదర్శ విద్యార్థి సంఘమును స్థాపించి, వారి కార్యక్రమములద్వారా కళాప్రదర్శనలు, స్త్రీ విద్యా ప్రచారము, వయోజన విద్య, పతిత జనోద్ధరణ, సంఘసేవ మున్నగు సత్కార్యములు చేపట్టునట్లు చేసెను.

## సహగమనము - నిర్బంధ వైధవ్యము

కరుణామయులు, కార్యశూరులు, సంఘ సంస్కర్తలునగు శ్రీ ఈశ్వరచంద్ర విద్యాసాగరు, శ్రీ రాజా రామ్‌మోహన్ రాయ్ వంటి త్యాగధనుల అవిరళ కృషివల్ల సహగమనము అంతరించినది. కాని నిర్బంధ వైధవ్యం తొలగింపునకు పంతులుగారే మూల పురుషులు.

నాడు విధవల కురులను ఖండించి కురూపులుగా చేసెడివారు. ఉప్పు, కారము, పులుపుగల ఆహార పదార్థములను యిచ్చెడివారు కారు. పుష్పముల, రంగు వస్త్రముల ధరించకుండా చూచెడివారు. మరియు శుభకార్యములలో ప్రవేశము లేకుండెను. ఇటువంటి నానాయాతనలు, నరకబాధలను వితంతువు లనుభవించెడివారు. విధవలకు పునర్వివాహము జరిపించి, వారి శేషజీవితము సుఖమయము చేయనిశ్చయించెను పంతులుగారు। ఈ సమస్యపై తీవ్రవాదోపవాదములు జరిగినవి. కొన్ని మతాలవారు ముతాలుగా చీలిరి, పట్టును విడవక పోవడము, పాలాతీనకైన జడవక పోవడము పంతులుగార్కి ఉగ్గుపాలతో పెట్టిన విద్యలు.

1881 డిసెంబరు 11న మొదటి వితంతు వివాహము జరిపించెను. మరి రెండు వివాహములు 1882 అక్టోబరులో జయప్రదముగా జరిపించుటచే పునర్వివాహమునకై వితంతువులు వారి శరణు జొచ్చిరి.

త్యాగమే ధనము–భోగమే తృణమని భావించిన పంతులుగారు హితకారిణి యను సంస్థను రిజిస్టరు చేసి రూ. 41,500 సంస్థకు సమర్పించి 1908న ఉన్నత పాఠశాలను నెలకొల్పెను. ఆయన చలువవల్లనే ఆడువారి చదువులకు నేడింత విలువ వచ్చినదనుటలో అతిశయోక్తిలేదు.

## సాహిత్య సవ్యసాచి

సంస్కృతాంధ్ర భాషలను కూలంకషముగా తరచిన సాహిత్య సవ్యసాచి. కాలానుక్రమముగా కవిత్వపు పోకడలను మారుచున్నవని సాహిత్య రంగమందు పంతులుగారు నవశకము నారంభించిరి.

ఏ కవియు తన కలంవల్ల ఏనాడు కనివిని ఎరుగని ఎనలేని ప్రయోజనములను పంతులుగారు సాధింప కల్గిరి.

పంతులుగారు భవిష్యత్తున జీవకవి, భావకవులకు–భావకవి, సనాతనులకు–సమరకవి–సంఘమునకు–విప్లవకవి.

శాకుంతలము, రత్నావళి, మాళవికాగ్నిమిత్రము, ప్రబోధచంద్రోదయము, మున్నగు సంస్కృతానువాదములు, చమత్కారరత్నావళి, వెనీసువర్తక చరిత్ర మున్నగు ఆంగ్లానువాదములు. బ్రహ్మ వివాహము, వ్యవహార ధర్మబోధిని, మూషికాసుర విజయము యిత్యాది స్వతంత్ర నాటకములు. అభాగ్యోపాఖ్యానము, సరస్వతీ నారద విలాసము, వేశ్యాప్రియ ప్రహసనములును, రాజశేఖర చరిత్ర, సత్యరాజ పూర్వదేశయాత్రలు మున్నగు నవలలు. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము, శుద్ధాంధ్ర భారతసంగ్రహము, శుద్ధాంధ్రోత్తర రామాయణము మున్నగు పద్యకావ్యములు. జోతులవంటి నీతులతో విగ్రహము, సంధియను నీతిగ్రంథము, ఆంధ్ర వ్యాకరణము, ఆంధ్ర తర్క సంగ్రహము. పదార్థ వివేచక శాస్త్రము మున్నగు ప్రామాణిక శాస్త్ర గ్రంథములు వ్రాసిరి.

శ్రీ వీరేశలింగం పంతులుగార్కి రావు బహదూర్, గద్య తిక్కన అను బిరుదము లొసంగబడెను.

జీవనయాత్ర పరిపూర్ణముగా సాగించి మే 27, 1919లో మద్రాసు నగరమున తన గృహమగు వేదవిలాస భవనమందు పరమపదించిరి.

కాశీనాధుని నాగేశ్వరరావు మున్నగు పెద్దలు శవవాహకులై భక్తిశ్రద్ధలతో, ఆయన అంత్యక్రియలు జరిపిరి.

ఆయన చేసిన క్రియలు మాత్రమే మిగిలినవి. అందుకని ఆయన సందేశమందుకుని పదండి ముందుకని పురోగమించెడి బాధ్యత మన భుజస్కంధములపై నున్నది. ఇది మనము మరువరాదు।

*

# స్త్రీ, శిశు సంక్షేమ కార్యక్రమాలు

—కుమారి ఎస్. కుసుమాబాయి

యత్ర నార్యంతు పూజ్యంతే ।
రమంతే తత్ర దేవతాః ॥

ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు విహరిస్తారు.

పై వాక్యాన్ని బట్టి మనదేశంలో స్త్రీ ఉన్నతస్థానం కొంత వరకు తెలుస్తుంది.

సృష్టిలో అతి సున్నితమైన వస్తువు రెండు విధాలుగా చూపబడుతుంది. దానికి అలౌకిక సంబంధాన్ని ఆపాదించి ఆరాధిస్తారు ఒకవైపు. రెండోవైపు ఆ సౌకుమార్యాన్ని బలహీనతగా పరిగణించి తిరస్కార దృష్టితో చూస్తారు. భారత నారి పై రెండు విధాలయిన అనుభవానికి గురి అయింది. ఒకవైపు ఆమెను సుందరీ. సుకుమారీ, లతాంగీ, మాతృదేవతా అంటూ ఆరాధిస్తుంది లోకం. మరోవైపు అదేలోకం ఆమెను ఆడది, అబల అంటూ ఈసడిస్తుంది. కాలంతో పాటు విలువలూ మారుతూ ఉంటాయి. ఈనాడు స్త్రీ కోరుకునేది పురుషుని చేత పూజింప బడటం కాదు. తనూ పురుషునితో పాటు సంఘంలో సమాన గౌరవాన్ని, హక్కులను పొందాలనేదే స్త్రీ ఆరాటం.

అన్ని అవయవాలు బలంగా ఉండి. సవ్యంగా ఉండి పని చేస్తూ ఉన్నపుడే శరీరం ఆరోగ్యంగా ఉన్నట్లు లెక్క. అందులో ఏ అవయవాన్నీ తీసివేయడానికి వీలేదు చిటికిన వ్రేలికి దెబ్బ తగిలినా ఆ శరీరమంతా బాధను అనుభవిస్తుంది. అలాగే సమాజంలోని ప్రతి వ్యక్తి, ప్రతి వర్గము సుష్టుగా ఉన్నపుడే దాన్ని సుసంఘటితమైన సంఘంగా పరిగణించాలి. సంఘంలో అర్ధభాగమైన స్త్రీజాతికి అబల అనిపేరు పెట్టి స్త్రీలను సతమతాలకు గురిచేసి విద్యా విజ్ఞానాలకు దూరం చేస్తే, సంఘానికి పక్షపాతం వచ్చినట్లయి సంఘం యావత్తూ బలహీనతకు గురికాక తప్పదు. ఈ విషయాన్ని గుర్తించిన గాంధీజీ తన నిర్మాణ కార్యక్రమంలోని అంశాలలో స్త్రీ సంక్షేమాన్ని కూడా చేర్చారు. జనాభాలో 50 శాతం ఉన్న స్త్రీ సౌభాగ్యం మీదనే దేశసౌభాగ్యం ఆధారపడి ఉన్నదంటే అందులో అతిశయోక్తి లేదు. ఎందుకంటే జవహర్‌లాల్‌నెహ్రూ చెప్పినట్టు ప్రజలను అజ్ఞానమనే నిద్రనుంచి మేల్కొలపాలంటే మొదట స్త్రీలను మేల్కొలపాలి. స్త్రీ కదలడం మొదలుపెడితే కుటుంబం కదులుతుంది. స్త్రీల మూలంగా బాలలు రంగంలోనికి వస్తారు. ఆరోగ్యవంతమయిన జీవనానికి, ప్రశస్తమయిన శిక్షణకు బాలలకు అవకాశాలు లభిస్తాయి.

## కుటుంబ సంక్షేమం

భారత దేశానికి స్వాతంత్ర్యం లభించిన నాటి నుంచి, శ్రేయో రాజ్యస్థాపనకు కృషి జరుగుతున్నది. మహిళల సంక్షేమం మీదనే సమసమాజ నిర్మాణం ఆధారపడి ఉందని గుర్తించడం జరిగింది. అందువల్లనే దేశంలో స్త్రీ సంక్షేమ కృషి అనేక పథకాల ద్వారా జరుగుతోంది. స్త్రీలు అన్ని రంగాలలో పురుషునితోపాటు దేశ సౌభాగ్యంకోసం పాటుపడుతున్నారు. రాజకీయంగానేమి, వైజ్ఞానికంగానేమి, సాహితీక్షేత్రంలోనేమి స్త్రీలు పురుషులతో సమానంగా తమ ప్రతిభను నిరూపించుకుంటున్నారు. కానీ స్త్రీ సమస్యలకు యింకా సరైన పరిష్కారం లభించలేదు. స్త్రీ తన కాళ్ళమీద తాను నిలబడగల శక్తిని పొందిననాడే స్త్రీ సమస్యలకు పరిష్కారం లభించగలదు. ఈ విషయం గుర్తించిన ప్రభుత్వం మహిళా సంక్షేమ శాఖను నిర్వహిస్తున్నది. ఈ శాఖ నిర్వహిస్తున్న ముఖ్యకార్యక్రమం కుటుంబ సంక్షేమం.

ఒకప్పుడు మనదేశంలో ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఉండేది. ఈనాడు మధ్య తరగతి మానవుడు తిండి, గుడ్డ కోసరం యింత బాధ పడలేదు. ఎవరికి తోచిన పని వారు చేసేవారు. ఈ నాడు ఉమ్మడి కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నమయింది. మానవుడి అవసరాలు పెరిగి పోతున్నాయి నానాటికి పెరిగిపోతున్న జీవిత సమస్యలను పరిష్కరించుకోలేక మానవుడు బాధ పడుతున్నాడు. ఒక వ్యక్తి మీద కుటుంబం ఆధారపడే పరిస్థితి ఏర్పడింది తిండికి బట్టకు బాధపడటం యెక్కువయింది. అందువల్లనే యీశాఖ కుటుంబ సంక్షేమానికి ప్రథమ స్థానాన్ని ఇస్తున్నది. సంఘజీవి అయిన మానవుని సమస్త ప్రయోజనాలకు ఆటపట్టు కుటుంబమే. మారుమూలల ఉన్న గ్రామాలలో ఉన్న కుటుంబాలకు తమ చేతనయిన సాయం చేయడానికి. క్లిష్ట పరిస్థితులలో తమ సలహాలు యివ్వడానికి ఆరోగ్యం, శిశుపోషణ. చూలింతల, బాలింతల సంరక్షణ, వైద్య సహాయం, కుటుంబ సమస్యల పరిష్కారానికి కుటుంబాదాయాన్ని వృద్ధి చేసికోడానికి తగిన సలహాలు చెప్పడం, తగిన ఉద్యోగాలు యిప్పించి కుటుంబాదాయాన్ని వేన్నీళ్ళకు చన్నీళ్ళ ప్రాయంగా పెంచడానికి ఈ శాఖ సిబ్బంది కృషిచేస్తూ ఉంది. ఇంటింటికి వెళ్ళి గ్రామీణ స్త్రీలలో పరిచయాన్ని పెంపొందించుకొని వారి సమస్యలను అర్థం చేసికోడానికి జరిగే కృషి ఈ శాఖ నిర్వహణకు పునాదియని చెప్పవచ్చును.

ఈ శాఖ ద్వారా సామాజిక సేవా కేంద్రాలు నిర్వహింపబడుతున్నాయి. స్త్రీలను సంఘటిత పరచి వారిలో సేవాభావాన్ని పౌర చైతన్యాన్ని రేకెత్తించడం, ఈ కేంద్రాల ప్రధాన లక్ష్యము. వివిధ వర్గాలకు చెందిన స్త్రీలు ఒకచోట చేరి నిర్దిష్ట కార్యక్రమాల్లో పాల్గొనడం వల్ల సహకార భావమూ, సౌమనస్యము పెంపొందుతున్నాయి. జాతి, మత వరాల కట్టుబాట్లకు అతీతమైన సమైక్య భావం మహిళలలో కలుగుతున్నది ఈ కేంద్రాల ద్వారా స్త్రీలలో సాంఘిక, విద్యా చైతన్యాన్ని పెంపొందించడానికి కృషి జరుగుతోంది. సాంఘిక విద్య అంటే సమగ్రమైన జీవిత విధానాన్ని [illegible] విద్య. వ్యక్తులకు సమిష్టిగా బ్రతకడం యెలాగో బోధించే

విద్య. మారుతున్న సాంఘిక వ్యవస్థకు అనుగుణంగా పౌరధర్మాల్ని ప్రజా స్వామ్యాన్ని ఆర్థిక ప్రగతి మార్గాన్ని సంస్కృతిని, సంస్కారాన్ని నేర్పే విద్య. ఒక మాటలో చెప్పాలంటే ఆదిమానవుని సర్వతో ముఖాభివృద్ధికి తోడ్పడే విద్య అని చెప్పాలి. ఇట్టి విద్యను బోధించి స్త్రీలను ఉత్తమ గృహిణులుగా, మాతలుగా తీర్చి దిద్దటానికి ఈ కేంద్రాలు నిర్వహింప బడుతున్నాయి. రాబడి తక్కువగా ఉన్న కుటుంబాలకు నూలు వడకడం, నేత నెయ్యడం, ఇతర కుటీర పరిశ్రమలు, నవారు నెయ్యడం మొదలైన వాటి ద్వారా వారి కుటుంబ ఆర్థిక స్థితిని మెరుగు పరచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ శాఖ నిర్వహిస్తున్న కేంద్రాలలో మంత్రసానులు కూడ ఉన్నారు. వీరు యే వైద్య సహాయానికి నోచుకోనివారికి చిన్న చిన్న రుగ్మతలకు మందులిచ్చి పురుళ్లు పోస్తారు. ఈ మంత్రసానులు కేంద్రానికి చుట్టుపట్ల 3 మైళ్ళ లోపుగా ఉన్న గ్రామాలకుకూడ పోయి పురుళ్ళు పోస్తారు. అనాదినుంచి కొండల్లో నివసిస్తూ, నాగరిక సమాజానికి దూరంగా బ్రతుకుతూ, అదే ప్రపంచం అనుకుంటూ బ్రతుకుతున్న ఆదివాస స్త్రీలకోసం ప్రత్యేక బ్రాంచీలు పనిచేస్తున్నాయి. ఏజన్సీ ప్రాంతాల్లో పనిచేసే ఈ శాఖ ఆర్గనైజర్లు, మంత్రసానులు చుట్టుప్రక్క గ్రామాలకు పోయి, ఆదివాస స్త్రీలను కలుసుకుంటారు. ఆరోగ్యకరమైన అలవాట్లు నేర్పిస్తారు వారి జీవిత విధానంలో నాగరికమైన మార్పు తేవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. వారికి చిన్న చిన్న చేతిపనులుకూడ నేర్పిస్తున్నారు. వారుకూడ విస్తృత ప్రపంచంలోని మానవ సమాజంలోని భాగస్వాములమనే భావాన్ని కలిగించి, వారిలో చైతన్యాన్ని పెంపొందించడానికి కృషి జరుగుతూంది. రాష్ట్రం మొత్తంలో 95 స్త్రీ సంక్షేమ కేంద్రాలు నడుస్తున్నాయి. అకారణంగా భర్తచే విడువబడినవారు, వైధవ్య ప్రాప్తివల్ల సన్నిహితుల నిరాదరణకు గురియై బాధపడుతున్నవారు, యే ఆధారము లేకుండ అవస్థలు పడుతున్న అనాథలు ఉంటారు. అలాంటివారికి వెంటనే ఆశ్రయం లభించకపోతే, సహాయం దొరకకపోతే పెడదారిన పడడంగాని, ఆత్మహత్య చేసుకొనడంగాని జరుగుతుంది. అలాంటి నిస్సహాయ స్త్రీలకోసం ఈ శాఖ ద్వారా సేవాసదనాలు నడుపబడుతున్నాయి. కుటుంబాలను దర్శించే సందర్భాలలో ఆర్గనైజర్లు, విస్తరణాధికారిణులు, గ్రామ విస్తరణ కార్యకర్తలు, జిల్లా ఆఫీసర్లు ఇటువంటి మహిళలు, తటస్థపడినపుడు వారి భోగట్టా తెలుసుకొని, వారిని సేవాసదనాలలో చేర్పిస్తారు. ఇటువంటి సేవాసదనం ఒకటి తూర్పు గోదావరి జిల్లాలోని సీతనగరంలో కస్తూర్బా గాంధీ జాతీయ స్మారక నిధి వారి యాజమాన్యాన, కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డలో సంఘసేవా సంస్థవారి అధ్వర్యాన, కన్నాపురం, విజయవాడ, అనంతపురం హైదరాబాదు, ఏలూరులలో ప్రభుత్వముచే నడపబడుచున్నవి. ఈ శాఖచే నిర్వహింపబడుతున్న సేవాసదనాలలో చేర్చుకొనబడిన వారు 3 సంవత్సరములపాటు సామాన్య విద్యనూ, వృత్తి విద్యనూ నేర్చుకొని జీవన భృతిని సంపాదించుకొనగలుగుతారు. ఇ. యస్. యల్. సి, మెట్రిక్యులేషన్ మొదలయిన పరీక్షలలో ఉత్తీర్ణులైనవారిని టీచరు ట్రైనింగుకూ, నర్సు ట్రైనింగుకూ పంపించి తర్వాత ఉద్యోగాలు యిప్పించే ప్రయత్నంకూడ చేస్తుందీశాఖ.

అనాథ బిడ్డలకు మన రాష్ట్రంలో 42 బాల సదనములు నడుపబడుచున్నవి. ఈ బాల సదనములలో చదివిన విద్యార్థినులు కళాశాల విద్యకు నోచుకోని పరిస్థితి గమనించిన శాఖ, 1974-75 సం. లో "కళాశాల విద్యార్థినీ సదనము"లను తిరుపతి, హైదరాబాదులలో ఏర్పాటు చేయడం జరిగింది. అందులో రాష్ట్రమంతటినుంచి 60 మంది బాలికలు ఉన్నారు. స్కూలు చదువు ముగించి సరైన ఉద్యోగాలు దొరకక బాధపడే యువతులకోసం ఈ శాఖ వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలను నిర్వహిస్తున్నది. ఈ కేంద్రాలలో టైపురైటింగు, షార్టుహ్యాండు, బ్యాంకింగు, అక్కౌంటింగు, బుక్ కీపింగు మొదలయిన వృత్తివిద్య శిక్షణ యివ్వబడుతుంది. ఈ శిక్షణ పొందే విద్యార్థినులకు స్టైయిపండు ఇవ్వబడుతుంది. జిల్లాలలో 8 యూనిఫాం తయారీ కేంద్రాలు, రెండు ప్రాంతీయ కుట్టు కేంద్రాలు కడప, హైదరాబాదునందూ నడుపబడుచున్నవి.

## స్టేట్ హోమ్స్

అజ్ఞానంవల్లనో, చిన్న పొరబాటు వల్లనో లేక క్షణిక ఆకర్షణకు లోనయినందువల్లనో కాలు జారిన స్త్రీకి సానుభూతితో చెయ్యిని ఆసరాయిచ్చి నిల్పోపెట్టే ఔదార్యం మనసాంఘిక వ్యవస్థలో లేదు. ఒకవైపు మానవుడు అత్యున్నతమైన విజ్ఞాన శిఖరాలను ఆరోహిస్తున్నాడు. విజ్ఞానంతోపాటు నాగరికత పెరుగుతుందే కాని హృదయం తన సంకుచిత పరిధుల్లోనే తృప్తి పడుతుంది. ఒక మాటలో చెప్పాలంటే విజ్ఞానంతోపాటు మానవుడు పెరగడం లేదని చెప్పాలి దెబ్బతిని క్రిందపడ్డ కాకిని, కాకులమూక చుట్టూ చేరి పొడిచి పొడిచి చంపేస్తుంది. అలాగే ఒకసారి కాలు జారిన స్త్రీని సభ్య సమాజంలో వ్యక్తులుకూడ కాకుల్లా పొడిచి ఆమెను యింకా పతనానికి గురిచేస్తారు. అలాంటి స్త్రీలకు ఆశ్రయము, ఆదరణ అవసరము. మళ్ళీ వాళ్ళను మనుషులను చేసి, నలుగురిలో నిల్పోపెట్టే అవకాశాలు కల్పించడం ప్రభుత్వ బాధ్యత. ఈ విషయాన్నికూడ మన ప్రభుత్వం విస్మరించడం లేదు. ఇలాంటి స్త్రీల కోసం హైదరాబాదు, మహబూబునగర్, కర్నూలు, రాజమండ్రి పట్టణాలలో నాలుగు సదనాలున్నాయి. వీటిని "స్టేట్‌హోమ్స్" అంటారు. ఈ హోములలోకూడ రకరకాల వృత్తి విద్యలు, మెట్రిక్యులేషను, లేదా దానికి సమానమైన విద్యలను చదువుటకు యేర్పాట్లు ఉన్నాయి. వారికి నచ్చిన విద్యను నేర్చుకొని వాళ్ళ వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిలబడగలిగే శక్తి సంపాదించుకొని, మళ్ళీ సంఘంలో తలెత్తుకొని నిలబడే ఆత్మ విశ్వాసం సంపాదించుకుంటారు. అనాధలయిన వృద్ధ స్త్రీలకొరకు చిత్తూరులో ఒక సంస్థను ఏర్పాటు చేయడం జరిగింది. కొడుకులు లేక ఇతరంగా కావలసినవారు చూచే అవకాశములేక వృద్ధాప్య దశలో యెన్నో బాధలకు గురి అవుతున్న 50 మంది స్త్రీలకు ఈ గృహములో అవకాశం యిస్తున్నారు. వారికి బట్టలు, ఆహార నివాస సౌకర్యాలు సమకూరుస్తారు. మరణానంతరం ప్రభుత్వ పక్షాన అంత్యక్రియలుచేసే యేర్పాటు చేయబడి యున్నది ఇది నిజంగా సంక్షేమ కార్యక్రమములలో మహత్తరమైనదని చెప్పవచ్చును. కుష్టువ్యాధి పీడితులయిన, సాంఘిక జీవనంలో బహిష్కృతులై, దిక్కులేక అలమటిస్తున్న వారి ఆరోగ్యకరమైన బిడ్డలను, వారినుంచి వేరుచేసి

విద్యాబుద్ధులు గరపడానికి కడప, రాజమండ్రి, కరీంనగర్, బొబ్బిలి పట్టణాలలో ప్రత్యేక సదనాలు యేర్పాటు చేయబడినాయి. ఆయా జిల్లాలనుండి పంపబడుతున్న బిడ్డలకు ప్రభుత్వ భత్యములుకూడ జిల్లా కలెక్టరులు తమ సంక్షేమ నిధినుండి మంజూరు చేయడం గమనార్హం.

ఉద్యోగాలు చేస్తూ తల్లిదండ్రులకు ఇతర సన్నిహితులకు దూరంగా ఉంటున్న మహిళలకు వసతి సౌకర్యాలు రక్షణ కల్గించడానికి ప్రభుత్వపక్షాన రెండు "వర్కింగ్ ఉమెన్సు హాస్టల్స్" హైదరాబాదు, విశాఖపట్నంలలో స్థాపింపబడి పనిచేస్తున్నవి. మహిళాసంవత్సర సందర్భంగా, గుంటూరు, విజయవాడ, వరంగల్లులలో ప్రభుత్వం విరాళాలతో స్వచ్ఛంద సేవా సంస్థలు ఈ హాస్టళ్ళను నెలకొల్పడానికి సన్నాహాలు చేస్తున్నారు.

దురదృష్టవశాత్తు కోర్టువారిచే శిక్షించ బడినపుడు స్త్రీలు సన్నిహితులకు దూరంగా ఉండి కోర్టులకు హాజరగుటకు, ప్రభుత్వమువారు ప్రత్యేకముగా రెండు సదనములను విజయవాడ, హైద్రాబాద్ లందు స్థాపించియున్నారు.

## శిశు సంక్షేమం

నేటి బాలలే రేపటి పౌరులు. వారి అభ్యున్నతిని కాంక్షిస్తూ నేడు ఎన్నో ఆదర్శప్రాయమైన సంక్షేమ కార్యక్రమాలు, మన రాష్ట్రప్రభుత్వము అమలు జరుపుతున్నది. ఫ్యాక్టరీలలో, శాలాలలో పనిచేస్తున్న స్త్రీల బిడ్డలకు వారిపని సమయములో పరిరక్షించేందుకు, ఆరోగ్యవిధానాలు అమలు పరచేందుకు "శిశువిహార్"లు 69, "బాలవిహార్"లు 28 రాష్ట్రమంతటా నెలకొల్పబడి యున్నవి. బాలింతలకు, చూలింతలకు బలవర్ధక పోషకాహార పథకము దరిదాపు నూరు బ్లాకులలో రాష్ట్రమంతటా అమలులో నున్నవి. పంచాయతీ రాజ్యంయేర్పడిన తర్వాత గ్రామసేవికలు, స్త్రీ సంక్షేమ విస్తరణాధికారులు, నియమించబడ్డారు గ్రామసేవికల కార్యక్రమాలు చాల విస్తృతమైనవి. ఆమె గ్రామంలోని కుటుంబాలలో పరిచయం చేసికోవాలి. గ్రామీణులకు సమస్యాపరిష్కారాలకు తోడుపడాలి. వీరు బాల్వాడీలు—బాలల ఆటల కేంద్రాలు యేర్పాటుచేయాలి. పంచాయితీరాజ్యం అన్నది ప్రజల కార్యక్రమం. ప్రజలు స్వచ్ఛంద సంస్థల ద్వారా స్వయం సహాయం సాధించడం పంచాయితీరాజ్య వ్యవస్థయొక్క ఒక ముఖ్యలక్షణము. ఈ కార్యక్రమాలను నిర్వహించడంలో ముఖ్యసేవికలది ముఖ్యపాత్ర. మహిళా మండలుల పాత్రకూడ ముఖ్యమైనదే. వయోజనవిద్య, పొదుపు ఉద్యమము, సేవాకార్యక్రమాలు మొదలైనవి చేపట్టి విజయవంతంగా నిర్వహిస్తున్న మహిళామండలులు ఎన్నో వెలిశాయి ఈలాంటి మహిళామండలులకు ఈ శాఖ ఆర్థిక సహాయం లభిసుంది. ఈ శాఖ సిబ్బంది సహాయ, సలహాలు లభిస్తున్నాయి. ఈ విధంగా రాష్ట్రనలుమూలలా స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు వ్యాపించియున్నాయి. ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరములో మహిళల ఆర్థికాభివృద్ధి వివిధ పథకములు రచింపబడుతున్నాయి. సంక్షేమ రంగ చరిత్రలోనే కలికితురాయి అనదగిన స్త్రీల ఆర్థిక సహాయ సంస్థనొకటి రాష్ట్రప్రభుత్వము ఏర్పాటు చేసి దేశములో ఒక చరితార్థమైన కీర్తిని సంపాదించుకున్నది.



ప్రధానకార్యదర్శి శ్రీ ఎన్. భగవాన్‌దాస్ ఏప్రిల్ 3న రవీంద్రభారతిలో రుమేనియా తోలుబొమ్మల ప్రదర్శనను ప్రారంభించారు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు మార్చి 31 వ తేదీ ఉగాదినాడు అంబేద్కర్ నగర్ (టాంక్ బండ్) లో నిర్మాణం కానున్న శ్రీ వెంకటేశ్వర కళాకేంద్రానికి శంకుస్థాపన చేశారు. ఆర్థిక, సమాచార శాఖామాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డి యీ కార్యక్రమానికి హాజరయ్యారు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఆ రోజు తెలుగు సాంస్కృతిక ఉత్సవాలను ప్రారంభించారు. ఇవి ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో వారంరోజులపాటు వైభవంగా జరిగాయి.

# నగరంలో నవ ఉగాది

## (ఆ రోజు జంటనగరాల్లోని కొన్ని ముఖ్య సంఘటనలు)



నిజాం ఆర్థోపెడిక్ ఆసుపత్రిలో నిజాం ప్రత్యేక వైద్య విభాగాల సంస్థను ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. భగవాన్ దాస్, చేనేత శాఖామాత్యులు శ్రీ కె. వి. కేశవులు, దేవాదాయ శాఖామాత్యులు శ్రీ సాగి సూర్య నారాయణ రాజు ప్రభృతులు యీ కార్యక్రమానికి హాజరయ్యారు.



అదే రోజున ముఖ్యమంత్రి అమీర్ పేటలో మహిళల సాంకేతిక శిక్షణా సంస్థకు శంకుస్థాపన చేశారు. మహిళా, శిశు సంక్షేమ శాఖామాత్యులు శ్రీమతి ఎం. లక్ష్మీదేవి, ఆర్థిక, సమాచార శాఖామాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డి యీ కార్యక్రమానికి హాజరయ్యారు.



మార్చి 14 న లాల్‌బహదూర్ స్టేడియంలో బొంబాయి సినీ తారలకూ, దక్షిణాది సినీతారలకూ మధ్య క్రికెట్ మ్యాచ్ జరిగింది. యీ సందర్భంగా రాష్ట్ర గవర్నర్ శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా సినీతారలకు బహూమతులను అందజేశారు. కార్మిక శాఖ కేంద్ర ఉపమంత్రి శ్రీ జి. వెంకటస్వామి, ఎక్సైజు శాఖామాత్యులు శ్రీ వి. పురుషోత్తమరెడ్డి కూడా యీ చిత్రంలో వున్నారు.

# నగరంలో వార్తా చిత్రాలు



మహిళా, శిశు సంక్షేమ శాఖామాత్యులు శ్రీమతి లక్ష్మీదేవి కమలానెహ్రూ పాలిటెక్నిక్‌లో శిక్షణగరిపే ఉద్యోగినుల అంతర్ శిక్షణా విభాగాన్ని ఉద్దేశించి స్నాతకోపన్యాసం చేశారు. ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. భగవాన్‌దాస్ యీ కార్యక్రమానికి విచ్చేశారు.



మార్చి 25 న ముఖ్యమంత్రి జూబిలీ హాలులో యాత్రికశాఖ వారోత్సవాలను ప్రారంభించారు. యాత్రిక శాఖామాత్యులు డాక్టర్ సి. హెచ్. దేవానందరావు యీ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.




ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు "ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్య పోరాటచరిత్ర" చివరిసంపుటాన్ని మార్చి 11వ తేదీన విడుదలచేశారు



ఆర్థిక, సమాచార శాఖామాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డి మార్చి 24 న జూబిలీహాలులో రాష్ట్ర శాసన సభ్యుల నుద్దేశించి ప్రసంగించారు. జాతీయ పొదుపు ఉద్యమానికి తమ చేయూత నియ్యాల్సిందిగా వారిని అభ్యర్థించారు.

# కాకిలేరు పంచాయతీ కృషి

—శ్రీ సిద్ధాని నాగభూషణం

ప్రజలను చైతన్యవంతులను చేసి సమాజ శ్రేయస్సు కోసం కృషి చేసేలా కార్యోన్ముఖులను చేసే బృహత్తర బాధ్యతతో పాటు పంచాయతీలను ఆర్థికంగా స్వయం సమృద్ధిగా చేసే, స్వయం చలన సంస్థలుగా రూపొందించే ప్రధాన బాధ్యత కూడా పంచాయతీ రాజ్యానికి అప్పజెప్పటం జరిగింది.

పంచాయతీ రాజ్యం అవతరణతో గ్రామ పంచాయతీ నాయకత్వం మంచి ఉత్సాహంగా ముందుకు వచ్చి అభివృద్ధి కార్యక్రమాలు అమలు పరచటం ద్వారా గ్రామంలో వికాసాన్ని సాధించాలని నిర్ణయించుకొంది. పన్నులను పెంచింది ఇతర విధాలుగా ఆదాయ వనరులను కాకిలేరు గ్రామ పంచాయతీ అభివృద్ధి చేసుకొంది. ప్రత్యేకంగా ఈ పంచాయతీ కొబ్బరిచెట్ల ద్వారా మంచి ఆదాయాన్ని సంపాదించికొంది. పౌర సౌకర్యాలను ఏర్పాటు చేసుకుంటున్న కాకిలేరు గ్రామ పంచాయతీ పశ్చిమ గోదావరి జిల్లాలో ఉంది.

1931 వ సంవత్సరంలో గ్రామ పంచాయతీగా రూపొందిన కాకిలేరు గ్రామం పెనుమంట్ర సమితికి చెందింది. ఈ గ్రామం పెనుగొండకు రెండున్నర మైళ్ల దూరంలో ఉంది.

1971 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం 1972 జనాభా కలిగిన కాకిలేరు గ్రామంలో 591 మంది హరిజనులు ఉన్నారు. 378 ఇళ్ల కలిగిన ఈ గ్రామంలో సుబ్బారాయుడు పేట, సింబోడియన్ పేట శివార్లుగా ఉన్నాయి.

1971 సంవత్సరంలో సర్పంచ్‌గా ఎన్నికయిన శ్రీ కోపల్లె వెంకట్రావుగారు సర్పంచ్‌గా ఎన్నిక కాగానే. కాకిలేరు పంచాయతీ ద్వారా కృషిచేసి గ్రామంలో విద్యుచ్ఛక్తి వేయించారు. ఈ విద్యుచ్ఛక్తి వేయటానికి ప్రజల తరఫున విరాళాన్ని స్వంతంగా చెల్లించారు సర్పంచ్.

సర్పంచ్‌గా శ్రీ జవ్వాది రాధాకృష్ణమూర్తి గారు ఉన్నప్పుడు పంచాయతీ కార్యాలయం భవనాన్ని రేడియోగదిగా 3.000 రూపాయల ఖర్చుతో నిర్మించారు. 1970–71 సంవత్సరంలో హరిజన పేటలో 1,522 రూపాయలు ఖర్చుచేసి రెండు మంచినీటి బావులను తవ్వించడం జరిగింది. 3,668 రూపాయలు ఖర్చు చేసి పాయిఖానా దొడ్లను నిర్మింపచేయటానికే గాక 8,995 రూపాయల ఖర్చుతో 1970–71 సంవత్సరంలో రహదారులు వేయడమయింది.

1962–63 సంవత్సరం నుంచి 1969–70 సంవత్సరం వరకు రోడ్ల నిర్మాణానికి 32,946 రూపాయలు ఖర్చు పెడితే గత నాలుగు ఏళ్ళలో 22,471 రూపాయలు రహదారీ నిర్మాణానికి ఖర్చు చేయటం జరిగింది. వీధులలో కంకర రహదారులు వేయడంతోపాటు 4,406 రూపాయలు ఖర్చు చేసి నిర్మించింది. చెరువులలో పశువులు మంచినీళ్ళు త్రాగే సౌకర్యం కోసం రేవును 6,249 రూపాయలు ఖర్చు చేసి నిర్మించింది.

పంచాయతీ గ్రంథాలయంలో ఉన్న 534 పుస్తకాలను సర్పంచ్ శ్రీ వెంకట్రావు గారు విరాళంగా ఇచ్చారు.

కాకిలేరు పంచాయతీలో 1,628 కొబ్బరి మొక్కలున్నాయి. పొరంబోకుస్థలాల్లో 800 కొబ్బరిమొక్కలు ఉన్నాయి. చెరువుగట్ల పై 700 కొబ్బరి మొక్కలున్నాయి. గ్రామ పంచాయతీ ఆధీనంలో 18 ఎకరాల 34 సెంట్ల విస్తీర్ణం కలిగిన ఐదు చెరువులలో చేపల పెంపకం ద్వారా ఆదాయాన్ని అభివృద్ధి చేసుకొనడానికి పథకాలను రూపొందించుకొంటున్నది.

854 ఎకరాలు విస్తీర్ణం కలిగిన కాకిలేరు గ్రామంలో రైతులు జగన్నాథ్, 8002, ఐ.ఆర్. 208, 3626 వరి రకాలను వేసి వ్యవసాయాన్ని చేస్తున్నారు.

1974–75 సంవత్సరానికి అఖిలభారత స్థాయిలో ఉత్తమ పంచాయతీగా పశ్చిమ గోదావరి జిల్లా పెనుమంట్ర సమితిలోని అత్తిలి గ్రామపంచాయతీ ఎన్నికైంది. ఈ సంవత్సరంలో యిదే గ్రామ పంచాయతీ రాష్ట్రస్థాయిలో కూడా ప్రథమ బహుమతి నందుకొంది.

# నిరాశలో నిండు గుండె

— సి. ఆనందారామం

-10-

జరిగినకథ : సి.ఐ.డి. ఆఫీసర్ మోహన్‌ను శ్యామ్ తండ్రి జనార్దన్ పెంచి పెద్దచేశాడు లోటస్ హోటల్ యజమాని సాంబశివం తన వ్యాపారానికి మోహన్ పాయపడేలా చూడమని తనవద్ద పనిచేస్తున్న ప్రసూనను నియోగించి పంపుతాడు మోహన్ ప్రసూనను వ్యంగ్యంగా తూలనాడి బుద్ధిచెబుతాడు

తన తల్లిదండ్రుల భోగట్టా తెలుసుకొనేందుకు ప్రసూన కూలిపేటవెళ్ళి, అక్కడి వారి దుస్థితిని చూసి కలత చెందుతుంది న్యాయంకోసం పోరాడి, జైలుకెళ్ళి వచ్చిన చిరంజీవి. నైట్‌స్కూల్ నడుపుతోన్న పరమేశ్వరితో సహకరించమని అర్థిస్తాడు.

వివరాలు తెలుసుకోకుండానే శ్యామ్‌ను జైలునుండి విడిపించినందుకు మోహన్‌ను ప్రసూన నిందిస్తుంది హోటల్ లోటస్‌లో దొంగనోట్ల ముద్రణ వ్యవహారం బయట పెట్టేందుకు ప్రసూన, చిరంజీవి పూనుకుంటారు శ్యామ్‌ను మంచి మార్గంలోకి తెచ్చేందుకు మోహన్ సలహామీద అతడికి డబ్బు అందనీయడం లేదు తండ్రి జనార్దన్. శ్యామ్ జేబు దొంగగా మారుతాడు. దొంగ నోట్ల సంగతి తెలుసుకుందుకు ప్రయత్నిస్తూ సుశీలతో పట్టుబడ్డ ప్రసూన యీ విషయం సుశీలకు కూడా చెప్పేస్తుంది......ఇక చదవండి.

---

తన వెనుక నుండి వచ్చి కళ్ళుమూసిన సుశీల చేతులు విడిచి "సుశీలా!" అన్నాడు శేఖర్...

సుశీల నవ్వి చేతులు వదిలి ఎదురుగా కూచుని "వెంటనే చెప్పతున్నావే!" అంది...

"మా ఇంట్లోకి వచ్చి నా కళ్ళు మూయగలిగే సరసులూ సాహసులూ ఎవరు?"

"నేను సాహసినా?"

"దొంగనోట్లు తయారుచేస్తూ దొంగ వ్యాపారం చేస్తున్న

ఉలికి పడ్డాడు శేఖర్... పాలిపోయిన ముఖంతో సుశీలను చూస్తూ "ఎవరుచెప్పారు నీకిది?" అన్నాడు...

"ఎవరు చెప్తేనేంలే? ఇన్నాళ్ళుగా నేనెంత దగ్గర కావాలనుకుంటున్నా, నువ్వు నాకు దూరంగా ఉంటున్నది ఇందుకేనా?"

శేఖర్ మాట్లాడలేదు...

"తెలిసి పోతుందేమో అని అనుమానమున్నంత వరకే! తెలిసిపోయాక భయమెందుకు? చెప్పు..."

"మనం మొదటిసారి ఏకాంతంగా నా గదిలో కలుసుకున్నప్పుడు నువ్వొక మాట అన్నావు గుర్తుందా?"

సుశీలకు గుర్తుంది...

శేఖర్‌ని మొదట సాంబశివం సుశీలకు పరిచయంచేశాడు... సుశీల చాలా అరుదుగా హోటల్‌కి వస్తుంది. అదైనా ప్రసూన కోసం...అలావచ్చినప్పుడు ఒకసారి సాంబశివం దగ్గిర శేఖర్ ఉన్నాడు...

"మా అమ్మాయి—సుశీల..." అని ఎంతో గర్వంగా పరిచయం చేశాడు సాంబశివం...సుశీలను ఎవరికి పరిచయం చేసినా అతను అంత గర్వంతోనూ మాట్లాడుతాడు...అప్పుడు చూసిన శేఖర్‌ను సుశీల మరిచి పోలేక పోయింది అతను అందగాడే! కానీ ఆమెను ఆకర్షించింది అతని రూపం కాదు... పైకి ఎంతో వినయంగా సంస్కారం ఉట్టి పడేలా మాట్లాడే శేఖర్ కళ్ళలో కదిలే ఏదో అసహనం...ఎక్కడినుండో...ఎవరినుండో తప్పించుకుపోవాలనిపించే తపన...అతణ్ణి చూడగానే సుశీలకు మొదట కలిగింది ఆకర్షణ కాదు, కుతూహలం! ఆ తరువాత శేఖర్ చెల్లెలికి పెళ్ళి జరిగిన సందర్భంలో తండ్రితో కలసి వాళ్ళింటికి వెళ్ళింది... ఎవరో సరదాగా శేఖర్‌ని "నీపెళ్ళెప్పుడోయ్!" అన్నారు. "నాపెళ్ళా?" అని నవ్వాడు శేఖర్...ఆనవ్వులో గూడు కట్టిన విషాదం ఎంతో విచిత్రంగా తోచింది సుశీలకి...ఆ విషాదంలో దైన్యంలేదు...ఆవేదన ఉంది...సున్నితమైన మనసు విపరీతంగా నలిగి పోతున్నప్పుడు కలిగే ఆవేదన...

ఎవ్వరితోనూ పెద్ద పరిచయంలేక ఇబ్బందిగా కూర్చున్న సుశీల అవస్థ అర్థంచేసుకుని "నాతోరండి—నా లైబ్రరీ చూపిస్తాను" అని తన గదిలోకి తీసికెళ్ళాడు శేఖర్...

రెండు బీరువాల నిండా ఉన్న పుస్తకాలు చూస్తూ శేఖర్ వంక తిరిగి "మిమ్మల్ని చూస్తోంటే సైతానుకు ఆత్మ అమ్ముకొన్న ఫాస్ట్ గుర్తుకొస్తున్నాడు—" అనేసింది.

కొయ్యబొమ్మలా నిలబడిపోయాడు శేఖర్—పైన ఫేన్ తిరుగుతున్నా ఆపాదమస్తకమూ చమటలు పట్టాయి.

పిచ్చెక్కినవాడిలా తనను చూస్తోన్న శేఖర్‌ను చూసి కంగారు పడిపోయింది సుశీల...

"అదేమిటీ? అలా అయిపోయారు? నేను ఏదో తమాషాకు అన్నాను..."

"ఆ ఫాస్ కన్నా విముక్తి ఉందేమో కాని నాకుమాత్రం లేదు." భరింపరాని నిస్పృహతో అన్నాడు శేఖర్...

సుశీల తెల్లబోయి నిలబడి పోయింది...

శేఖర్ తెలివితెచ్చుకున్నట్లు తలవంచుకుని గబగబా అక్కడి నుండివెళ్ళిపోయాడు...

ఆ తరువాత సుశీల శేఖర్‌కు సన్నిహితంగా రావాలని ఎంతో ప్రయత్నించింది.... శేఖర్ రెండో చెల్లెలతో స్నేహం చేసుకుని శేఖర్ ఇంటికే వచ్చేది... ఆ అమ్మాయి సుశీల మనసు అర్థం చేసుకుని గడుసుగా సుశీలకు శేఖరుకు ఏకాంతం కల్పిస్తూ తను తప్పుకునేది ... శేఖర్ అప్పుడప్పుడు తనను తాను మరిచిపోయి ఎంతో సరదాగా మాట్లాడేవాడు. అంతలో ఏదో గుర్తుకు తెచ్చుకొన్నట్లు ఎంతోదూరంగా అయిపోయేవాడు ... శేఖర్ బాగా చదువుకున్నవాడు. అతని మాటల్లో ఆ విజ్ఞానం కనిపించేది. హుషారుగా ఉన్నప్పుడు అందర్నీ నవ్వించేవాడు. కాలం ఎలా నడుస్తోందో తెలియకుండా కబుర్లుచెప్పేవాడు. కానీ అలాంటి మూడ్ ఎంతోకాలం నిలిచేదికాదు. ఎవరో చెయ్యి పట్టుకుని వెనక్కు లాగినట్లే ముడుచుకుపోయేవాడు

ఒకరోజు సుశీల వచ్చేసరికి శేఖర్ లేడు. సుశీల స్వతంత్రంగా శేఖర్ గదిలోకి వచ్చి బీరువాలోంచి ఒక పుస్తకం తీసుకుని కుర్చీలో కూర్చుంది ఎదురుగా శేఖర్ పక్క కనిపించింది. గదిలో ఎవరూ లేరు సుశీల మనసులో ఏదో చిత్రమైన సంచలనం కలిగింది. పిల్లిలా లేచి గది తలుపులు గడియవేసింది. . ఆ పక్క మీద పడుకుంది. . తలగడను చేతితో తడిమింది చేతికేదో గుచ్చుకున్నట్లయితే ఆశ్చర్యంగా చూసింది...చేతి రుమాలులో పచ్చ గులాబీ తనకు గుచ్చుకున్నది ఆ గులాబీకి గుచ్చిన హెయిర్ పిన్ తను ప్రత్యేకించి ఫారిన్ నుంచి తెప్పించుకున్న అందమైన పిన్ ...

రుమాలుతో కూడా ఆ పువ్వును చేతిలోకి తీసుకుంది సుశీల ఆ ముల్లు అరచేతిలో గుచ్చుకుంటే గిలిగింతలు పెట్టినట్లయింది. ఆ రుమాలునూ, ఆ పువ్వునూ జాగ్రత్తగా తన హేండ్‌బేగ్‌లో దాచుకుంది....

తలుపు తట్టిన చప్పుడయితే త్వరగా పక్కమీది నుంచి లేచి తలుపు తీసింది. ఎదురుగా నిలబడ్డ శేఖర్‌ను చూసి విచిత్రంగా సిగ్గుపడింది అలా సిగ్గుపడుతోన్న సుశీలను చూస్తూ సర్వమూ మరిచి నిలబడిపోయాడు . . సుశీల తేరుకుని " ఏమిటలా చూస్తున్నారు ? " అని దబాయించింది. శేఖర్ కంగారు పడిపోయాడు. పక పక నవ్వేసింది సుశీల. . .

శేఖర్ లోపలికొచ్చి ఏదో మాట్లాడుతూ అప్రయత్నంగా తన ప్రక్కవైపు చూశాడు. కంగారుగా పక్కమీద ఏదో వెతకటం మొదలుపెట్టాడు. . .

" ఏమిటి వెతుకుతున్నారు ? "

నవ్వుతూ అడిగింది సుశీల.

శేఖర్ గిర్రున తిరిగి సుశీల ముఖంకేసి కొన్ని క్షణాలు పరిశీలనగా చూశాడు. చెయ్యి జాపి " ఇచ్చెయ్యండి" అన్నాడు.

" ఏమిటి ? "

" మీకు తెలుసు "

" ఇయ్యను"

" అపురూపంగా దాచుకున్నాను నన్నిలా అల్లరి పెట్టడం న్యాయంకాదు "

" పోనీ, ఇద్దరమూ పంచుకుందాం ! "

సుశీల తన బేగ్‌లోంచి రుమాల్‌లో చుట్టిన పువ్వు బయటికి తీసి రుమాలు తన బేగ్‌లో దాచుకుని, పువ్వును పిన్‌తో సహా శేఖర్ చేతిలో పెట్టింది. చాచిన శేఖర్ అరచేతిలో సుశీల పువ్వులాంటి అరచెయ్యి ఉంది ఆ చేతిలో పిన్‌తో ఉన్న పువ్వు ఉంది. . . . సుశీల చేతిని వెనక్కు తీసుకోలేదు. అలాగే — ఉంచింది — శేఖర్ ముందుకు వంగి పెదవులతో ఆ గులాబీని అందుకున్నాడు . పెదవికి పిన్ గుచ్చుకుని రక్తం చిమ్మింది.

" అరెరె! " అంది సుశీల నొచ్చుకుంటూ.

" పరవాలేదు. గులాబీలు రక్తం ఓడ్చకుండా దక్కించుకోలేము" అన్నాడు శేఖర్ విషాదంతో.

సుశీల మనసు చాలా కలతబడింది ఆనాటినుండే వారి సాన్నిహిత్యం కొంత పెరిగినా ఎప్పటికప్పుడు శేఖర్ దూరంగా ఉండటానికే ప్రయత్నించేవాడు.

శేఖర్‌ను చూసినప్పుడల్లా సుశీలకు ఫాస్ట్ గుర్తుకొస్తూనే ఉండేవాడు " శేఖర్ ! నీ సైతాన్ ఎవరో నాకు తెలియదు, కాని నీకు విముక్తి కలిగించి తీరుతాను... " అనుకునేది తనలో తను ఎన్నోసార్లు......

కానీ ఆ ప్రస్తావనమాత్రం తేలేదు. ఆనాడు కొయ్యబొమ్మలా అయిపోయిన శేఖర్‌ని సుశీల ఏనాడూ మరిచిపోలేదు. అందుకే ఆ ప్రస్తావన తేవడానికి సాహసించలేదు—ఇన్నాళ్ళకు శేఖర్ తనే అడిగేసరికి " గుర్తుంది. " అంది.

" అవును. నేను సైతానుకు ఆత్మను అమ్ముకున్నవాణ్ణే! " నిరాశగా అన్నాడు.

ఎన్నో రోజులుగా తనలో అనుకుంటున్న మాటలు ఆ రోజు సుశీల పైకి అంది.

" నాకు వివరంగా చెప్పండి. నా ప్రాణాలు అర్పించి అయినా మీకు విముక్తి కలిగిస్తాను......"

సుశీల మాటలు చెవులకెంత తీయగా వినిపించినా అది సాధ్యమేనా ? తనకు విముక్తి కలుగుతుందా ?

శేఖర్ మామూలు మధ్య తరగతి కుటుంబంలో వ్యక్తి.... అతి కష్టంమీద ఉన్నదంతా ఖర్చుపెట్టి తండ్రి చదువు చెప్పించాడు. బి. కాం. పాసయ్యాడు. ఉద్యోగాన్వేషణ ప్రారంభించేసరికి చదువుకొనే రోజులో కన్న కలలన్నీ ఎంత కల్లలో అర్థమయిపోయింది.

పెరుగుతోన్న అప్పులు—పెరిగిన చెల్లెళ్ళు—పెరగవలసిన తమ్ముళ్ళు ... తల ఎటుతిప్పినా సమస్యలే! ఏదో ఒక ఉద్యోగం కోసం తిరిగి తిరిగి విసిగి వేసారిన రోజుల్లో కనిపించింది,— హోటల్ లోటస్‌కి ఎకౌంటెంట్ కావాలనే ప్రకటన .....ఆ ప్రకటనలో అతి విడూరంగా కనిపించింది జీతం రెండువేలు అనే ఆకర్షణ ... ఉద్యోగానికి ఇంటర్వ్యూకి వచ్చిన వాళ్ళని చూస్తే దేశంలో జనాభా సమస్య ఎంత తీవ్రంగా ఉందో అర్థమవుతుంది. జనరల్ నాలెడ్జ్, సమయస్ఫూర్తి, ... మొదలైన విషయాలన్నీ రకరకాలుగా పరీక్షించారు. అందర్నీ ఇంటర్వ్యూ చెయ్యడానికి వారం రోజులు పట్టింది. వచ్చిన అభ్యర్థులలో ఇరవై మందిని ఎన్నిక చేసి, వాళ్ళను మేనేజరు ప్రత్యేకించి ఇంటర్వ్యూ చేస్తాడని అన్నారు. ఆ ఇరవై మందిలో శేఖర్ ఉన్నాడు.

ఆ ఇరవై మందినీ సాంబశివం తానే ఇంటర్వ్యూ చేశాడు. ఇంటర్వ్యూ ముగించుకొని బయటకి వస్తున్న అభ్యర్థుల ముఖాలు పాలిపోయి ఉన్నాయి...నిరాశగావెళ్తున్నారు. శేఖర్ సాహసించి ఒకరిని "ఏమిటడుగుతున్నారు?"అన్నాడు. "ఏమిటి! అంతా అయోమయంగా ఉంది. కుంభకోణమేదో ఉంది. లేకపోతే రెండువేలు ఊరికే ఇస్తారేమిటి? ఏదేదో అంటాడు—మన సమాధానాల్లో హెచ్చు తగ్గు లేమొస్తాయో మరి! 'అయామ్ సారీ! మీకీ పోస్ట్ ఈయలేను—వెళ్ళిరండి!' అంటాడు" అని చెప్పి దిగాలుగా వెళ్ళిపోయాడా అభ్యర్థి.

శేఖర్ వంతు వచ్చింది.

సాంబశివం శేఖర్‌ను నఖశిఖ పర్యంతం పరీక్షించాడు—

శేఖర్ ముడుచుకుపోలేదు. ధైర్యంగా సాంబశివం చూపులను ఎదుర్కొన్నాడు.

"ఈ ఉద్యోగంలో చేరటం మీ కిష్టమేనా?"

"ఇష్టం లేకపోతే ఇంటర్వ్యూ కెందుకొస్తాను?"

"ఈ ఉద్యోగానికి ఇంత జీతం ఎందుకు నిర్ణయించామో ఊహించగలరా?"

"బాధ్యతగల ఉద్యోగమయి ఉండాలి!"

"అంతమాత్రానికేనా?"

"చిక్కులతో కూడినదయి ఉండాలి!"

హాయిగా నవ్వాడు సాంబశివం...

"చక్కగా ఉంది—సమాధానం కాదు—అది చెప్పిన తీరు—భయపడకుండా,... దేనికయినా సిద్ధపడిన వాడ్కి...అందుకే ఇంత వరకు ఎవ్వరికీ చెప్పని నా చివరి షరతు చెప్తున్నాను. మీరు ఒప్పుకొంటే మీకు ఉద్యోగం వచ్చినట్లే. మీరు ఒకసారి ఉద్యోగంలో చేరిన తరువాత ఎలాంటి పరిస్థితుల్లోనూ ఈ ఉద్యోగంలోంచి బయటికి వెళ్ళటానికి వీల్లేదు!"

శేఖర్ మనసు బండబారిపోయింది—సాంబశివం అన్నట్లు దేనికైనా సిద్ధంగా ఉన్నాడు.

"వెళ్ళను—అలా బాండ్ రాసియ్యాలా?"

"అనవసరం—బయటికి వెళ్ళాలని ప్రయత్నించినా ప్రాణాలతో వెళ్ళలేరు—అందుకే...నా తప్పు లేకుండా ముందుగా హెచ్చరించాను. పరవాలేదు ఆలోచించుకుని చెప్పండి. వారంరోజుల లోగా ఎప్పుడైనా చెప్పవచ్చు"...వారం రోజులలోగా ఏం జరిగినా జరగొచ్చు...ఇది చెయ్యిజారిపోవచ్చు...వెంటనంటి పీక్కుతినే ఆ భయంకరమైన దారిద్ర్యం...డిగ్రీ ఉండీ ఏమి సంపాదించుకోలేని ఆ నిస్సహాయస్థితి...ఆ నరకం కంటె ఏదైనా మేలే! "ఆలోచించుకోవలసిన దేమీలేదు—చేరిపోతాను..."

చేరిన తరువాత తనకు తానై ఎలాంటి విషవలయంలో ఇరుక్కున్నాడో అర్థమయింది.

ఇంటిదగ్గర సుఖంగానే సాగిపోతోంది! కానీ ఆ సుఖాలన్నీ ఎక్కడివి? సమాజాన్ని అతి దారుణంగా వంచించి సంపాదించుకుంటున్నవి!

రాత్రి కన్ను మూయగానే...చింపిరి తలలతో...చింపిరి బట్టలతో...'అమ్మా! ఆకలి! ఆకలి'...అని ఆక్రోశించే రకరకాల ఆకారాలు...కారులో సాగిపోతున్నా...అతని కళ్ళు చూడకుండా ఉండలేని రకరకాల హృదయ విదారక దృశ్యాలు...మూసుకున్న అతని కళ్ళను చీల్చుకుని మనసును చికాకు పరిచేవి.

ఏదో విరక్తి...మనుష్యులంటే...సమాజమంటే...చివరకు ఈ దేశమంటే...అతని మనసులో ప్రబలిపోతోంది....

ఏంచెయ్యాలి? ఏం చెయ్యగలడు?

శేఖర్ చెయ్యి తన చేతిలోకి తీసుకుంది సుశీల..."అలా కృంగిపోకండి ... మనం తప్పించుకోగలం ... తప్పించుకుని దూరంగా పారిపోదాం!"

ఆ మాటలు శేఖర్‌కు ఆనందాన్ని కంటె భయాన్నే కలిగించాయి...

"బయటికి వెళ్ళాలని ప్రయత్నించినా ప్రాణాలతో వెళ్ళలేరు..." సాంబశివం మాటలు భయంకరంగా మనసులో ప్రతిధ్వనించాయి....

కానీ తన పక్కన ఉన్నది సుశీల! సాంబశివం గారాల కూతురు, ఈ అంధకార జీవితంలో మెరుస్తోన్న ఆశారేఖ!

(సశేషం)

# గిరిజనోద్ధరణ కార్యక్రమంలో భద్రాచలం సమితి కృషి

— శ్రీ హరి గోపాల కృష్ణమూర్తి

ఖమ్మం జిల్లాలోని భద్రాచలం పంచాయతీ సమితి 1-4-63 వ. తేదీన అవతరించింది మొత్తం 47,835 జనాభాగల యీ సమితి ప్రాంతంలో 20,256 మంది గిరిజనులు 5 625 మంది హరిజనులున్నారు. సమితియొక్క విస్తీర్ణం 30 చదరపు మైళ్ళలో 11,648 హెక్టార్ల భూమి సాగులోనున్నది. ఇందులో 2,658 హెక్టార్ల భూమి వర్షపు సాగు క్రింద నున్నది.

ఇటీవల వరకు ప్రభుత్వము ఆదేశించిన ప్రకారం వివిధ రంగాలలో చేసిన కృషి ఫలితంగా గణనీయమైన అభివృద్ధి సాధించబడింది. అధికోత్పత్తిని సాధించడానికి చేయబడిన కృషి వల్ల 1975-76 వ సంవత్సరంలో 3980 హెక్టార్లలో అధిక దిగుబడి నిచ్చు మెట్ట పైరులైన జొన్న మొక్కజొన్న మరియు సజ్జ పైరులు వేయబడ్డాయి. మిగతా ప్రాంతంలో మామూలి దేశవాళి పైరులు వేశారు-6300 హెక్టార్లలో అధిక దిగుబడినిచ్చు వరి పైరులను వేయడం జరిగింది గిరిజనులు ఈ కార్యక్రమంలో ద్విగిణీతోత్సాహంతో ముందుకు వచ్చారు.

రైతులకు వ్యవసాయము నిమిత్తమై సహకార బ్యాంకు తన అనుబంధ సహకార సంఘాల ద్వార రు. 17,80,475 'ఎ' కంపోనెంటు ఋణముల క్రిందను, రు 4,46,414 లను 'బి' కంపోనెంటు ఋణముల క్రిందను అందజేసింది. 'ఎ' కంపోనెంటు ఋణాలు వస్తురూపంలో (ఎరువులు, విత్తనాలు మరియు క్రిమి సంహారకాల రూపంలో) మరియు 'బి' కంపోనెంటు ఋణాలు ధన రూపంలో అందజేయబడ్డాయి.

ఈ సమితిలో ఇటీవల రెండు గిరిజన సహకార వ్యవసాయ సంఘాలు, తునికి చెరువు మరియు రామచంద్రుని పేట అను గ్రామాలలో ప్రారంభించబడ్డాయి. ఈ రెండు సంఘాలకై 92 ఎకరాల బంజరు భూమిలోని అడవిని రు 22,000 ల ఖర్చుతో బుల్‌డౌజర్ల సహాయంతో తుడిచివేసి భూమి వ్యవసాయయోగ్యంగా చేయబడింది. మరియు 49 మంది సంఘ సభ్యులకు పంచడమైనది. ఈ సహకార క్షేత్రాలలో అధిక దిగుబడినిచ్చు నువ్వు, కంది, సజ్జ పైరులను వేయించగా చక్కని ఫలితాలనిచ్చాయి. ఇవిగాక కాటాయిగూడెం, రామారావుపేట అను రెండు గిరిజన గ్రామాలలో గూడా సహకార వ్యవసాయ క్షేత్రాలు పనిచేయుచున్నవి మొత్తం 4 సహకార వ్యవసాయ క్షేత్ర సంఘాలలో, ఆయా గ్రామాలలోని మొత్తం గిరిజన కుటుంబాలు సభ్యులుగా నున్నవి.

ఇవిగాక ముసలి మడుగు, సీతానగరం, చినబండిరేవు మరియు లచ్చిగూడెం గిరిజన రైతులకు సహాయపడే నిమిత్తం సహకార లిఫ్టు ఇరిగేషన్ సంఘాలను స్థాపించడం జరిగింది ఈ సంఘాలకు ఆయిలు ఇంజనులు ఉచితంగా అందించబడ్డాయి. సహకారబ్యాంకులనుండి వీరికికావలసిన ఆర్థికసహాయం అందించబడింది

విద్యావిషయంలో గిరిజనులను ముందుకు తేవడానికి కృషి సాగుతున్నది. సమితి చేత 23 ప్రాథమిక పాఠశాలలు, 5 ఆశ్రమ పాఠశాలలందు విద్యార్థులకు భోజన మరియు నివాస వసతి కూడా వున్నది సమితికి చెందిన 7 పాఠశాలలకు భవనాలు నిర్మింపబడ్డాయి ఇవిగాక ప్రవేటు మేనేజిమెంటులో నున్న 46 ప్రాథమిక పాఠశాలలను సమితికి దఖలు పరచవలసిందిగా ప్రభుత్వాన్ని కోరడం జరిగింది. ఈ పాఠశాలలన్నింటిలో 8,10 మంది విద్యార్థులు చదువుకొనుచున్నారు. వీరిలో 2500 మంది గిరిజనులు మరియు 1500 మంది హరిజనులున్నారు సమితిలో నున్న 14 గ్రామాలలో నూతనముగా పాఠశాలలను మంజూరు చేయుటకై ప్రభుత్వాన్ని కోరారు.

ఈ సమితిలో గిరిజన బాలుర హాస్టళ్ళు, 1 గిరిజన బాలికల హాస్టలు, 1 హరిజన బాలుర హాస్టలు వున్నాయి. వీనిలో 200 మంది విద్యార్థులున్నారు. వీరికి భోజన, నివాస వసతులే గాక బట్టలు మరియు పుస్తకములు ఉచితంగా అందింపబడుతున్నాయి.

25 గ్రామాలలో విద్యార్థులకు మధ్యాహ్న భోజన వసతి కల్పించబడింది. 600 మంది లాభము పొందుచున్నారు.

ఇంతేగాక 5 గ్రామాలలోని బాలవాడీలకు చెందిన 500 మందికి మధ్యాహ్న భోజన వసతి కల్పించబడింది

చిన్న పిల్లలకు, గర్భిణీ స్త్రీలకు పిల్లతల్లులకు పోషకాహారాన్ని అందించే పథకం క్రింద ఈ సమితిలో 52 కేంద్రాలు నడుపబడుచున్నవి. వీనిద్వార 2287 మంది చిన్న పిల్లలు, 276 మంది గర్భిణీ స్త్రీలు మరియు 2563 మంది పిల్లతల్లులు లాభము పొందుతున్నారు. 1970-71 నుండి 1975-76 వరకు ఈ పథకము క్రింద రు 8,20,000 లు వ్యయపరువ బడినవి.

సమితి యందు, పాఠశాలలు, మరియు ఇతర భవనాలకై ఇటీవల రు. 32,601 లు, సామూహిక వ్యవసాయపు బావులకై రు. 27,000 వ్యయపరుపనైనది. 30,000 రోడ్ల నిర్మాణానికై ఖర్చు చేయబడెను పశు సంవర్ధన కార్యక్రమమాల క్రింద (2) పెద్ద వైద్యశాలలు, (2) అనుబంధ పశు వైద్యశాలలు పని చేయుచున్నవి. మేలుజాతి పశువులను, మరియు కోళ్ళను గ్రామాలలోని గిరిజనులకు అందించుట జరిగింది.

## పరిశ్రమలు

పరిశ్రమల విభాగంలో - స్వయం ఉపాధి కల్పనా కార్యక్రమాల క్రింద 1,04,000 ల ఋణాలు వివిధ పరిశ్రమల నెలకొల్పుటకై మంజూరు చేయబడినవి. 16.24 ఎకరాల భూమిని పరిశ్రమల స్థాపనకై కేటాయించడం జరిగింది. ఇంతేగాక 20 మంది గిరిజన బాలురకు డ్రైవింగ్‌లో శిక్షణ ఇవ్వడం జరిగింది.

ఇటీవల జరిగిన పంచాయితీరాజ్ రజతోత్సవాల సందర్భంగా 2500 ఇండ్ల స్థలాల పట్టాలు, మరియు 250 ఎకరాల వ్యవసాయ భూములు, బలహీన వర్గాల వారికి పంచిపెట్టడం జరిగింది.

గత జూన్ నెలలో తునికి చెరువునందు గిరిజన తెగకు చెందిన 40 మంది యువకులకు శిక్షణా శిబిరం 1 నెల పాటు నిర్వహింపబడింది. యువకులు శ్రమదానంతో ఒక చెరువును మరమ్మత్తు చేయడమే గాక సహకార వ్యవసాయ క్షేత్రాన్ని 30 ఎకరాల మేరకు శుభ్రపరిచారు.

# మహాభారతము

## శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## 95

"పుత్రా! నీకు మంగళమగుగాక. నేను యమ ధర్మరాజును. నీసంగతి తెలిసికొనుటకే యిప్పుడిక్కడికి వచ్చినాను, నీకు గల ఆనృశంస్యము (దయాళుత్వము) చేతమిక్కిలి సంతుష్టుడనైతిని. అనఘా! నీకు వరమిచ్చెదను. కోరుకొనుము. నాకు భక్తులైన వారికి దుర్గతికలుగదు." అది విని యుధిష్ఠిరుడు యమ ధర్మరాజుతో "భగవన్! బ్రాహ్మణుని అరణి - మంథనము ఈ రెంటిని తీసుకొని మృగము పరుగెత్తెనుపోయెను. అందుచేత ఆ విప్రుని అగ్నిహోత్ర కార్యమునకు లోపము కలిగెను. లోపము కలుగకుండ చేయుము. ఇది నేను కోరు మొదటి వరము. ఈ వరమును నాకు ప్రసాదింపుము" అని యడిగెను. దానికి యముడు 'నాయనా! ఆ రెంటిని నే నే నిన్ను పరీక్షించుటకు గాను మృగరూపముతో హరించుకొని పోయినాను, అని యుధిష్ఠిరునితో చెప్పి, 'అవి యిచ్చెదను' అని వరమిచ్చి, 'మరియొక వరమేదైన కోరుకొను' మని యముడు అడిగెను. అప్పుడు ధర్మరాజు మరల నిటు వరము కోరెను :—

"మాకు పన్నెండేండ్ల అరణ్యవాసము ఇప్పుడు ముగియుచున్నది. పదమూడవ యేడు అజ్ఞాతవాసము రానున్నది. ఆ సంవత్సరము మమ్ము ఎవరు గూడ గుర్తుపట్టరాకుండునట్లు వరమును అనుగ్రహింపుము." అది విని యముడు 'ఆ వరము ఇచ్చెదను' అని చెప్పి తిరిగి ధర్మరాజును ఊరడింపదలచి యిట్లు చెప్పదొడగెను :—

"భరతనందనా! మీరు ఒకవేళ ఈ రూపముతోనే యీ భూమండలమంతయు తిరిగినప్పటికి మూడులోకములయందు ఎవరు గూడ మిమ్ము గుర్తుపట్టజాలరు. ఈ పదమూడవ యేడు మీరు విరాటనగరమునందు ఉండగలరు. నా యనుగ్రహము వలన మీరు అచ్చట రహస్యముగా నుండి యెవరికిగూడ తెలియబడకుండ నుండెదరు. మీరు మనస్సునందు ఏ యే రూపముల యందు ఉండుటకు సంకల్పించెదరో, ఆయా రూపములను మీయిష్టానుసారముగాధరించ గలరు. ఈయరణిని-మంథనమును బ్రాహ్మణునకు ఇచ్చివేయుడు.

"పుత్రా! నీకు ఇంకను వరముల నీయవలెనని నాకు ఇచ్ఛ గలదు. తృప్తి కలుగలేదు. మూడవ వరమును కోరుకొనుము. అది యెంత గొప్పదైనను, ఎంత అసమాన వరమయినను ఇచ్చెదను నీవు నా పుత్రుడవుగదా! విదురుడుగూడ నా యంశమునందే పుట్టిన వాడు." ఆమాటవిని యుధిష్ఠిరుడు యమధర్మరాజుతో ఇట్లనెను:—

"తండ్రీ! దేవదేవుడవు. సాక్షాత్తు సనాతనుడవునైన నీ దర్శనము లభించినది. ధన్యుడనయితిని. ఇంతియే చాలును ఇక నేను వరము కోరను. నీవే నా యెడల సంతుష్టుడవై యే వరమిచ్చినను నీ ప్రసాదముగా దానిని గ్రహించెదను ఐనను లోభ మోహ-క్రోధములను సర్వదా జయించి యుండునట్లును, నా మనస్సు సర్వదా దానమునందు నిలిచియుండునట్లును వరము ప్రసాదించుము" అని అడిగెను ఆ మాట విని "నాయనా! నీవు స్వయముగా ధర్మస్వరూపుడవు. కనుక నీవు కోరిన గుణములన్నియు నీయందు ప్రతిష్ఠితములై యున్నవి. భవిష్యత్తునందు గూడ నీవు కోరిన ఈ ధర్మములన్నియు నీ యందు ఉండగలవు" అని యుధిష్ఠిరునకు చెప్పి యమధర్మరాజు అంతర్ధానము చెందెను." అని చెప్పి వైశంపాయన మహాముని జనమేజయునకు ఇట్లు తరువాతి కథ చెప్పదొడగెను :—"రాజా! ఇట్లు సుఖనిద్రనుండి మేల్కొనినట్లు ఉన్న పాండవులు తిరిగి తమ ఆశ్రమమునకు పోయిరి. బ్రాహ్మణునకు అరణి-మంథన దండనములను ఇచ్చిరి.

"రాజా! భీమార్జున నకుల సహదేవులు తిరిగి జీవించి అందరు కలిసికొనుట, తండ్రి-కొడుకులయిన యమ - యుధిష్ఠిరుల సంవాదమునకును సంబంధించిన ఉపాఖ్యానమును పఠించిన నరుడు, జితేంద్రియుడై పుత్ర పౌత్రులతో నూరేండ్లు సుఖముగా జీవించి యుండగలడు-ఈ కథ వినిన విజ్ఞానుల మనస్సు, అధర్మమునందు-మిత్రులలో భేదభావము కలిగించుటయందు-పరధనాపహరణమునందు పరస్త్రీగ్రహణమునందు - కృపణత్వము (లోభము - కుత్సితత్వము) నందును ఎప్పుడు గూడ లగ్నముగాదు."

### ధౌమ్యుని ఉపదేశము

"జనమేజయ మహారాజా! అట్లు పాండవులు యమధర్మరాజు యొక్క అనుమతిగొని, పదుమూడవయేట రహస్యముగా నుండి అజ్ఞాతవాసము సలుపుటకు సంసిద్ధులై యుండిరి. అక్కడ తమతో వనవాసమును గడపుచున్న మహర్షులతోను, బ్రాహ్మణులతోను పాండవులిట్లనిరి.

"మునీశ్వరులారా! ధార్తరాష్ట్రులు మాపై కుట్రచేసి మా రాజ్యమును అపహరించిన సంగతి, వారు మాయెడలచేసిన యెన్నో అత్యాచారముల సంగతియు మీకు తెలియును గదా! మేము పన్నెండేండ్లు అతి కఠినముగా అరణ్యవాసము చేసితిమి. ఇక మిగిలిన పదుమూడవయేడు అజ్ఞాతవాసము సలుపవలసియున్నది. మేమిక రహస్యముగా నుండబోవుచున్నాము. మాకు అనుజ్ఞనీయగలరు. దురాత్ములైన కర్ణ-శకుని-దుర్యోధనులు మా రహస్యమును కనుగొనుటకు గాను స్వయముగాను [illegible] ద్వారా గూడను అనేక

ప్రయత్నములను చేయుచున్నారు. ఇట్టే మమ్ములను కనుగొని నచో మా యింగిలి అజ్ఞాతవాస నియమముతో మమ్ములను మాకు సహాయము చేసిన బంధువులను, పౌరులను గూడ అనేక విషయావస్థలకు లోను చేసెదరు. మేము తిరిగి మా రాష్ట్రమునందు బ్రాహ్మణులతో రాజ్యము చేయగల భాగ్యము మాకు కలుగునా?"

ఇట్లు చెప్పిన తర్వాత ధర్మరాజు మిక్కిలి దుఃఖించి మూర్ఛ పోయెను అప్పుడు అతని తమ్ముళ్లు, బ్రాహ్మణులు అతనిని ఓదార్చిరి అప్పుడు ధౌమ్యాచార్యులు ఇట్లు చెప్పెను:

"రాజా! నీవు ఆత్మజ్ఞాన సంపన్నుడవు, సత్యసంధుడవు, జితేంద్రియుడవు. నీవంటి మహాత్ములు ఎట్టి ఆపదలు వచ్చినను మోహము చెందగూడదు. మహాసుఖాఢ్యుడైన దేవతలుగూడ అప్పుడప్పుడు శత్రువులకు ఓడి రహస్యవేషములలో తిరుగుచు అనేక విపత్తులకులోనై, ఆ తరువాతనే శత్రువులను జయించినారు. పూర్వమొకప్పుడు ఇంద్రుడు శత్రువులను అణచుటకుగాను కపట వేషమును ధరించి రహస్యముగా, నిషధ దేశమునకు పోయి యందలి గిరిప్రస్థాశ్రమమునందు దాగియుండి తన కార్యక్రమమును సాధించెను.

భగవంతుడైన విష్ణువుగూడ రాక్షస వధార్థమై 'హయగ్రీవ' రూపమును (తలగుఱ్ఱముది-శరీరము మానవునిదియగు రూపము) ధరించి అజ్ఞాతముగా 'అదితి' దేవియొక్క గర్భమునందు చాల కాలముదాక దాగియుండెను. ఆ దేవుడే మరియొకప్పుడు వామన రూపమును ధరించి బ్రాహ్మణవటులై ప్రచ్ఛన్నముగా నుండి తన విశ్వరూపముచేత బలిచక్రవర్తిని అణచి యతని రాజ్యమును హరించలేదా! అదినీకు తెలిసిన విషయమే కదా! పూర్వము అగ్ని దేవుడు జలమునందు దాగియుండి దేవతల కార్యమును నెరవేర్చిన సంగతి నీకు తెలియునుగదా! భగవంతుడైన శ్రీమహావిష్ణువు శత్రు నాశనార్థమై రహస్యముగా ఇంద్రుని వజ్రాయుధమునందు ప్రవేశించి దాగియుండి చేసిన శత్రువిజయ కార్యమును గూడ నీ వెరిగి యున్నావుకదా!

"రాజా! పూర్వము బ్రహ్మర్షియైన 'ఔర్వుడు' తన తల్లి తొడలోపల రహస్యముగా దాగియుండి దేవతల కార్యమును సిద్ధింప జేసిన సంగతి నీకు తెలిసినదేకదా! నాయనా! ఈ విధముగానే మహా తేజస్వియైన సూర్యభగవానుడు గూడ పూర్వము భూమిపైన రహస్య ముగా దాగియుండి శత్రువులనందరిని మాడ్చివేసెనుగదా! విష్ణుమూర్తి శ్రీరామచంద్రుని యవతారమును ఎత్తి దశరథుని యింట రహస్య ముగా మానవుడుగానుండి యుద్ధమునందు రావణాసురుని సంహ రించి లోకములకు మేలు చేకూర్చెనుగదా! ఈ విధముగనే మహా త్ములు అచ్చటచ్చట ప్రచ్ఛన్నముగానుండి యుద్ధమునందు శత్రువు లను జయించిరిగదా! అట్లే నీవుగూడ జయించగలవు."

"ఈ విధముగా ధౌమ్యాచార్యులు చేసిన ఉపదేశమును విని ధర్మజ్ఞుడైన యుధిష్ఠిరుడు శాస్త్రజ్ఞానము ద్వారా—తన బుద్ధి ద్వారా గూడ ఒక నిశ్చయమునకు వచ్చి సంతుష్టుడై యే మాత్రము చలిం చక యుండెను" అప్పుడు భీమసేను డిట్లనెను :—

## భీముడు ఉత్సాహపరచుట

"మహారాజా! గాండీవధారియైన అర్జునుడు తన ధర్మాను సరణబుద్ధిచేత, మీ యాజ్ఞకొరకు ఎదురు చూచుచు ఇంతవరకు ఏలాటి సాహస కార్యమును తలపెట్టి శత్రుసంహారము చేయలేదు అత్యంత పరాక్రమవంతులైన నకుల సహదేవులు గూడ సమస్త శత్రుధ్వంసము చేయుటకు సమర్థులైయుండిరి ఆ యిద్దరిని నేనే ఆపుచు వచ్చితిని మీరు మాకు ఒప్పజెప్పిన కార్యమును సంపూ ర్ణముగా నెరవేర్చుట విధువము అందుచేత మీరు యుద్ధమునకు గాను అన్ని యేర్పాట్లను చేయుడు. మేము శత్రువిజయమును త్వరగానే సాధించగలము." ఇట్లు భీమసేనుడు చెప్పిన తరువాత బ్రాహ్మణులు వారిని ఆశీర్వదించి వారియనుమతి తీసికొని తిరిగి పాండవులను కలిసికొను నిశ్చతో తమ తమ యిండ్లకు పోయిరి"

## పాండవుల సంప్రతింపు

"జనమేజయా! ఆ తరువాత పాండవులు ధౌమ్యాచార్యుల తోను, ద్రౌపదితోను అచటినుండి ధనుర్ధారులై కదలిపోయిరి. ఒక పరువు దూరము మాత్రమట్లుపోయి, మరునాటినుండి వారు అజ్ఞాతవాసము నారంభించవలసియున్నందుచేత పరస్పరము సంప్రతించుకొనుటకుగాను అందరు కలసి ఒకచోట కూర్చొనిరి. వారిలో ఒక్కొక్కరు ఒక్కొక్క శాస్త్రమునందు విద్వాంసులు. మంత్రాలోచనలు చేయుటయందు సమర్థులు. సంధివిగ్రహాదుల యవసరమునుగూర్చి బాగుగా తెలిసిన వారగుటచేత అతి సామర్థ్య ముతో భవిష్యత్కార్యమునుగూర్చి పరస్పరము సంప్రతించి ఒక నిశ్చయమునకు వచ్చిరి.

అరణ్యపర్వము సమాప్తము

---



# గ్రంథ సమీక్ష

## శ్రీకాకుళం జిల్లా చరిత్ర

### ( 1, 2 భాగాలు )

రచన : ఆదిభట్ల వేంకటరమణ. వెల: పది రూపాయలు 342 పుటలు ( అన్ని హక్కులు గ్రంథకర్తవి ), ప్రచురణ: ప్రపంచ తెలుగు మహాసభల జిల్లా స్థాయి సంఘం, ప్రతులకు : కార్యదర్శి, శ్రీవాణి సాహిత్య పరిషత్తు, నరంగ దోలా వీధి, శ్రీకాకుళం జిల్లా (ఆం. ప్ర.)

"అనుకున్నంత తేలిక కాదు" అనే పనుల్లో చరిత్ర వ్రాయటం ఒకటి. అమెరికాలో ప్రతి జిల్లాకు, నగరానికి, పట్టణానికి సంబంధించిన చరిత్రలు సమగ్రంగా వ్రాయబడినాయి. భారతీయులకు ఇది ఒక అతీతమైన పని కాకపోయినా, ప్రయత్నం మాత్రం దారుణంగా లోపించుతూ వుంది. కాని ఆదిభట్ల వేంకటరమణ గారు వ్రాసిన ఈ "శ్రీకాకుళం జిల్లా చరిత్ర" ఘనమైన తెలుగు గతాన్ని, వారి జిల్లాల, పట్టణాల, పల్లెల వైభవాన్ని, సమగ్రంగా వ్రాయటానికి తదితరులకు మార్గదర్శి కాగలదని ఆశించవచ్చు. విశాలాంధ్ర ప్రచురణాలయంవారు ఈ మేరకు కృషిచేసి 1954లోనే "ఆంధ్ర దర్శిని" సంకలనానికి పూనుకొని తెలుగు దేశ స్వరూప స్వభావాలను సంక్షిప్తంగా తెలిసికోవటానికి మరువరాని సేవచేశారు.

ఈ సమీక్ష వ్రాస్తూవుంటే ఇటీవల నగరంలో జరిగిన ఒక సంఘటన వ్రాయాలని పించుతూ వుంది. ఒక మహారాష్ట్రపాత్రికేయుడు (జర్నలిస్టు) కొల్లేరు సరస్సు ఎక్కడ వుంది అని కుతూహలంగా ప్రశ్నించాడు. కృష్ణా జిల్లాలో అనీ, కాదు, కాదు పశ్చిమ గోదావరి జిల్లాలో వుందనీ ఇరువురు తెలుగు పాత్రికేయులు పందెంకట్టుకోవటం ప్రారంభించారు. ఇది చూచి, తెలుగు నేర్చిన ఒక కర్నాటక పాత్రికేయుడు జోక్యంచేసికొని, "అది కాదండీ కొల్లేరు సరస్సు సగం కృష్ణాలో, సగం పశ్చిమ గోదావరి జిల్లాలోను వున్నట్లు నేను 'ఆంధ్ర దర్శిని' లో చూశాను" అనగానే ఏనుగు-గ్రుడ్డివారు చందంగా తగవుపడే మిగిలిన తెలుగు సోదరులు పేలవంగా నవ్వి వూరుకున్నారు. దీనినిబట్టి తెలుగుదేశ సమగ్ర చరిత్ర జిల్లాల, పట్టణాలవారీగా ఎంత అవసరమో గమనించవచ్చు.

ఈనాటి శ్రీకాకుళం జిల్లా ఒకనాటి కళింగరాజ్యంలో భాగం. ఆ నాటి కళింగసీమ కటక్ నుండి పిఠాపురంవరకు వ్యాపించి వుండేది. అది శక్తివంతమైనదేగాక, నాగరిక రాజ్యంకూడా. శైవుడైన అశోకుడు దండెత్తివచ్చి అపారంగా జననష్టాన్ని కల్గించి రక్తపుటేరులు పారించింది. ఈ కళింగసీమ మీదికే. అదిచూచి పరివర్తనచెంది బౌద్ధమతావలంబియై ఆ మత ప్రచారానికి తీవ్రంగా కృషిచేశాడు. క్రీ॥పూ॥ 467నుంచి ఇది ప్రాశస్త్యంగల రాజ్యంగా వుంది. అప్పటి నందులపాలనలో జైనమతం, తరువాత మౌర్యుల కాలంలో బౌద్ధమతం, గోల్కొండ, మొగలాయి, హైదరాబాదు నవాబుల పాలనలో యిస్లాము, శైవ, వైష్ణవాదిమతాలు, ఫ్రెంచి వారి ప్రభావం, ఆంగ్లేయుల పాలనలో క్రైస్తవమతం అన్నీ విలసిల్లి వివిధ సంస్కృతుల మేళవింపు యిక్కడ కన్పిస్తుంది. మతం భిన్నత్వంలో ఏకత్వం సాధించింది. అపూర్వశిల్ప సంపద ఇచ్చట వెల్లివిరిసింది.

విశాఖ జిల్లానుంచి ప్రత్యేక జిల్లాగా 1950 లో ఏర్పాటు చేయబడిన ఈ శ్రీకాకుళం జిల్లా చరిత్ర మొదటిభాగంలో సంస్కృతీ సాహిత్యాల వైభవాన్నిగూర్చి విపులంగా వ్రాయబడింది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఉత్తరాన, బంగాళాఖాతం తీరాన కొండలు, లోయలతో మైదానాలు, ఇసుకనేలలు, నదులు, వాగులతో, అడవులు, పంట పొలాలతో కూడిన ఇది ఒక చిత్రమైన జిల్లా.

భారత యుద్ధకాలంలో బలరాముడు నాగావళీతీరాన ప్రతిష్ఠించిన పంచలింగములు, వాటిప్రాశస్త్యం: ముఖలింగాలయాలలో గాంగరాజులు నిక్షేపించిన శిల్పసంపద, అతి ప్రాచీనమై ఆంధ్రోత్కళ మైత్రీ చిహ్నమై సర్వదేవతా నిలయమైన ఈ క్షేత్ర మహాత్మ్యం; భారతదేశంలో మరెచ్చటనూ కాన్పించని శ్రీకూర్మ దివ్యక్షేత్రం; అఖిలభారత ప్రాధాన్యంగల అర్సవిల్లి సూర్యదేవాలయ విశిష్టత; జిల్లా సాహిత్య సంస్కృతీ సంక్షిప్త చరిత్ర; అచటి ప్రాచీన నామాలు, భాష; చరిత్ర ప్రసిద్ధిగాంచిన స్థలాలు; స్వాతంత్ర్య సమరంలో జిల్లావహించిన పాత్ర; ఆప్రాంతపు స్వాతంత్ర్య సమరయోధుల నామావళి మొదలగు విషయాలన్నీ ప్రథమ భాగంలో రమణీయంగా చిత్రీకరించబడినాయి.

ద్వితీయ భాగంలో శ్రీకాకుళం జిల్లా ప్రత్యేకతలు వివరించబడినాయి. ఇచట వ్యవసాయం ఎక్కువ. జలాధారాలు తక్కువ. ఏతంబావి ద్వారా నీటినితోడి పంటపొలాలకు వినియోగిస్తారు. చిన్న రైతులు ఎక్కువ. స్త్రీ జనాభా ఎక్కువ. గిరిజనులు కూడా ఎక్కువే. సముద్రజలాలలో చేపలు పట్టే బెస్తవారు, సన్ననూలు ఖాదీపని వారూ ఎక్కువే. కాని వీరందరికీ ఆదాయం మాత్రం బహుస్వల్పం. గణాంక పరిశీలన : సద్వినియోగ పర్చుకోలేక పోతున్న ప్రకృతి సంపద; నీటిపారుదల వసతులు; 1851లో తలపోయబడి, 1971లో కార్యరూపానికి వచ్చి, 1977 నాటికి పూర్తికావచ్చునని [illegible] వందేండ్ల కథ;

తీరప్రాంతంలోగల మత్స్యపరిశ్రమ: గిరిజన సమస్యలు: సన్నకారు రైతుల అభివృద్ధి: పారిశ్రామికాభివృద్ధికి గల అవకాశాలు, అవసరాలు ; గాంధీజీ ప్రశంసల నందిన చేనేత, సన్ననూలు ఖాదీ పరిశ్రమలు: ప్రజాసేవలో జిల్లాపరిషత్తు—ఇత్యాది విషయాలన్నీ గ్రంథకర్త నేర్పుగా, విపులంగా ద్వితీయ భాగంలో వ్రాశారు

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారి జన్మస్థలం, శ్రీకాకులం జిల్లా. బొబ్బిలి సంస్థానకవి మండపాక పార్వతీశ్వర శాస్త్రి: హరికథ పితామహులు, సంగీత సాహిత్య రసజ్ఞులు అయిన ఆదిభట్ల నారాయణదాసు; తెలుగు భాషా సేవాతత్పరులు, పండిత పోషకులైన శ్రీ విక్రమ దేవవర్మ; వ్యావహారిక భాషావేత్త గిడుగు రామమూర్తి పంతులు; ఆంధ్ర వైయాకరణి పర్వ్యులచిన సీతారామ శాస్త్రి; ప్రసిద్ధులైన వర్ణచిత్రకారులు కూర్మాపు నరసింహం ; కలియుగభీమ, ఇండియన్ హెర్క్యులిస్ కోడి రామమూర్తి...... ఇలా ఎందరో మహానుభావులను ఈ శ్రీకాకుళం జిల్లా దేశానికి అందించింది వంశధార నాగావళి, మహేంద్రతనయ, బాహుద అనే నదులు, సువర్ణముఖి, చంపావతి, గోముఖీ, ఝంఝావతిఅనే సెలయేళ్ళు వున్నాయి. నాగావళీ నదిపై క్రొత్తగా ఒక పెద్ద రోడ్డు వంతెన నిర్మించారు

పార్వతీపురం, పాలకొండ, సాలూరు తాలుకాలను ఏజన్సీ ప్రాంతమంటారు. శ్రీకాకుళం, బొబ్బిలి, టెక్కలి నరసన్నపేట, చీపురుపల్లి, సోంపేట, ఇచ్ఛాపురం, పాతపట్నం మొదలైనవి పెద్దపట్టణాలు, కళింగపట్టణం ఒక నాటి పెద్దరేవు పట్టణం.

అటవీ సంపద, సముద్ర సంపద, మాంగనీసు, అభ్రకం సున్నపురాయి, గ్రాఫైట్, మెస్తానారపంట మొదలైన వనరులున్నాయి వీటన్నిటినీ సద్వినియోగ పర్చుకోగలిగితే శ్రీకాకుళం జిల్లా, అనుకున్నంత వెనుక బడిన జిల్లా ఏమీ కాదు .

"రాబందుల రెక్కల చప్పుడు, పయోధర ప్రచండ ఘోషం, ఝంఝానిల షడ్జధ్వానం" విని తట్టుకోగల చావ వుంటే ఈ పుస్తకం తెరవండి అంటారు చలం, శ్రీ శ్రీ "మహాప్రస్థానం" కి యోగ్యతా పత్రం వ్రాస్తూ. కాని శ్రీకాకుళం చరిత్ర పుటలు తెరిస్తే యిష్టమున్నా లేకపోయినా, ధైర్యమున్నా లేకపోయినా, దేశాన్ని కలవరపెట్టిన నక్సలైట్ల ఉద్యమ చరిత్ర చదవాల్సి వస్తుంది. ఆ ఉద్యమం లేకుండా అది చరిత్ర అనుపించుకోదు. నిష్పక్షపాతంగా ఉద్యమ చరిత్రనుక్లుప్తంగా వేంకటరమణగారు ఈ గ్రంథంలో వ్రాయగలిగేరు. వడ్డీవ్యాపారస్తుల దౌర్జన్యాలు, నోరున్నవారిదే రాజ్యమన్నట్లు అమాయిక గిరిజనులను వివిధ వర్గాల వారు దోచుకున్నరీతి, వారి కష్టనష్టాలను, ప్రభుత్వంవారి సౌభాగ్యానికి చేస్తున్నకృషి వాస్తవంగా చిత్రీకరించారు గ్రంథకర్త. ధనిక వర్గపు దోపిడీవిధానాన్ని వర్ణిస్తూ, గిరిజనులకు కమ్యూనిస్టులు చేసిన మేలును గురించి వ్రాస్తూ, "గిరిజనుల ఉనికిని గుర్తింపజేసిన ఘనత కామ్రేడులకు దక్కింది" అని ఒక పరమ సత్యాన్ని ఈ గ్రంథంలో వ్రాశారు రమణ. ఈ సందర్భంలో భారత కమ్యూనిస్టు పార్టీలో చీలికలు వచ్చిన తీరు కూడా పొందు పర్చారు. వారు చీలి చీలి పేలికలై పోవటం, ప్రతి పేలిక తాను ఏనుగంత బలంగా వున్నానను కోవడం, తీవ్రవాద కమ్యూనిస్టు ఉద్యమం వెఱ్ఱితలలు వేయటం, ఇదంతా కనిపెడుతూవున్న ప్రభుత్వం అరాచకాన్ని సహించేది లేదంటూ ఈ పింజలన్నిటినీ ఏరిపారేయటం, దానితో కమ్యూనిస్టు ఉద్యమ ధ్యేయమే మన్ను కలిసి పోవటం—యివన్నీ ఎంతో నేర్పుగా వ్రాయబడినాయి యీ గ్రంథంలో.

జిల్లా కలెక్టర్ శ్రీ టి. మునివెంకటప్ప తమ అభిప్రాయంలో అన్నట్లు సాహిత్యపరంగా, సమాచార పరంగా, సంస్కృతీ పరంగా వ్రాయబడిన ఈ గ్రంథం శ్రీకాకుళం జిల్లా సమగ్ర దర్శిని అనుటలో సందేహంలేదు. ఈ పుస్తకాన్ని ఏవర్గంవారోకాక, ప్రతి పౌరుడూ చదవాల్సిన అవసరం వుంది

—వై. వి. రామకోటయ్య

---

# ఈ సంచికలో రచయితలు

విహారి & శాలివాహన, 26/139, అరవగూడెం, మచిలీపట్నం 521001

ఎ ఇంద్రసేనరెడ్డి, డి.పి.ఆర్.ఓ, హైదరాబాద్

పిడపర్తి రామకృష్ణారావు, టి.పి.ఆర్.ఓ. మచిలీపట్నం.

హరిగోపాల కృష్ణమూర్తి. టి.పి.ఆర్.ఓ., భద్రాచలం

మల్లిక్, 3/ఎ. పి.ఎస్. నగర్, మాసాబ్‌టాంక్, హైదరాబాద్.

సిద్ధాని నాగభూషణం, సమాచార శాఖ హైదరాబాద్

తిరుమల రామచంద్ర, 69, ఆదర్శనగర్, హైదరాబాద్

ఎస్.ఆర్. కోటేశ్వరశర్మ, డివిజనల్ ఆఫీస్, ఎల్. ఐ. సి. ఆఫ్ ఇండియా, షాపూర్‌వాడి, హైదరాబాదు

కె.ఆర్.కె మోహన్, అసిస్టెంట్ పోస్టుమాస్టర్, జూబిలీపోస్టాఫీస్ హైదరాబాదు

శ్రీమతి సి. ఆనందారామం, ఎస్ టి. 26, మారేడ్‌పల్లి, సికింద్రాబాదు

"అమరేంద్ర", డాక్టర్ సి.ఎన్. శాస్త్రి. 4/19, బ్రాడీపేట, గుంటూరు

వై.వి. రామకోటయ్య, సబ్‌ఎడిటర్, దక్కన్‌క్రానికల్, సికింద్రాబాద్.

దేవరపల్లి కేశవరావు, కార్యదర్శి, జిల్లాపరిషద్, శ్రీకాకుళం

డి. వి. గోపాలరావు, డి.పి.ఆర్.ఓ, ఆదిలాబాద్.

పి. సూర్యప్రకాశ్. తీర్థం, చిత్తూరుజిల్లా,

నాగినేని నరసింహస్వామి, టి.పి.ఆర్.ఓ., మధిర.

# జిల్లాల్లో

## పోలవరం, చింతలపూడి తాలూకాల్లో పరిశ్రమల ఆవశ్యకత

పశ్చిమగోదావరి జిల్లాలో వ్యవసాయ ప్రాతిపదికపై పరిశ్రమలను చేపట్టవలసిందిగా మార్చి 2వ తేదీన ఇక్కడ జరిగిన పారిశ్రామిక వేత్తలసభలో పరిశ్రమల డైరెక్టర్ శ్రీ కె. జయభారతరెడ్డి జిల్లాలోని అభ్యుదయ కర్షకులను కోరారు. జిల్లాలో స్ట్రాబోర్డు తయారీ పరిశ్రమలు మూడు చోట్ల నెలకొల్పబడ్డాయని వెనుకబడిన తాలూకాలైన పోలవరం, చింతపూడిలలో కూడా మరిన్ని పరిశ్రమలను స్థాపించవలసిన ఆవశ్యకత గలదని శ్రీ రెడ్డి చెప్పారు.

స్వయం ఉపాధి పథకాలను చేపట్టినవారి సమస్యలను సానుభూతితో పరిశీలించ గలమని కూడా ఆయన అన్నారు.

నిడదవోలు పట్టణంలో పారిశ్రామికవాడను నెలకొల్పాలనీ, ఆకరాడనుంచి వచ్చిన పారిశ్రామిక వేత్తలు డైరెక్టర్‌ను అభ్యర్థించారు.



గవర్నరు శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా మార్చి 12వ తేదీన విశాఖపట్నం నౌకాదళ విభాగాన్ని సందర్శించారు. ఈ సందర్భంగా గౌరవ వందనం స్వీకరిస్తోన్న దృశ్యం.

పశ్చిమ గోదావరి జిల్లాలో పరిశ్రమల స్థాపనకై తీసుకొంటున్న ప్రోత్సాహకరమైన చర్యలను గురించి కలెక్టర్ శ్రీ జి. కుమారస్వామి రెడ్డి వివరించారు.

తరువాత పరిశ్రమల డైరెక్టర్ శ్రీ జి. కుమారస్వామిరెడ్డి వ్యవసాయ-పరిశ్రమల ప్రదర్శనను సందర్శించారు.

## షాద్‌నగర్‌లో పంచాయతీ పాఠశాల భవనాలు

షాద్‌నగర్‌లో పంచాయతీ భవనం, పాఠశాల భవనాలకు పంచాయతీరాజ్ శాఖ మంత్రి శ్రీ యల్. లక్ష్మణదాస్ మార్చి 1న ప్రారంభోత్సవం చేశారు. గ్రామాలలో ఉద్యోగ కల్పన, విస్తృత పథకం క్రింద ఈ భవనాలు చౌదర్‌గూడా గ్రామంలో రు. 20 వేలు, రు. 23,500 లు ఖర్చుతో నిర్మించారు.

ఖాదీబోర్డు ఛైర్మన్ కె. కె. రెడ్డి అధ్యక్షత వహించారు.



గవర్నరు శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా మార్చి 13వ తేదీన విశాఖపట్నం హిందుస్థాన్ షిప్‌యార్డు సందర్శించిన సందర్భంగా "దుర్గ" నమూనా నౌకను స్వీకరించారు.

## సిద్ధిపేట తాలూకా గ్రామానికి విద్యుచ్ఛక్తి

ఇటీవల విద్యుచ్ఛక్తి శాఖమంత్రి శ్రీ జి. రాజారాం సిద్ధిపేట తాలూకా ఏనుగుపల్లి గ్రామంలో వీధి దీపాలకు ప్రారంభోత్సవం చేశారు. ఐదవ ప్రణాళికలో విద్యుత్ పరికరాలకు రు. 413 కోట్లు ఖర్చు చేయగలమని ఆయన అన్నారు. ఇంతకు ముందు ప్రణాళికలో రు. 372 కోట్లు ఖర్చు చేశారు. విద్యుచ్ఛక్తిని పరిశ్రమలకు వ్యవసాయానికి అధికంగా సరఫరా చేయవలసిన ఆవశ్యకతను గూర్చి మంత్రి నొక్కి చెప్పారు.

జిల్లా కలెక్టరు శ్రీ పి. చాంగ్‌సన్ మాట్లాడుతూ హరిజనులకు, వెనుకబడిన వర్గాలకు ఈ జిల్లాలో 17,500 ఇండ్ల స్థలాలు, 1976 ఫిబ్రవరి నెల ఆఖరు వరకు పంచిపెట్టినట్లు చెప్పారు.

## విశాఖ జిల్లాలో గిరిజనుల అభివృద్ధికి, మురికి పేటల నిర్మూలనకు పథకం

ప్రధానమంత్రి 20 అంశాల ఆర్థిక కార్యక్రమానికి ఎక్కువ ప్రాధాన్యతనిస్తూ—సర్వత్రా—భారత్ సేవక్ సమాజ్ కార్యక్రమాలు పునరుద్ధరించడం విస్తృతపరచడం జరుగుతుందని దక్షిణ మండలం ఆర్గనైజింగ్ కార్యదర్శి శ్రీ పి. రాజేశ్వరరావు యిటీవల మార్చి 4వ తేదీన విశాఖపట్నంలో చెప్పారు. వివిధ బ్లాకుల భారత సేవక్ సమాజ్‌ల ఛైర్మన్‌లు, పట్టణంలోని కార్యకర్తలు, జిల్లా కార్యకర్తల సమావేశంలో శ్రీ రాజేశ్వరరావు 20 అంశాల ఆర్థిక

కార్యక్రమంలో 10 అంశాలను అమలు జరుపడంలో భారత్ సేవక్ సమాజ్ చురుకుగా పాల్గొనగలదని అన్నారు.

జిల్లా విభాగం గిరిజనుల అభివృద్ధికి; పట్టణ విభాగం మురికిపేటల నిర్మూలనకూ కృషి చేయగలదని అన్నారు. పట్టణ శాఖ పౌరసౌకర్యాలు, స్వయం ఉపాధి కల్పన కార్యక్రమాలలో కూడా పాల్గొంటుంది.

సదస్సులను ఏర్పాటు చేసి; చర్చలు జరిపి, నిర్ణయాలు అమలుకు కృషి చేస్తుంది.

## సీలేరు ప్రాజెక్టు క్రింద 15 లక్షల ఎకరాల సాగుబడి

దిగువ సీలేరు ప్రాజెక్టు రాష్ట్రంలో నూతన అధ్యాయం ప్రారంభించగలదని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అన్నారు. మార్చి 4న విద్యుత్కేంద్ర ప్రారంభోత్సవ సభకు అధ్యక్షత వహిస్తూ, అటవీ ప్రాంతంలో ప్రాజెక్టునిర్మాణమునకు, రష్యన్ ఇంజనీర్లు, ఉద్యోగులు, కార్మికులు, విద్యా,వైద్య సౌకర్యాలు లేనప్పటికి శ్రద్ధతో పని చేస్తున్నందుకు ఆయన వారికి అభినందనలు తెల్పారు.

సింగరేణి బొగ్గుగనులు ఆంధ్రప్రదేశ్‌కు వరప్రసాదం వంటివని అక్కడ నుంచి పొరుగు రాష్ట్రాలకు బొగ్గు సప్లయి చేసి నష్టపోతూ వచ్చామని ముఖ్యమంత్రి అన్నారు. సూపర్ థర్మల్ స్టేషనుకు నిధులు సమకూర్చి నిర్మించినచో దేశానికి ఎంతో లాభం చేకూరగలదని ఆయన అభిప్రాయం వ్యక్తంచేశారు. వ్యవసాయ రంగంలోనే కాక, పారిశ్రామికంగా రాష్ట్ర అభివృద్ధి కొరకు కేంద్రం శ్రద్ధ వహిస్తున్నదని ముఖ్యమంత్రి తెలియపర్చారు. ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయితే సుమారు 15 లక్షల ఎకరాల భూమి సాగుబడిలోకి రాగలదని శ్రీ వెంగళరావు అన్నారు. ముఖ్యంగా రాష్ట్రంలోని హరిజనవాడలలో విద్యుత్ సౌకర్యాల కొరకు ప్రభుత్వం కృషి చేస్తోందని, 1619 హరిజనవాడలలో విద్యుత్ సరఫరా కొరకు రు 69.875 లక్షలు గ్రామీణ విద్యుత్ మండలి ఋణాలుగా ఇచ్చినదనీ, ఇప్పటికి 879 వాడలలో, విద్యుత్ సప్లయి ఏర్పాటు చేయడం జరిగిందని ముఖ్యమంత్రి చెప్పారు.

దక్షిణ రాష్ట్రాలు అన్నిరంగాలలో అభివృద్ధి చెందుతున్నందుకు ఆయన హర్షం వ్యక్తంచేశారు. రాష్ట్ర విద్యుత్ శాఖామంత్రి శ్రీ జి. రాజారాం కూడా ప్రసంగించారు



యూనియన్ బ్యాంక్ మహబూబ్ నగరం బ్రాంచి ప్రధాన మంత్రి 20సూత్రాల ఆర్థిక కార్యక్రమం పురస్కరించుకొని గొఱ్ఱెల కాపర్లకు ఋణాలనిచ్చారు. ఈ సందర్భంగా మార్చి 16న బ్యాంక్ ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో ఒక గొఱెల కాపరి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావును సన్మానిస్తున్న చిత్రం



రాష్ట్ర యాత్రికశాఖామాత్యులు శ్రీ సి. హెచ్. దేవానంద రావు మార్చి 16వ తేదీన నెల్లూరు తాలూకా బద్దెవోలు గ్రామంలో ప్రాథమిక పాఠశాల భవనానికి శంకు స్థాపన చేశారు. చిన్నతరహా నీటిపారుదల శాఖామంత్రి శ్రీ ఆనం వెంకటరెడ్డి కూడా యీ కార్యక్రమానికి హాజరయ్యారు.

## శ్రీ వెంకటేశ్వరా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవం

దారిద్ర్యం నుండి బయటపడటమే స్వాతంత్ర్యాలన్నిటిలో ముఖ్యమైనదని కేంద్రమంత్రి శ్రీ డి పి ఛటోపాధ్యాయ నిన్న శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం 19వ వార్షిక స్నాతకోత్సవంలో మాట్లాడుతూ అన్నారు.

పేదవారిని, స్వార్థపరులు తమకోసం వినియోగించుకోవడమనే సాంఘిక జాడ్యానికి దారిద్ర్యమొక చిహ్నమనీ, ఈ జాడ్యానికి నెమ్మదిగా చికిత్సచేయాలనీ, అవసరమైతే కఠిన చికిత్స చేయాలని ఆయన సభలో అన్నారు.



చిన్న తరహా నీటిపారుదలశాఖ మంత్రి శ్రీ ఆనం వెంకట రెడ్డి మార్చి 28 న నెల్లూరు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఆవరణలో బలహీన వర్గాల వారికి కుట్టుయంత్రాలను బహూకరిస్తున్న దృశ్యం. స్టేట్ బ్యాంక్ స్థానిక మేనేజరు శ్రీ టి పాండు రంగారావు యీ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

---

విద్య కొద్దిమందికి మాత్రమే పరిమితమైనట్టిదనే స్థితికి దిగజారకూడదనీ, సంస్కృతి, నమ్మకాలు మొదలైన వాటిని తెలియజేసే కేంద్రమే విశ్వవిద్యాలయమని, యిది వ్యవస్థీకృత మైనట్టిదనీ, ప్రపంచం నుండి ఎక్కువ తెలుసుకోవటాన్ని మనము నేర్చుకోవాలని శ్రీ చటోపాధ్యాయ శ్రీ పి ప్రజ్ఞాశాస్త్రి. శ్రీ జి. వెంకటశేషశాస్త్రి, కేంద్రమంత్రి శ్రీ కరన్ సింగ్ గార్లకు గౌరవ పట్టాలను ప్రధానం చేసింది మాజీ మంత్రి శ్రీ కోటిరెడ్డికి (డాక్టర్ ఆఫ్ లాస్) న్యాయకోవిద పట్టానిచ్చింది. ఈ స్నాతకోత్సవంలో ఈ విశ్వవిద్యాలయం మొత్తం 4532 మంది విద్యార్థులకు డిగ్రీలు ప్రధానం చేసింది. ఛాన్సలర్ శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా, ప్రోఛాన్సలర్ శ్రీ కృష్ణారావు స్నాతకోత్సవ సభకు వచ్చారు

విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ సచ్చిదానందమూర్తి తొలుత స్వాగతం చెప్పారు. సభ ముగింపు సమయంలో వందన సమర్పణ చేశారు.

## గురజాలలో సహకార అర్బన్ బ్యాంకు ప్రారంభం

రాష్ట్ర పంచాయితీ రాజ్ శాఖ మంత్రి శ్రీ ఎల్. లక్ష్మణ దాసు ఫిబ్రవరి 27వ తేదీన గురజాల వాసవీ సహకార అర్బన్ బ్యాంక్‌కు ప్రారంభోత్సవం చేశారు సభకు శాసన మండలి సభ్యుడు శ్రీ కె. రోశయ్య అధ్యక్షత వహించారు స్థానిక శాసన సభ్యుడు శ్రీ మందపాటి నాగిరెడ్డి సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంక్ అధ్యక్షుడు శ్రీ యేచూరి వెంకటేశ్వర్లు, సహకార బ్యాంకుల ప్రాముఖ్యతను వివరించారు. అర్బన్ బ్యాంకు అధ్యక్షుడు శ్రీ పెరుమాళ్ల నాగయ్య కార్యదక్షతను ప్రశంసించారు. శ్రీ ఎన్. పి. గురువులు వందన సమర్పణ చేశారు.

## హిందూపురం ఆస్పత్రికి 30 పడకల విభాగానికి గవర్నర్ శ్రీ సుఖాడియాచే శంకుస్థాపన

రాష్ట్ర గవర్నరు శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా అనంతపురం జిల్లా హిందుపురంలోని ప్రభుత్వ ఆస్పత్రి ఆవరణలో 30 పడకల అదనపు బ్లాక్‌కు ఇటీవల శంకుస్థాపన చేశారు

జిల్లా వైద్యశాఖాధికారి జాన్ ఫిలిప్ స్వాగతం పలికారు. ప్రజల భూరి విరాళాలతో ఇది నిర్మితమవుతున్నది.

## కర్నూలులో గవర్నర్‌కు వివిధ సంస్థలచే వినతి పత్రాల సమర్పణ

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా ఇటీవల కర్నూలు వచ్చిన సందర్భంగా అనేక సంస్థల వారు ఆయనకు వినతి పత్రాలను సమర్పించారు. అత్యయిక పరిస్థితిని ప్రకటించిన అనంతరం దేశం అన్ని రంగాలలోను అభివృద్ధి

---



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు యిటీవల నెల్లూరు జిల్లాలో తుమ్మూరు గ్రామ హరిజనులకు పట్టాలను బహూకరిస్తున్న దృశ్యం.

---

చెందుతున్నదని పేదరికం సమసిపోయేంతవరకు అత్యయిక పరిస్థితిని కొనసాగించాలని కోరుతూ జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ అబ్దుల్ రహమాన్ ఖాన్. ఉపాధ్యక్షుడు శ్రీ యస్. రామలింగయ్య సంయుక్తంగా ఒక వినతిపత్రాన్ని సమర్పించారు

స్థానిక "గుజరాతి సంఘం" తరఫున శ్రీ దామోదరదాస్ శ్రీ హరిదాస్. శ్రీ చంద్రకాంతషా సంయుక్తంగా ఒక వినతి పత్రాన్ని సమర్పిస్తూ మూడు లక్షల వ్యయంతో "సంఘం" నిర్మించనున్న కమ్యూనిటీ హాలుకు అవసరమైన ఒక ఎకరం నేలను ఉచితంగా సమకూర్చవలసిందిగా అర్థించారు.

ముస్లింలను అల్పసంఖ్యాక వర్గంగా ప్రకటించాలని ఉద్యోగాలలో వారికి తగిన ప్రాతినిధ్యం కల్పించాలని "ఉరుదు" ను రెండవ ప్రాంతీయ భాషగా గుర్తించాలని కోరుతూ పట్టణంలోని ముస్లిం యిడోనన సభ్యుడు శ్రీ సి రహమాన్ ఖాన్ నాయకత్వంలో ఒక వినతి పత్రాన్ని సమర్పించారు

## ప్రకాశం జిల్లాలో పాడిపశువుల కొనుగోలుకు ఋణ సహాయం

ప్రకాశ జిల్లాకు చెందిన ఏడు పంచాయతీ సమితులలో వెనుకబడిన సన్నకారు రైతుల పాడి పశువులు కొనుగోలు చేయ డానికి ఏజెన్సీ గ్రాంటును నుంచి 33 1/3 శాతం ధనాన్ని గ్రాంటుగా ఇవ్వనున్నట్టు పశుగణాభివృద్ధి శాఖ రీజనల్ అసిస్టెంటు డైరెక్టరు డాక్టరు ప్రభాకర్ మొన్న తెలియజేశారు

వెనుకబడిన సమితులలో పశువులను కొనుగోలు చేసే సన్న కారు రైతాంగానికి గ్రాంటుతోపాటు 20 శాతం షెడ్యూలు, వెనుక



సాంఘిక సంక్షేమ శాఖామాత్యులు శ్రీ బొట్ట శ్రీరామమూర్తి మార్చి 11 న నెల్లూరులో జరిగిన హరిజన మహాసభలో వర్ణాంతర వివాహం చేసుకొన్న దంపతులకు ప్రోత్సాహక బహుమతులను అందచేసినప్పటి దృశ్యం.

బడిన తరగతుల కార్పొరేషన్ నుండి కూడ ఋణ సహాయం లభిస్తుందని, కొనుగోలుకు అవసరమైన మిగతా ధనాన్ని జాతీయ బ్యాంకులు ఋణంగా అందజేస్తాయని ఆయన తెలియజేశారు.

మేలు జాతి పశువులను కొనుగోలు చేయడానికి వీలుగా ప్రతి ఆదివారం ఒంగోలుకు 10 కిలో మీటర్ల దూరాన గల దొడ్డ వరప్పాడులో పశువుల సంతను ఏర్పాటు చేశామని ఆయన ఇక్కడ జరిగిన సభకు అధ్యక్షత వహిస్తూ పేర్కొన్నారు. అదికాక గొర్రెలు, కోళ్ల పెంపకానికి గాను త్వరలో పథకాలను అమలు చేయాలని రైతులు అధికారులను కోరారు.

## కావలిలో సమాచార కేంద్రం ఏర్పాటు

తాలూకా సమాచార కేంద్రానికి ఇటీవల ఇక్కడ నెల్లూరు జిల్లా వైద్య శాఖాధికారి డాక్టరు వి ఎస్ సుబ్బారావు ప్రారం భోత్సవం చేశారు సభకు వైద్య అధికారి డాక్టర్ ఎల్ ఎన్. రెడ్డి అధ్యక్షత వహించారు స్వాతంత్ర్యయోధుడు శ్రీ జి బాలయ్య ప్రధాని శ్రీమతి గాంధీ చిత్రాన్ని ఆవిష్కరించారు.

తాలూకా పౌరసంబంధాల అధికారి శ్రీ వై. వి రత్నం స్వాగతం పలికారు. తాలూకా రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ కె. ఎన్. ఆర్ శర్మ, స్టేట్‌బ్యాంకు ఏజెంటు శ్రీ కె మూర్తి ప్రసంగించారు.

## ఉమ్మడి ప్రతిపాదికపై తెలంగాణాలో 19 పరిశ్రమలు

ఇటీవల రెండు రోజులపాటు స్థానిక జిల్లా పరిషత్తు ఆడి టోరియంలో ఆంధ్రప్రదేశ్ స్మాల్ స్కేల్ ఇండస్ట్రియల్ డెవలప్ మెంటు కార్పొరేషన్ వారు నిర్వహించిన తెలంగాణా ప్రాంతీయ చిన్న తరహా పరిశ్రమలవారి సదస్సుకు వరంగల్లు జిల్లా కలెక్టరు శ్రీ సమర్‌జిత్ రే అధ్యక్షత వహిస్తూ తెలంగాణా జిల్లాలలో పరి శ్రమలను నెలకొల్పడానికి పారిశ్రామిక వేత్తలు అంతగా శ్రద్ధా సక్తులను కనబరచకపోవడం వల్ల ఈ ప్రాంతంలో ఉమ్మడి ప్రాతి పదికతో పరిశ్రమలను అభివృద్ధి పరచడానికి ఆంధ్రప్రదేశ్ స్మాల్ స్కేల్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌వారు ముఖ్య మైన పథకాన్ని రూపొందించారని, ఈ అవకాశాన్ని పారిశ్రామిక వేత్తలు సద్వినియోగపరచుకోవలెనని విజ్ఞప్తి చేశారు



రాష్ట్ర ఆరోగ్యశాఖా మంత్రి శ్రీ కోదాటి రాజమల్లు మార్చి 18 వ తేదీన రాజం పేటలో ఉచిత నేత్ర చికిత్సా శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. జిల్లా కలెక్టరు శ్రీ పి యల్ సంజీవ రెడ్డి ఆంధ్రప్రదేశ్ ల్యాండ్ డెవెలప్ మెంటు బ్యాంకు పెర్సన్ ఇన్‌ఛార్జి శ్రీ బి. రత్న సభాపతి, రాజంపేట సబ్ కలెక్టర్ శ్రీ ఎ. కె. గోయల్ కూడా చిత్రంలో వున్నారు.

కార్పొరేషన్ మేనేజింగు డైరెక్టర్ శ్రీ ఎన్. కె. మురళీధర రావు మాట్లాడుతూ రాష్ట్రంలో నేటివరకు 60 పరిశ్రమలకు ఉమ్మడిగా ఆర్థిక సహాయాన్ని అందజేయడం జరిగినది. వీటిలో 30 పరిశ్రమలు ఉత్పత్తిని ప్రారంభించాయని వెల్లడించారు.



కార్మికశాఖ మంత్రి శ్రీ టి. అంజయ్య ఇటీవల కడప జిల్లా గోపవరంలో సమాచార, పౌర సంబంధ శాఖ ఆధ్వర్యంలో జాతీయ గ్రామీణ కార్మిక శిబిరంలో ఏర్పాటు చేసిన ప్రదర్శన శాలను ప్రారంభిస్తున్న దృశ్యం. భారత ప్రభుత్వ కార్మిక శాఖ ఉపకార్య దర్శి శ్రీ వి. చంద్రమౌళి, కడప జిల్లా కలెక్టర్ శ్రీ పి. యల్. సంజీవరెడ్డి ప్రభృతులు యీ చిత్రంలో వున్నారు.

## హరిజనుల సంక్షేమ కృషి

ఇటీవల హరిజన సంక్షేమంపై జిల్లాపరిషత్ హాలులో జరిగిన జిల్లా సదస్సుకు పంచాయత్ రాజ్ శాఖమంత్రి శ్రీ ఎల్. లక్ష్మణదాసు ప్రారంభోత్సవం చేస్తూ, బుద్ధుడు, రాజారామమోహన్ రాయ్, మహాత్మాగాంధీ, అంబేద్కర్ మున్నగు మహనీయులు అస్పృశ్యతా నివారణకు, కులరహిత సమాజ నిర్మాణానికి ఎంతో కృషి చేశారన్నారు. ఈ బలహీన వర్గాలకు ప్రభుత్వం రు. 26 కోట్లు ఖర్చు చేసిందంటూ హరిజనుల అభివృద్ధికి కష్టించి కృషి చేయవలసినదిగా సాంఘిక సేవా కార్యకర్తలకు ఆయన విజ్ఞప్తి చేశారు.

సర్వోదయవాది శ్రీ జి. లవణం అధ్యక్షత వహిస్తూ, అస్పృశ్యతా నివారణకు గాంధీజీ, అంబేద్కర్, సంజీవయ్య, గోరాల కృషిని వివరించారు. 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమంలో ప్రధాన భాగమైన హరిజన సంక్షేమానికి ప్రభుత్వం సంఘ సేవకులు సమిష్టిగా కృషి చేయవలసి ఉన్నదన్నారు.

పరిషత్ డిప్యూటీ సెక్రటరీ శ్రీ బి. వి. రాయలు స్వాగతం చెపుతూ జిల్లాలోని 76 లక్షల జనాభాలో 2.4 లక్షల మంది హరిజనులు, 2.12 లక్షల మంది గిరిజనుల అభివృద్ధికి కృషి చేయాలన్నారు.

## వరంగల్‌లో నాలుగవ తరగతి సిబ్బంది కాలనీకి శంకుస్థాపన

ఇటీవల వరంగల్లు జిల్లాలోని రాష్ట్ర ప్రభుత్వ నాల్గవ తరగతి ఉద్యోగుల హౌసింగ్ కాలనీకి పాత బస్‌స్టాండ్ వెనుక ఇటీవల హనుమకొండలో జిల్లా కలెక్టర్ శ్రీ యస్ రే శంకుస్థాపన చేశారు. జిల్లా రెవిన్యూ అధికారి శ్రీ టి గోపాలరావు అధ్యక్షత వహించారు. నాల్గవ తరగతి ఉద్యోగులకు నిర్బంధ రిటైర్మెంట్ నుండి మినహాయింపు యివ్వాలని ఉద్యోగాల సంఘం విజ్ఞప్తి చేసింది.

తొలుత నాల్గవ తరగతి ఉద్యోగుల జిల్లాస్థాయి సంఘం అధ్యక్షుడు శ్రీ చంద్రవందనం స్వాగతం పలికారు. శ్రీయుతులు పి ముత్తయ్య, మొహమ్మద్ అహ్మద్ షరీఫ్, ముత్యాలు, వెంకటయ్య, వి. భద్రయ్య, జిల్లా పరిషత్ కార్యదర్శి శ్రీ కె. రామచంద్రారెడ్డి, హనుమకొండ సమితి మాజీ అధ్యక్షుడు శ్రీ మాచెర్ల సత్యనారాయణ ప్రసంగించారు. శ్రీ కొండయ్య వందన సమర్పణ చేశారు

## కామారెడ్డికి త్వరలో సూపర్ బజార్

కామారెడ్డి పంచాయితీ సమితి ఇటీవల సమావేశమై 1976-77 సంవత్సర రబీ కార్యక్రమాన్ని సమీక్షచేసింది. వరి పైరుకు రోగాలు తగలకుండా నివారించడానికి వ్యవసాయశాఖ అధికారులు వెంటనే చర్యలు తీసుకోవాలని మిగిలిఉన్న రూ. 99,000లకు రైతులకు అప్పులుగా వెంటనే ఇవ్వాలని కుటుంబనియంత్రణ కార్యక్రమాలలో పంచాయతీ సంస్థలు పెద్ద ఎత్తున సహాయపడాలని, ఈ సమావేశానికి హాజరైన జిల్లాకలెక్టరు శ్రీ ప్రతాప్‌కరన్ అధికారులను, అనధికారులను కోరారు.



నెల్లూరు పార్లమెంటు సభ్యురాలు కుమారి కామాక్షయ్య ... 

నెల్లూరు పాత్రికేయులు ఇటీవల కడప జిల్లాలో పర్యటించిన సందర్భంగా గోపవరంలో గొట్టపు బావుల నీటి పారుదల పథకం గూర్చి చర్చిస్తున్న దృశ్యం

కామారెడ్డిలో అతి త్వరలోనే ఒక "సూపర్ బజారు" నెలకొల్పబడుతుందని డిప్యూటీ కలెక్టరు శ్రీ వెంకన్న యాదవ్ వెల్లడించారు.

చిన్న నీటిపారుదల పథకాల అమలు గ్రామ పంచాయతీల బకాయిల వసూళ్ళు, శ్రీ సంక్షేమ కార్యక్రమాల గురించి కూడా సమావేశం సమీక్షచేసింది.

## సుల్తానాబాదు సమితిలో ఎండపల్లికి ప్రథమస్థానం

పెద్దపల్లి తాలూకాలో సుల్తానాబాద్ సమితిలో ఎండపల్లి 1974-75 సంవత్సరానికై ఉత్తమ గ్రామపంచాయతీగా ఎన్నికైంది. ఈ గ్రామపంచాయతీలో 1974-75లో పన్నులు నూటికి నూరుపాళ్ళు వసూలు అయినాయి

హరిజనవాడకు కూడా విద్యుచ్ఛక్తి సౌకర్యం లభించింది. ఇక్కడ ఉన్న హైస్కూలుకు స్వంత భవనం కూడా ఏర్పడింది.

ఈ గ్రామపంచాయతీలో కమ్యూనిటీ రేడియో సెట్ ఉండడమేకాక ప్రస్తుత అంశాలపై చర్చాగోష్ఠులు కూడా నిర్వహిస్తున్న చర్చా మండలికి జిల్లాలో ప్రథమస్థానం లభించింది.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఏప్రిల్ 2 తేదీన ఖమ్మం పారిశ్రామిక వాడలో ఆగ్రో-ఇండస్ట్రీస్ వారి తెగుళ్ళ మందుల తయారీ కేంద్రానికి శంకుస్థాపన చేశారు. ఎక్సైజు శాఖ మంత్రి శ్రీ వి. పురుషోత్తమరెడ్డి కూడా యీ కార్యక్రమానికి హాజరయ్యారు.

## శ్రీ కాళహస్తి వ్యవసాయబ్యాంక్ నూతనభవనం

శ్రీ కాళహస్తిలో సహకార సంఘాల రిజిష్ట్రార్ శ్రీ టి. లక్ష్మారెడ్డి మార్చి 14న వ్యవసాయ బ్యాంక్ నూతనభవనానికి ప్రారంభోత్సవం చేశారు. శాసనసభ్యుడు శ్రీ ఎ. దశరథ రామరెడ్డి ప్రారంభోత్సవ సభకు అధ్యక్షత వహించారు, స్టేట్ బ్యాంక్ వ్యవసాయ శాఖ ఇంతవరకు రైతులకు నలభై ఎనిమిది లక్షలకు పైగా రుణాలు ఇచ్చిందని తెలియజేశారు. వ్యవసాయ బ్యాంక్ అధ్యక్షుడు శ్రీ సి. పుట్టారెడ్డి అతిథులకు స్వాగతంచెప్పారు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఏప్రిల్ 2వ తేదీన ఖమ్మంలో చిన్న తరహా రైతుల అభివృద్ధి ఏజన్సీవారి కూరగాయల పెంపకం దారుల సహకార సంఘాన్ని జ్యోతి వెలిగించి ప్రారంభించారు.

తాలూకాలోని రైతులకు ఇంతవరకు అరవై లక్షలకు పైగా ఆర్థిక సహాయం చేసిందని తెలిపారు.

ఇక్కడ నెలకొల్పిన "స్వర్ణలత" సూపర్ బజారుకు పట్టణ అభివృద్ధి సంస్థ అధ్యక్షులు శ్రీమతి సరోజినీపుల్లారెడ్డి ప్రారంభోత్సవము చేశారు.

## గన్నవరానికివిద్యుచ్ఛక్తి

ఖమ్మంజిల్లా మధిరతాలూకా గన్నవరం గ్రామానికి ఇటీవల విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కల్పించారు. ఖమ్మం డివిజనల్ ఇంజనీరు శ్రీ పి. భాస్కరరావు వీధి దీపాలకు ప్రారంభోత్సవం చేశారు.

## శ్రీ వెంకటేశ్వర కళ్యాణమంటపానికి ముఖ్యమంత్రిచే శంకుస్థాపన

ఏడు లక్షల రూపాయల ఖర్చుతో ఇక్కడ నెల్లూరు జిల్లా దుర్గామిటలో నిర్మించనున్న శ్రీ వేంకటేశ్వర కళ్యాణ మంటపానికి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు మార్చి 14న శంకుస్థాపన చేశారు.



గవర్నరు శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా కర్నూలు జిల్లాలోని పర్ల గ్రామంలో ఒక కూర్మ యువతికి గొఱ్ఱెల పెంపకం కేంద్రం ఏర్పాటుచేసుకొనే నిమిత్తం రుణ పత్రాన్ని బహూకరించారు. జిల్లా కలెక్టర్ శ్రీ కోసల రాం కూడా యీ చిత్రంలో వున్నారు.

ఈ సందర్భంలో జరిగిన సభలో ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు మాట్లాడుతూ ఏటా రెండు కోట్ల రూపాయల మొత్తాన్ని నిలవలో వుంచాలని తాము తిరుమల దేవస్థానంవారికి సూచించినట్లు తెలియ చేశారు. ప్రతి దేవస్థానంలో వచ్చే ఆదాయంలో 20 వంతు మూల ధనంగా వుంచితేగాని బడ్జెట్ శాంక్షన్ చేయడం జరగదని ఆయన అన్నారు.

## నెల్లటూరులో సబ్బుల ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం

ప్రముఖ మైకా గని యజమాని నెల్లూరు జిల్లా రాపూరులోని జూనియర్ కాలేజి దాత శ్రీ సి. పి. క్రిష్ణయ్య నెల్లటూరులో "సునిల్ సోప్" ఫ్యాక్టరీకి ఇటీవల ప్రారంభోత్సవంచేశారు.

ఈ పరిశ్రమను స్వయంఉపాధి కల్పన పథకం క్రింద నెలకొల్పారు. గూడూరు స్టేట్ బ్యాంకివారు ఆర్థిక సహాయంచేశారు. ఉత్పత్తి అయిన సబ్బులను మార్కెట్లకు కోటలోని జూనియరు మహిళాకాలేజి దాత శ్రీమతి చేజెట్టి వనజాక్షమ్మ విడుదల చేశారు.

స్టేట్ బ్యాంకి మేనేజరు శ్రీ ఎన్. సూర్యనారాయణమూర్తి, స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్ మేనేజరు శ్రీ పి. శేషశయనం, ఫీల్డ్ ఆఫీసరు శ్రీ జి. ఎస్.వి. సుబ్బారావు సభలో ఉపన్యసించారు. పరిశ్రమ యజమాని శ్రీ సి.సుధాకర్ తొలుత స్వాగతం పలికారు.

## ఖమ్మంలో ప్రైవేటు రంగంలో ఐస్ ఫ్యాక్టరీ స్థాపన

ఇక్కడ ప్రైవేటురంగంలో స్థాపించిన ఒక ఐస్ ఫ్యాక్టరీకి జిల్లాకలెక్టరు శ్రీ పి.వి ఆర్.కె. ప్రసాద్ ఇటీవల ప్రారంభోత్సవం చేశారు. ఈ ఫ్యాక్టరీ యజమాని శ్రీ ఆర్. అంజయ్య మూడులక్షల 50 వేల వ్యయంతో నిర్మించిన ఈ ఫ్యాక్టరీకి రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ ఒక లక్ష అయిదువేలు ఋణ సహకారంకల్పించింది. ఇది రోజుకుమూడు టన్నుల ఐస్‌ను ఉత్పత్తిచేస్తుంది ఇలాంటి పరిశ్రమ ఈ జిల్లాలో ఇదే మొదటిది.

ఈ సంవత్సరం ఖమ్మం జిల్లాలో పరిశ్రమల శాఖ 3 లక్షల 76 వేల రూపాయలను 55 చిన్నసంస్థలకు ఋణంగా అందజేసిందని జిల్లా కలెక్టరు తెలియజేశారు జిల్లాలో చిన్న పరిశ్రమల స్థాపనకు ప్రజలు ముందుకు రావాలని ఆయన కోరారు శ్రీ సత్యం స్వాగతం చెప్పారు శ్రీ ఇసాక్, శ్రీ కొలిపాక కృష్ణారావు ప్రభృతులు ప్రసంగించారు డాక్టరు లక్ష్మీనారాయణ వందన సమర్పణచేశారు

## రేపల్లె నేత్ర చికిత్సాశిబిరంలో 443 కంటి ఆపరేషన్లు

గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రి నేత్ర చికిత్సా విభాగం సహకారంతో స్థానిక రొటరీక్లబ్ వారు యిటీవల ఇక్కడ ఉచిత నేత్ర చికిత్సా శిబిరం నిర్వహించారు డాక్టర్ దయాకర్ నాయకత్వాన ఈ శిబిరంలో మొత్తం 443 కంటి ఆపరేషన్లు నిర్వహించారు. ఈ సందర్భంలో శనివారం నాడు జరిగిన సభకు డిప్యూటి కలెక్టర్ శ్రీ పాల్‌భయాన్ ముఖ్యఅతిథిగా విచ్చేశారు. తొలుత రోటరీక్లబ్ అధ్యక్షుడు శ్రీ బి. రామచంద్రరావు స్వాగతం పలుకుతూ, ఈ శిబిరంలో నిర్వహించిన ప్రతి కంటి అపరేషన్‌కూ ఇంగ్లండ్‌లోని 'స్వఫ్‌హామ్ నార్ ఫోక్' సంస్థ 2 పౌండ్లు 10 షిల్లింగులు విరాళంగా ఇవ్వటానికి సంసిద్ధత వ్యక్తంచేసిందని చెప్పారు. గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రి సూపరింటెండెంట్ శ్రీ వై ఆర్.రెడ్డి రోటరీక్లబ్ తరపున రోగులకు కళ్ళజోళ్ళుపంచి పెట్టారు

శిబిర నాయకుడు డాక్టర్ మైనేని శీతారామయ్య, శ్రీయుతులు మద్దిజవహర్, మైనేని రాజగోపాలరావు, వెనిగళ్ళ సుబ్బారావు, డాక్టర్ దయాకర్ ప్రసంగించారు.



రాష్ట్ర గవర్నరు శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా కర్నూలు జిల్లాలో కొంగన వాడ గ్రామ హరిజనులకు ఇండ్ల స్థలాల పట్టాలను బహూకరిస్తున్న చిత్రం.

## వనపర్తిలో కల్యాణ మంటప భవన శంకుస్థాపన

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఇటీవల ఇక్కడ కల్యాణ మంటప భవన నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. లక్ష్మీదేవి ఆర్ట్సు, సైన్సు డిగ్రీ కళాశాలకు కూడా ఆయన ప్రారంభోత్సవం చేశారు.

ఇక్కడ ఏర్పాటు చేసిన బహిరంగ సభలో శ్రీ వెంగళరావు పది కొండు గ్రామాలకు చెందిన వెనుకబడిన తరగతులవారికి 872 ఇండ్ల స్థలాల పట్టాలు పంచిపెట్టారు. చిల్లర దుకాణాలు పెట్టుకోవడానికి గాను వెనుకబడిన తరగతుల వారికి 02 700 రూపాయిలు పంచిపెట్టారు. ఆంధ్రాబ్యాంక్ స్థానిక శాఖ ఈ ఆర్థిక సహాయాన్ని మంజూరు చేసింది. స్వయం ఉపాధి పథకాలకు గాను హైదరాబాదు స్టేట్ బ్యాంక్ శాఖ మంజూరు చేసిన 25700 రూపాయలను ఇక్కడ బలహీన వర్గాలవారికి శ్రీ వెంగళరావు పంచి పెట్టారు. శాసన సభ్యుడు శ్రీ అయ్యప్ప ఈ సభకు అధ్యక్షత వహించారు. పార్లమెంటు సభ్యుడు శ్రీ రాజారామేశ్వరరావు, రాష్ట్ర ఖాదీ బోర్డు అధ్యక్షుడు శ్రీ కె కె రెడ్డి సభకు హాజరైనారు.

ఇక్కడ నిర్మిస్తున్న వెంగళరావు నగర్ నాన్ గజిటెట్ ఉద్యోగుల కాలనీకి ముఖ్యమంత్రి శ్రీజలగం వెంగళరావు శంకుస్థాపన చేశారు. ఈ కాలనీలో 210 ఇండ్లు నిర్మిస్తారు. ఇక్కడ మహిళా మండలి భవన నిర్మాణానికికూడా శంకుస్థాపన చేశారు. స్థానిక సివిల్ ఆసుపత్రిలో ప్రసూతివార్డుకు ఆయన ప్రారంభోత్సవం చేశారు.

## చింతపల్లి సమితిలో విస్తృతంగా ఇళ్ల స్థలముల పంపిణీ కార్యక్రమము

దేవరకొండ తాలూకాలోని, చింతపల్లి పంచాయతీలో ఇటీవల హరిజనులకు, ఇతర వెనుకబడిన వర్గముల ప్రజలకు ఇండ్ల స్థలముల పంపిణీ కార్యక్రమము చేపట్టబడినది.



పంచాయత్ రాజ్ శాఖామాత్యులు శ్రీటికలాపు లక్ష్మణదాసు మార్చి 7 వ తేదీన నెల్లూరు జిల్లా పరిషత్ కార్యాలయంలో జరిగిన పంచాయతీ సమితుల ప్రత్యేకాధికార్లు మండలి అభివృద్ధి అధికార్ల సమావేశాన్ని దేశించి ప్రసంగించారు. జిల్లా కలెక్టర్ శ్రీ సి అర్జునరావు కూడా యి చిత్రంలో వున్నారు.

---

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ 20 సూత్రముల ఆర్థిక కార్యక్రమముల పట్ల ఇటు అధికారులు, అటు ప్రజలు శ్రద్ధవుంచి మంచి ఉత్సాహముతో అమలు జరుపుతున్నారు.

ఫిబ్రవరి 28 తేదీన, నామాపురము, చామలపల్లి, గానుగుపల్లి, కుర్మపల్లి, చిట్టంపహాడు, తిర్మలాపురం, రాజ్యతండా, ఖుదాబక్షిపల్లి, కమ్మగూడెం, బ్రాహ్మణగౌరారం, ప్రజలు తండోప తండలుగా చింతపల్లి వచ్చి నివాస గృహములకుగాను మంజూరీ అయిన 505 అయిదువందల అయిదు పట్టా సర్టిఫికట్లు స్వీకరించారు. మొత్తము 38 ఎకరముల భూమి ఈ విధంగా పంపకము జరిగినది.

పట్టా ప్రధానోత్సవానికి, దేవరకొండ సహకార మార్కెటు కమిటీ అధ్యక్షుడు హాజరయి, తాను స్వయముగా పట్టాలను పంచిపెట్టారు.

---

**అత్యవసర పరిస్థితి సామాన్యుడి స్థితిగతులను మెరుగుపరచేందుకు మంత్రదండంలా పని చేసింది. దీని వల్ల లాభాలు అధికోత్పత్తి, క్రమశిక్షణ.**

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT GOVT. CENTRAL PRESS, HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION & PUBLIC RELATIONS ANDHRA PRADESH, HYDERABAD.

స్వీయ చరిత్ర ఆధారంగా - బుజ్జాయి































(ఇంకా వుంది)-

